# జాలిలేని జాబిలి

కొమ్మూరి వేణుగోపాలరావు

నా అనుభవాల్ని తన అనుభవా
కష్టంలో పరితపించి, సుఖ
ప్రాణ మిత్రుడు రామలింగే
అహం 'రాము
ప్రేమ తో

— వే

రచయిత యితర నవలలు :

పెంకుటిల్లు
ఆత్మజ్యోతి
శారద (చిన్నకథ)
గోరంటాకు
సంకెళ్లు
మేడలో నీడలు
విషవలయం

# జాలిలేని జాబిలి

అంతలో అతని కథలోకి ఓ పదేళ్ళ పాప ప్ర
చించి. ఆ అమ్మాయి ఓ చచ్చిపోయిన రామచిలుకని చూ
ఆ అమ్మాయి ఏడ్చింది. ఇంతలోనే ఎలుకవచ్చి "
నువ్వెందు కేడుస్తున్నావమ్మా?" అనడిగింది జాలిగా.
"చిలుక చచ్చిపోయింది" అని చెప్పింది. "ఈ చిలు
అందంగా వున్నదో చూడు ఎలుకా! ఆకుపచ్చగా
మాగా, ఏమి సొగసు!! పాపం దాని ఆయుష్షు!
ఎలుక ఆలోచించింది. "నే బ్రతికించనా పాపా
"నా ప్రాణాం యిచ్చి" "అమ్మో! మరి నువ్వు
"చిలుక అందంగా వుంటుంది. నేను వుండను.
అసహ్యించుకుంటారు. చిలుకని చూసి ఆనందిస్తా
ప్రాణాం వుండి లాభమేమి?" అని అది తన ప్రాణ
టానికి ఆయత్తపడింది పాప భయంతో జలదరిం
దాన్ని ప్రాధేయపడి, వారించి "పపంచంలో వి
ప్రాణంలేదు ఎలుకా. గుర్తుందా నువ్వోసారి సింహాన్ని రి
చావు. ఓ వేటగాడి గాలినుండి అనేక పావురాల్ని కా
డావు. వద్దువద్దు. నువ్వు ఆత్మహత్య చేసుకోవద్దు" అం
మళ్ళీ ఏడ్చింది.

"నువ్వు యిప్పు ... న్నావమ్మా?"
"నాకు ఊరు ...

అంతలోనే ...

గంటలు కొట్టారు. అతను బాగా అలిసిపోయాడు.
నొప్పులు పుట్టాయి. తల అంతా గంద్రగోళమై
లేచి లైటు తీసేశాడు. అతనికి భయంవేసింది.
మంచం వుండగు తల్లీ, తండ్రీ పడుకుని వున్న
వెళ్ళి చీకట్లో తడుముకుంటూ తన మంచం
పడుకున్నాడు. మరునిమిషంలో గాఢంగా నిద్ర

## 2

స్వాతి అంటే మధుబాబుకు చిన్నప్పటినుంచీ
ఆమె అతనికంటే వయస్సులో రెండు సంవత్సరాలు
పదిహేడేళ్ళకే మాతృత్వంలోని సాధక బాధకాలు
భవించేసింది. స్కూల్ ఫైనల్ వరకూ చదువుకుంది సర
తి. పరీక్షలయిపోగానే పెళ్ళికావటం, కొద్ది మాసాల్లోనే
పురానికి వెళ్ళిపోవట... ది తిరిగేసరికి మాతృమూర్తి
వటం గబగబ జరి...

ఆమె ... న్నప్పుడు అతను
... సి స్కూలికి

తళతళ మెరిసే శరీరచ్ఛాయా, చెంపకు చారడేసి కళ్ళు. మాప రులని మంత్రముగ్ధులని చేసే లావణ్యం, ఎప్పుడూ చిరు నవ్వుతో కళకళలాడుతూ వుండేది

ఆమె ఎవరో యీ పిల్లలకు తెలియదు. అక ఎట్లా వచ్చిందో అంతకంటే తెలియదు. కాని రోజూ వచ్చేపోయేవాళ్ళ కిటికీ దగ్గర నిలబడి సకౌతుకంగా చ వుండేవి. ఓ సాయంత్రం బడినుంచి తిరిగి వస్తూన తలుపులుతీసి గుమ్మం యివతలకు వచ్చి చేయెత్తి పి తమనేనా అనుకున్నారు మొదట. "నా దగ్గరకు ర అన్నది మల్లీ మృదుకంఠంతో. మధుబాబుకు ఆమె దగ పోదామని ఆత్రంగా వుంది. కాని సరస్వత యిస్తోంది - ఈ అపరిచిత యువతి చెంతకు ఎట్లా వెళ్ళటం అని? మధుబాబు చొరవచేసి అక్క చెయ్యిపట్టుకుని మెల్లి అక్కడికి తీసుకుపోయాడు.

"సందేహిస్తున్నారు కదూ" అన్నది ఆమె ముత్యా వంటి పలువరస ప్రదర్శిస్తూ నవ్వి.

అక్కా, తమ్ముడూ సిగ్గుతో తలవంచుకున్నారు.

ఆ స్త్రీ పేరు రజని. కూలీనాలీ చేసుకునే వాళ్ళ కుటు బంలో జన్మించింది. బాల్యంలోనే తల్లినీ, తండ్రినీ పోగొ కున్న హతభాగిని. అప్పటనుంచీ తెలిసినవాళ్ళు ఎవరో రకు చేరదీసి కొంచం పెద్దదయినాక తమతో పాటు కూలికి తీసుకుపోతూ పెంచారు. పదహారేళ్ళ నూతన యవ్వనం తనని పెంచిన వాళ్ళతో కలిసి బెజవాడ వచ్చేసింది. వ

పని చేసుకునే వారిలో యీ సౌందర్యం, సోయగం, సుకుమారత్వం అరుదుకదా. యువకులు పిచ్చెక్కిపోయారు. వలలు పన్నారు. వాళ్ళు ఎంతవరకు సఫలీకృతులైనారో తెలియదుగాని మె పనిచేస్తోన్న సున్నపుమిల్లు యజమాని రాజయ్య కళ్ళు ఆమెమీద పడినై. అజమాయిషీ చేసే నెపంతో వాళ్ళమధ్యకు వచ్చి ఆమెనిచూసి గుటకలు తూ వుండేవాడు. నలభయి ఏళ్లు పైబడిన మనిషి ఈ వ్యామోహానికి తట్టుకోలేక పోయాడు. ఓరోజు హ్నం విరామ సమయంలో ఆమె చెట్టుకు చేరగిలబడి ండగావచ్చి "నీకు డబ్బుయిస్తాను. ఇల్లు అమరుస్తాను సౌకర్యాలూసమకూర్చుతాను. నాతోవచ్చేస్తావా?" అనడిగాడు.

ఆమె లేచినిల్చుని తన పెద్దపెద్ద కళ్ళను ఎత్తి ఆతని వంక సాలోచనగా చూసింది. ఒక్క నిముషంలో అంతా ర్ణయించుకుంది. "వస్తాను" అంది నిమ్మళంగా.

అంతే. రాజయ్యగారు ఓ పెంకుటిల్లు తీసుకుని ఆమెను అందులోవుంచాడు. కావలసిన సామాగ్రి అంతా కొన్నాడు. నెలకు యింత అని పైకం యిస్తూండేవాడు. రజని అనే పేరు ఆయన ప్రేమతో పెట్టిందే కావచ్చు.

యువకుల కల్లోలం ఏమీ తగ్గలేదు.

రాజయ్యగారు మంచి నిఘా వుంచారు.

ఈవంటరితనంలో యీ అక్కా తమ్ముళ్ళు తోడు యినారు రజనికి. రోజూ యింటికి పోయేటప్పుడు అరగంట

కాలక్షేపం యిక్కడ. బిస్కట్లూ, కాఫీ యిస్తూండేది వాళ్ళతో ఆ కబుర్లూ యీకబుర్లూ చెబుతూండేది. ఆమెను చదువురాదు. నేర్చుకోవాలన్న జిజ్ఞాసలేదు. "చినబాబూ!" అని పిలుస్తూండేది మధుబాబును. ఎంతో ఆప్యాయంగా చూసేది యిద్దర్నీ.

కొన్నాళ్ళకు సరస్వతి వెళ్ళిపోయింది.

మధుబాబు వంటరిగా మిగిలాడు. మరుసటిసంవత్సరం స్కూలికి వంటరిగా పోతుంటే ఏడుపువచ్చేది. ఈ స్థితిలో రజని అతనికి మరింతదగ్గరగావచ్చింది. ఊరటకలిగేది ఆమె సాన్నిధ్యంలో. వాళ్ళు ఆప్తమిత్రులు లయిపోయారు. సరస్వతి అప్పుడప్పుడూ యిక్కడకు వచ్చినప్పుడు వెళ్ళి రజనిని చూచివస్తూండేది. నాసి జన్మించినప్పుడు రజని అభినందనలు పంపించింది, ఇప్పుడు నాసీ మరిలేదు.

ఆ మరునాడు ఈ విషయం చెప్పటానికి మధుబాబు ఆమె యింటికి వెళ్ళాడు.

ఇంటికి తాళం పెట్టివుంది.

ఎక్కడికైనా వెళ్ళిందేమో అనుకున్నాడు. కాసేపు ఎదురు చూశాడు. ఎంతకూ రాలేదు రజని.

ఎదురుగావున్న కిల్లీషాపువాడు చెయ్యెత్తి పిచ్చాడు, మధుబాబువంక

మధుబాబు వెళ్లాడు. "రజని కోసమా?" అన్నాడు పాపువాడు.

"అవును" అన్నాడు.

"లేదు. మరి రాదు."

"ఎక్కడకు వెళ్ళింది?"

పాపువాడు వక్రంగా నవ్వాడు "లేచి పోయింది."

చిన్నపిల్లవాడుకాదు మధుబాబు. అతనికి అర్థమైంది. చికాగ్గా, ఆవేదనగా యింటిదారి పట్టాడు.

## 3

తన మొదటి కథను అతడే పత్రికకీ పంపించలేదు. అంటే దీని అర్థం ఆ కథ గురించి పూర్తిగా మరచిపోయాడనికాదు. తర్వాత చదువుకుంటే అందులో ఎన్నో తప్పులు కనిపించాయి. ఏదో తెలియని గొప్పతనం అందులో వున్నట్లు తోచేదిగాని—అదేమిటో మనసుకి తట్టేదికాదు. అదీగాక అతనికి చిన్నప్పటినుంచీ పద్యాలంటే తలనొప్పి. వేమన పద్యాలూ, సుమతీ శతకమూ చదవకుండానే అ[illegible]లిమెంటరీ స్కూల్ చదువు పూర్తయింది పద్యాలు[illegible] పట్టుకోపోవటంవల్ల భాష స్వాధీనం అయ్యేదికాదు. కప్పుడు కొత్తగా, తడుముకున్నట్లుగా ఉండేది.

అతను ఎనిమిది తొమ్మిది సంవత్సరాల వయస్సులో వున్న
ప్పటినుంచీ కథలూ, నవలలూ విరివిగా చదివేవాడు.
తోపుడుబళ్ళలో అరణాల కొచ్చే నవలలు యింటింటికీ
తెచ్చి అమ్ముతూ, అద్దెకిస్తూ వుండేవాళ్ళు. మధుబాబు
తల్లి సుందరమ్మగారికి యీ నవలలపిచ్చి జాస్తిగా వుండే
అప్పట్లో ఎక్కువగా కొవ్వలి, జంపన నవలలు వచ్చే
మధుబాబు అవి ఆసక్తిగా చదివేవాడు. తండ్రి చూడకు
పాఠ్యపుస్తకాల క్రింద పెట్టుకుని చదువుతూ వుండే
కర్ణంగారి విశ్వనాథంగారు ఎప్పుడైనా చూడటం
ఆయన తలవాచేటట్లు చీవాట్లు పెట్టేవాడు. ఆయన
బిజినెస్ గొడవ, ఊళ్ళు తిరగటం యిదితప్ప యీ
త్వం, పుస్తకాలు ఏమీపట్టేవికావు యీ కొడుకు
చదివితే పాఠాల్లో వెనకబడి పోతాడని భయం.
ఆయన కంటబడినప్పుడు కోపపడ్డమే గాకుండా
పోయాక దగ్గరకు పిలిచి, ఆ వయస్సులో ఆ
చదువు సంధ్యలూతప్ప కుర్రాళ్ళకి మరే వ్యా
వుండకూడదని ఓ గంటసేపు ఉపన్యాసం యిచ్చే
మధుబాబు క్షణాల్లో అదంతా మరిచిపొయ్యేవా
పుస్తకాలు నచ్చుతున్నాయి. గొప్పగా ఉన్నా
చదువుతూంటే ఊహాలోకంలో, ఓ తన్మయత్వా
పోయేవాడు. ఈ అనుభూతిని చూస్తూ
సాయంత్రాలు డాబామీద చేరి, క్రిష్ణ
చదువుతూ వుండేవాడు సుదరు

మందలించ లేదు. మధుబాబు తను యిలా చదవటమే గాకుండా పెద్దయి సంపాదనాపరుడయ్యాక, యీ పుస్తకాలన్నీ మళ్ళీ తెప్పించి, బైండు చేయించి యింట్లో అలంకరించాలని ఉవ్విళ్ళూరుతూ వుండేవాడు.

ఆరాత్రి రాసిన కాయితాలు జాగ్రత్తగా డ్రాయరులో దాచుకున్నాడు. స్నేహితులైతే చాలామంది రుగానీ-నవ్వుతారనీ, ఎగతాళి చేస్తారనీ ఈ విషయం . క్లాసులో ఎప్పుడూ పరధ్యానంగా వుండటం, ందా ఏవో వ్రాతలు వ్రాస్తూ వుండటం, ఓ డు చూసి "నీవు ఎప్పటికైనా గొప్ప కథకుడు అవు అని నిజాయితీగా పలికేసరికి ప్రక్కవాళ్ళంతా హా, నీవా!" అని ఎద్దేవా చేశారు. అందు చూపించ లేదు.

ఓ రోజున విశ్వనాథంగారు కొడుకు ఇంట్లో లేని పెన్సిల్ కావల్సివచ్చి డ్రాయరు సొరుగు వెదుకు ఆ కాయితాలు కనిపించాయి. అవేమిటో తెలుసు ంతపోయి నిలబడ్డారు. శాస్త్ర చదివారు. కోపంతో గబగబ భార్యదగ్గర కొచ్చారు. "చూడు, నీ చేస్తున్న ఘనకార్యం వీడు కథలుకూడా అల్లూ ఇలా అయితే బాగుపడ్డట్టే! ఇకంతా నీ ప్రోత్సా తీని పాడుచేస్తున్నావు." అని కేక

వంట చేస్తున్న సుందరమ్మగారు తెల్లబోతూ యిటు తిరిగి "మధ్య నేనేం చేశానండీ?" అంది లేచి నిలబడుతూ.

"ఏడిశావ్! ఇదంతా చేసింది న[illegible] కాదూ! [illegible] మైన పుస్తకాలూ తెప్పించి నీ పిచ్చి వా[illegible] అంత గట్టావు ఏడిశాడు! ఎక్కడున్నాడు? [illegible] ఈసారి ఆ వెధవ పుస్తకాలు చదువుత[illegible] వాటిని చించి పారేస్తాను. ఏమనుకు[illegible] పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ [illegible] పోయాడు.

ఆ తరువాత మధుబాబును శిక్షి[illegible] అలమట చెందాడు మధుబాబు.

నాని చావు తెచ్చిన విషణ్ణ వాతావరణం [illegible] అంతరించింది. దేశంలో హిందూ - ముస్లి[illegible] కూడా సర్దుకున్నాయి. [illegible] నుంచి ఉత్తరం రాసింది.

మధుబాబు స్కూలుఫైనల్ [illegible] చదవసాగాడు.

## 4

మధుబాబు కాలేజీలో చేరాడు. ఆ [illegible] మొదట్లో చాలా కొత్తగా కనిపించింది. [illegible]

మధురంగా వుంటుందని ఇదివరకు చాలామంది అం టూంటే విన్నాడు. మొదటి రెండు మూడు నెలలూ అదే మాటలో అతనికి అంతుపట్టలేదు. అదీగాకుండా అతను తీసు కున్నది ... కాబట్టి వొత్తిగా తీరికలేకుండా, ...గతా గ్రూపులవాళ్ళు, ఉషారుగా, ...తూ వుండేవాళ్లు. కేంటిన్‌లోనూ చెట్ల ...కూర్చుని అల్లరిచేస్తూండేవాళ్ళు. వాళ్ళని ...గా వుండేది మధుబాబుకు.

...కాలేజీ ఎలక్షన్లొచ్చాయి. కాలేజి అంతా ...గా నిండిపోయింది. విద్యార్థుల హక్కుల్ని కాపాడ ...కేంటూ కొంతమంది ప్రతినిధులు బయల్దేరారు. క్లాసు ...కి పోవటం, కాళ్ళు వొణుకుతుండగా ఉపన్యాసాల ...ంటివి యివ్వటం, కూర్చున్నవారిలోంచి అవతలివర్గం... ...కు లేచి అల్లరిచేయటం, ఉభయపక్షాలవారూ ఒకరి కొకరు వార్నింగులిచ్చుకోవటం. పొన్నులాటలు, రాజీలు యిట్లావుంది వాతావరణం.

మధుబాబుకు యీ తతంగమంతా చికాకుకలిగిం చింది. ఉభయ పక్షాలలోనూ ఎవరుకూడా అతనికి అయిన వారుకారు. అందుకని పట్టించుకోకుండా ముభావంగా చూస్తూ ఊరుకున్నాడు.

ఎన్నికలు ముగిశాక కాలేజి మేగజైన్‌కి విద్యార్థు ల్నుంచి సంపాదకుల్ని ఎన్నుకునే నిమిత్తం పోటీ జరిగింది. మధుబాబుకువున్న వ్యాపకం తెలిసిన వాళ్ళెవరో యీ

సంగతి అతని చెవిలో ఊది "ప్రయత్నించు, పోయిన దేముంది?" అని సలహా యిచ్చారు. అతన్లో ఆశ మొలకెత్తింది. "నిజమే! మంచి సంగతి."

అతను పోటీలో పాల్గొన్నాడు. అంశం ఏమిటంటే: "ప్రజా కవిత్వమంటే ఏమిటి?"

అతని ఉత్సాహం చచ్చిపోయింది. ఈ కవిత్వాన్ని గురించి తనకు బొత్తిగా తెలియదు. ప్రజా కవిత్వాలు బహుశా ప్రజా సమస్యలకు చేరువుగా వున్న కవిత్వమై వుంటుంది మరి దాని లక్షణాల మాటో? అతనికి అంత లేదు. ఇష్టం వచ్చినట్లు రెండు పేజీలురాసి బయట పడేశాడు. ఫలితం ఏమంటే అతను సెలక్ట్ కాలేదు.

అతనికి కోపం వచ్చినమాట నిజమేగాని- వీళ్ళ మొహం, వీళ్ళు నా అర్హతని కొలిచేవాళ్ళా? అన్నట్లు పెట్టి సంతృప్తి పడటం వగైరాలు ఏమీ చేయలేదు. మంచి అవకాశం చేయిజారి పోయినట్లు బాధపడ్డాడు. కాలేజీలో తాను షైన్ అయ్యే ఛాన్స్ చేయిజారి పోయింది

ఆ ఛాన్స్ అతనికి వేదికమీద ఎక్కి ఉపన్యాసాలు దంచినా, నాటకాలలో నటించినా వచ్చివుండేది. కాలేజి వాతావరణంలో నిర్భయంగా స్టేజిమీదకు ఎక్కి నాలుగు ముక్కలు చెప్పగలిగినవాడే స్పీకర్ క్రింద చలామణీ అవుతాడు. చెప్పేదాంట్లో పెద్ద స్టఫ్ వుండనక్కరలేదు ఒక్క ముక్కలో చెప్పాలంటే స్టేజిఫియర్ లేకపోతే అతను స్పీకర్ అయిపోయాడన్నమాట. మధుబాబుకు యీ సవాం [illegible]

ఏమిటో నవ్వొస్తోంది. ఈ మాట్లాడేవాళ్ళందరికంటే తనకు చాలా ఎక్కువ విషయాలు తెలుసు. కాని వాటికి స్వరూపం యివ్వలేని స్థితిలో నలుగురిముందూ బడబడ లాడటం వాచాలత అనిపించుకుంటుందని ఉద్దేశం.

అతని పుస్తకపఠనం ఎక్కువయింది. ఆటపాటల్లో అభిరుచి లేకపోవటంవల్ల టైమంతా కొత్తపుస్తకాలు చదవటంలోనే గడిపేవాడు.

దానితోపాటు రాయాలన్న జిజ్ఞాసకూడా అధికం అయింది. ఏమిరాయాలో, ఎందుకు రాయాలో తెలీని పేజీలకు పేజీలు రాసివేయసాగాడు. అతని మనస్సులో ఎప్పుడూ ఏదో ఆలోచన మెదుల్తూ వుండేది. రాత్రంతా నిద్రలేకుండా ఆలోచనల్తోనే సరిపోయేది. గంటకో నూతన భావ్యతా స్ఫురిస్తూవుండేది. ఊహాపథంలో వచ్చిన ప్రతివిషయం కాగితంమీదకు ఎక్కిస్తూ వుండేవాడు. తండ్రి చూడకుండా డాబామీదకు ఎక్కి గది తలుపులు బిడాయించుకుని, లేకపోతే కాలేజీలో ఖాళీగా వున్న క్లాస్ రూమ్సులో కూర్చుని రాసేస్తూ వుండేవాడు. ఒక నెల్లో పదిహేను కథలు తయారుచేశాడు. తరువాత అవి చూసుకుని "అబ్బా! యివన్నీ నేనేరాశానా?" అని నివ్వెరపోయాడు. వాటిని యింట్లో పెట్టుకుని పూజించటం అతని ఉద్దేశంకాదు. తన రచన, పేరు అచ్చులో చూసుకోవాలన్న తాపత్రయానికి లోటులేదు. గబగబ ఒకరోజు స్టాంపులు తెచ్చి వాటిని వివిధ పత్రికలకీ పంపించేశాడు. పత్రికలవాళ్ళు

దగ్గర్నుంచి జవాబువస్తే ఇంట్లో చూస్తానని కాలేజి ఎ యిచ్చాడు.

అయితేఅవన్నీఅతని ఊహాలోకంలో ఎగురుతుంటూ వచ్చిన యితివృత్తాలే. వాటిలోని నిజానిజాలు, సహజత్వం వీటిని గురించి అతనికి తెలియదు.

నెల తిరిగింది. మధుబాబు అన్నిట్లోనూ జాగ్రత్తగా స్టాంపులుపెట్టి పంపించటంవల్ల వాటిగురించి అతనికి తెలి కుండా వుండే పరిస్థితి ఏర్పడలేదు. ఒకదానివెంట ఒకటి తిరిగి రాసాగినై. తృంగిపోవటమంటే ఏమిటో జీవితంలో మొదటిసారిగా తెలిసివచ్చింది మధుబాబుకు. ఒక్కొక్క తిరిగి వస్తోంటే కళ్ళనీళ్ళ పర్యంతం అయేది. కాని అవి మళ్ళీ చదువుతోంటే అన్ని తప్పుల కుప్పలుగా కనిపించేవి "ఇన్నితప్పులు ఎట్లా రాశాను!" అని సతమతమయేవాడు అయితే అతని ఆశ్చర్యం మేరకు పంపించిన వాటిల్లో రెండు కథలు రెండు పత్రికల్లో ప్రచురించబడ్డాయి ఒకటి మాస పత్రిక, ఒకటి వారపత్రిక. అతని ఆనందానికి హద్దులేదు. ఒక్కొక్క కథని పదిసార్లు చదువుకున్నాడు. ఎక్కడయినా అచ్చుతప్పులు కనిపిస్తే "అయ్యో!" అని నొచ్చుకున్నాడు.

ఈ అచ్చయిన కథల్లో తను ఏమీ పొరపాటు చేసి నట్లు కనిపించలేదు అతనికి. పైపెచ్చు తనేరాశాడా అన్నంత ఆశ్చర్యం కలిగింది. తనకు తెలియని సంగతులు వున్నాయి వాటిల్లో చాలా. ఆ రచనలు తను ఎట్లా సృష్టించాడు.

(3

అతని స్నేహితులందరూ ఆ కథలు చదివారు. కాని ఒక్కరూ మెచ్చుకున్న పాపాన పోలా. చప్పరించేశారు. పత్రికలవాళ్ళు పేజీలు నింపడానికి చెత్తాచెదారం చూసుకో కుండా యీ రోజుల్లో పబ్లిష్ చేస్తున్నారని ఒకడు తీర్మా నించాడు. వేటినో దృష్టిలో పెట్టుకుని రాసినట్లుందని మరో కడు నిర్ధారణ చేశాడు. "మొదటి కథలు అంతకంటే ఏం బాగుంటాయిలే?" అని ఓ ప్రబుద్ధుడు ఓదార్పుగా అన్నాడు.

మధుబాబు ఖిన్నుడయ్యాడు. ఒక్క ప్రాణీకూడా తనని మెచ్చుకోవటల్లా. ఈ బడుద్ధాయిలందరూ అసూయని వెళ్ళగక్కుతున్నారని అతను గ్రహించలేకపోయాడు. ఆ సాయంత్రం తల్లి దగ్గరకు పోయాడు - తలదువ్వుకుం టూంటే.

"అమ్మా! నేను రాసిన కథ అచ్చయిందే" అన్నాడు.

సుందరమ్మగారు సంతోషించింది. కొడుకు ఎప్పుడూ ఏదో రాస్తుంటాడని తెలుసు. కాని వారించే ప్రయత్నం ఏమీ చెయ్యలా. "ఏదీ! పత్రా చూద్దాం" అన్నది.

మధుబాబు పత్రికలు తెచ్చి, తల్లిచేతికి యిచ్చాడు. ఆవిడ తలదువ్వుకోవటం పూర్తిచేసి, ఉత్సాహంగా చది వింది. ఆవిడ కవి నచ్చాయి. కొడుకు ఎదురుగా కూర్చు న్నాడు - తల్లి ముఖంలోని ఫీలింగ్స్ పరీక్షగా చూస్తూ.

ఆవిడ చివరకు తలయెత్తి, చిరునవ్వునవ్వి 'బాగున్నాయిరా' అంది. అనుభవంలేని యీ లేత వయస్సు కుర్రాడు తనకు తెలీని విశేషాలగురించి ఎట్లా రాయగలిగాడన్న అనుమానం ఆవిడకెందుకో కలగలేదు.

మధుబాబుకు తల్లితో ఏం మాట్లాడటానికీ తోచలేదు. అతనికి సిగ్గువేసింది. మెల్లిగా అక్కడినుంచి బయట పడ్డాడు.

సుందరమ్మగారు యీ విషయాన్ని తన మనసులో మాత్రమే దాచుకోలేదు. ప్రక్కయిళ్ళ ఆడవాళ్లు యిద్దరి ముగ్గురితో యీ సంగతి చాటింది. ఆ పత్రికలు వాళ్ళకి చదవమని యిచ్చింది.

తర్వాత మధుబాబు కథలు యింకా విరివిగా రాగుటం మొదలుపెట్టాడు. రాయటం ఎక్కువైనాక పుస్తక పఠనం తగ్గింది. క్లాసులో పాఠాలు వినటం మొదలే అలవాటులేదు. ఇప్పుడు క్లాసు పుస్తకాలనిండా ఏదో యిష్టం వొచ్చిన వ్రాతలు వ్రాయసాగాడు.

మరుసటి నెలకూడా మూడు నాలుగు కథలు ప్రచురించబడినై. స్నేహితులు మళ్ళీ పాత అభిప్రాయాల్ని కొత్త భాషలో వ్యక్తం చేశారు. అయితే అతను రాసినవి పిల్లల కథలని యెవరూ పొరబడకూడదు. తను పిల్లవాడినని అతను అనుకోవటంలేదు. రాసింది ఏపత్రికకీ పంపించటానికి అతను సంకోచించటంలేదు. తిరిగి వచ్చినప్పుడు పడేబాధ వుండనే

జాలిలేని జాబిలి

వుంది. తరుచు రాసేవాళ్ళల్లో అతనికి కొంతమంది అభిమాన రచయితలుండేవారు వాళ్ళు తన దృష్టిలో చాలా గొప్ప వాళ్ళుగా కనబడేవాళ్ళు. ఎన్నటికైనా తన కంతటిపేరు ప్రఖ్యాతులు వస్తాయా అని, ఆ స్థితికి ఎదగగలడా అని ఉవ్విళ్ళూరుతూ వుండేవాడు

పాఠకుల్లో ఓ వాడుకవుంది. ఒకసారి ఓ రచన ఒకరిది అచ్చయితే, యిక ఆ రచయితపేరు చూడగానే సంపాదకులు ప్రచురించివేస్తూ వుంటారనీ, చదవనుకూడా చదవరనిన్నూ. మధుబాబుకూడా మొదట్లో యీ విషయం విశ్వసించాడు. అందుకని తన కథలు వేసుకున్న పత్రికే ఉత్సాహంగా పంపించాడు. కాని అతని అభిప్రాయం పొరపాటయింది. అవి నిక్షేపంగా తిరిగివచ్చాయి. ఒకడు మరీ ప్రఖ్యాతుడు అవుతేనేగాని యీ తిరిగి రావటం బెడద తీరదని నిట్టూర్చి ఊహించాడు. ఏ యితర రంగాలలోనైనా ప్రజలు బ్రహ్మరథం పట్టి సాధారణంగా పైకెత్తివేస్తారుగాని యీ కవులని, రచయితలనూ జీవితమంతా సంపూర్ణమైన విజయం వరించదన్న సత్యాన్ని తెలుసుకునేందుకు అతనిది బొత్తిగా లేత వయస్సు

నాలుగయిదు నెలలు గడిచేసరికి ఓ యిరవై కథల దాకా అచ్చయినాయి కాని ఒక్కరూకూడా అతనికిదమ్మిడీ పంపలేదు; అతను ఆశించనూలేదు. నిజానికి రాసిన వాటికి డబ్బులు ముట్టుతాయన్న విషయంకూడా అతనికి తెలియదు. కాని ఒకరోజు తన రచన మొట్టమొదటగా వేసుకున్న

వారి పత్రికనుంచి మూడు రూపాయలు మనిఆర్డర్ వచ్చి అతన్ని సంభ్రమంలో ముంచెత్తింది. జీవితంలో మొట్ట మొదటిసారిగా డబ్బు సంపాదించాడు. ఆ మొత్తం అల్పమా, అధికమా అన్న మీమాంస అతనికి కలుగలేదు. పోస్టుమేన్ అందులోనే ఓ బేడా కాజేశాడు. మనిఆర్డర్ ఫారంలో చింపి యిచ్చిన అడుగుముక్క తీసుకువెళ్ళి గర్వంగా స్నేహితుల ముందు పెట్టాడు. "ఏమిటి? ముష్టి మూడు రూపాయల పారితోషికమా? ఛీ ఛీ" అన్నారు వాళ్ళు. మధుబాబుకు ఉక్రోషం వచ్చింది. "మరి... చిన్న కథ" అన్నాడు బయట పడకుండా. "కథలో వర్త్ వుండాలిగాని చిన్నదైతే నేమి?" అన్నాడొకడు తేల్చిపారేసి. ఇంకొకడు సలహాయిస్తూ "మిగతా రచయితలికి ముప్ఫయి రూపాయలదాకా యిస్ వుంటార్రాం. అసహ్యంగా మూడు రూపాయలేమిటి? తిర గ్గొట్టు" అన్నాడు. మధుబాబుకి ఈ సలహా నచ్చలేదు. ఇ తిరగ్గొడితే తన అభివృద్ధికే ఆటంకం తెచ్చుకున్న వాడౌ తాడు. అయినా ఈ డంబాలు పలుకుతున్న వాళ్ళెవరికీ ఒక్క దమ్మిడీ అయినా కూడా సొంతంగా సంపాదించటం చేతకాదు. జవాబు చెప్పకుండా అక్కడినుంచి వచ్చేశాడు.

తన సాహిత్య వ్యాసంగాన్ని గురించి తండ్రికి తెలియకుండా ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలో అన్నీ తీసుకున్నాడు. విశ్వనాథంగారయితే న్యూస్ పేపరు తప్ప నిజంగా ఒక్క అక్షరంముక్క చదవడు. అసలాయనకు తనకొచ్చే ఉత్తరాలు చదువుకోవటమే బద్ధకం. కాని ఆయన స్నేహితు

లంతా రకరకాల వ్యాపకాలు వున్నవాళ్ళు. మధుబాబు పేరుని వాళ్ళు పత్రికల్లో చాలాసార్లు చూడటం తటస్థించింది. "కాని యీ కుర్రవాడు రాస్తున్నాడా! ఎవడో ఇంకొకడికి యిదే పేరూ, ఇంటిపేరూ కలిసివచ్చింది" అనుకున్నారు. కానితరుచు కనిపిస్తూండేసరికి సంశయంవచ్చి-చివరకు సుబ్రహ్మణ్యం అనే ఆయన మాటల సందర్భంలో విశ్వనాథం గారిని అడిగాడు.

"వాడా? వాడి మొహం అచ్చయేపాటి సామర్థ్యం వాడికెక్కడుంది?" అని విశ్వనాథంగారు బయటకి అన్నారు గాని - అనుమానం వేసింది కొంచెం కొడుక్కివున్న పిచ్చి తనకు తెలుసుగదా.

సుబ్రహ్మణ్యంగారు వెళ్ళిపోయాక యింట్లోకివచ్చి పెళ్ళాన్ని అడిగాడు. "బాబు కథలు రాస్తున్నాడా!"

ఆ సమయాని కావిడ యింట్లోకి వెచ్చాలు ఏం కావాలో రాస్తోంది. చేస్తోన్న పని ఆపి "అవును..." అంది భయంగా.

"మరి నాకెందుకు చెప్పలేదు?" అన్నాడాయన.

ఆవిడ బదులు చెప్పలేదు. తలవంచుకు కూర్చుంది.

"కోప్పడతాననా?" అన్నాడాయన మెల్లగా.

ఆవిడ తల ఊపింది.

నిజానికిప్పుడు విశ్వనాథంగారికి కోపం రాలేదు. కాలేజిలో పెట్టిన పరీక్షల్లో కొడుక్కి బాగానే మార్కులు

వస్తున్నాయి. బాగానే చదువు తున్నట్లున్నాడు. "అప్పు డప్పుడూ కథలు రాస్తే పోయిందేమి?" అనుకున్నాడు. అదే పిచ్చిగా పెట్టుకోకూడదు. మొట్టమొదట చదువు, తరువాత యీ వ్యాపకం. హాబీ కింద తీసుకోవచ్చు.

భార్యతో యిలా అన్నాడు: "వాడు చదువు పాడు చేసుకోకుండా రాసుకుంటే నేనెందుకు కోప్పడతాను? కాని తల్లీకొడుకు లిద్దరూ నాకు తెలీకుండా గుళ్ళ కషాయం చేస్తే నాకు కోపం వస్తుంది. నాకు యిష్టంలేని పని అసలు చెయ్యకూడదు. చేసినా చాటుమాటున అసలు చెయ్యకూడదు. నన్ను గట్టిగా అడిగితే అప్పుడప్పుడూ రా... మని నేనే అనివుండేవాడ్నిగా."

తన పర్మిషన్ లేకుండా కుటుంబంలో ని... పనైనా ఎందుకు చెయ్యాలని ఆయన ఉద్దేశం. ఆ... కొడుకుని పిలిచి "నువ్వు రాసినవన్నీ యిలా ప... అన్నాడు.

తల్లి ముఖతః తండ్రికి తెలిసిన విషయం వినివు... చేత మధుబాబు ఉలిక్కిపడలేదు గాని _ తను కష్టపడి... చేసిన ఆ స్త్రిఆంతా తండ్రి చిన్నాభిన్నం చేసి వేస్తాడేమో... గుండెల్లో రాయపడ్డది. అచు పడ ప్రతిరచనా అ... ద... కత్తిరించి, పదిలంగా ... ండేవాడు. మూడుమూళ్ళా... నుంచా ఆ ఫైలు తీసు... పెట్టాడు. "... రాస్తున్నావా?" ... గా. నువ్వు

బాబు లేదన్నట్లు తల ఊపాడు. "రోజూ రాయబోక, వారానికి ఓ రోజుని పెట్టుకో. ఆదివారం పెట్టుకో. ఆరోజు తప్ప యిహ దాని ప్రమేయం జ్ఞాపకం వుంచుకోక. నెలకు ఒక్కకథ రాయి. అంతకంటే రాయబోక. ఇది నీ చదువుకు ఏమాత్రం ఆటంకం కాకూడదు. తెలిసిందా! చదువు, చదువు, దానితర్వాతనే యివన్నీ"

కొంచం ఆగి-మళ్ళీతనే "నువ్వు నా పెద్దకొడుకువి. త్వరలో నా చేతికి అంది రావల్సిన వాడివి. నువ్వు ఏమాత్రం తప్పటడుగు వేసినా నాగుండె కళుక్కుమం టుంది. నీకు నేను కలిగించిన సౌకర్యాలు, నా చిన్నప్పుడు [illegible]న్న ఒక్కటీ కలుగ జెయ్యలేదు. అసలు నా ఊసే [illegible]లేదు. ఎన్నో కష్టాలుపడి పైకి వచ్చాను. నేను [illegible]మేడ్ మేన్‌ని. నీకు ఏది కావాలంటే అది ఇస్తున్నాను, [illegible]కం ఓ గది ఏర్పాటు చేశాను. ఈ సదుపాయాలన్నీ [illegible] సక్రమంగా వినియోగించుకోకపోతే..."

ఆయన కంఠం గాద్గదికమై వొణికింది. "వెళ్లు. వెళ్ళి [illegible]వుకో!"

మధుబాబు అక్కడినుంచి వొచ్చేశాడు. అతని [illegible]నస్సు వికలమైపోయింది.

తన కేమైనా పేరు ప్రఖ్యాతులు వచ్చా
మధుబాబు ఆలోచిస్తూ వుండేవాడు. తాను విన
యీ రాసే వాళ్ళకు సంఘంలో గౌరవం, ప్రతిష్ట
వుండాలి. అలాంటి వేనుయినా అమరుతున్నాయా
కాలేజిలో తన గురించి తరుచు ప్రసక్తి వస్తూ
చూచాయగా విన్నాడు. అయితే వాళ్ళెవరూ బయ
తనని పొగడటం కాని, అలాంటి దింకేమయినా చెయ్యట
కాని జరగలేదు.

విశ్వనాథంగారి స్నేహితులు తరుచు చదువుతూండే
వాళ్లు. తమ అభిప్రాయాలు సంభాషణా పరంగా ఆయన
ముందు వ్యక్తపరుస్తూ వుండేవాళ్ళు. "ఏమిటయ్యా ఎప్పుడూ
నీ బిజినెస్ గొడవేనా? కాస్త ప్రక్కకికూడా దృష్టిమళ్లించు.
మీ అబ్బాయి బాగానే రాస్తున్నాడు" అనేవాళ్లు. "ఇవాళ
తప్పకుండా చదువుతాను" అనుకునే వాడాయన. ఆ రాత్రి
కాస్త ప్రయత్నం చేశాడు. కాని ఒక్కపేజీ అయినా పూర్తి
గాకుండానే అంతా గ్రంథ్రగోళంగా, ఏమిటోగా వుండేది.
కాయితాలు మూసేసి పడుకుని నిద్రపోయేవాడు.

మధుబాబు క్లాసులో సత్యనారాయణ అని ఓ
అబ్బాయి వున్నాడు. ఇంచుమించు మధుబాబు యీడే

(4

# జాలిలేని జాబిలి

క్లాసులో ఓ మూల ఒంటరిగా కూర్చునేవాడు.
ఎక్కువ మాట్లాడేవాడు కాదు.
[illegible]డు సత్యనారాయణ మధుబాబు దగ్గరకొచ్చి
[illegible]న్నయ్యని కలుసుకుంటారా?" అన్నాడు.
[illegible]ధుబాబు కొంచం ఆశ్చర్యపడి "మీ అన్నయ్య
[illegible]" అన్నాడు మృదువుగా.
"ఉమాపతి. కథలురాసే ఉమాపతి"
మధుబాబు చప్పున భుజా లెగురేశాడు. అప్పు
[illegible]లా పత్రికల్లో కనిపిస్తూ ఉండే ఉమాపతి యితని
[illegible]న్నా?

"అన్నయ్యకూడా లాస్టియియర్ నుంచే రాయటం మొదలు పెట్టాడు. మీరు నా క్లాస్‌మేటని చెప్పాను. మిమ్మల్ని కలుసుకుందా మనుకుంటున్నాడు" అన్నాడు సత్యన్నారాయణ.

మధుబాబుకు చెప్పలేని ఆనందం కలిగింది. మొదటి సారిగా మర్లో రచయితని కలుసుకునే అవకాశం లభిస్తోంది.
"తప్పకుండా. ఇవేళ సాయంత్రం మీయింటికి వెడదామా?" అన్నాడు ఉత్సాహంగా.

సత్యన్నారారాయణ "మా ఇంటికి యివాళ వద్దండీ. వర్షాలు పడటం మూలాన దారి సరిగ్గాలేదు. సాయంత్రం అయిదుగంటలకు మేమిద్దరం కలిసి మీ యింటికి వస్తాము" అన్నాడు.

"మాయిల్లు తెలుసా మీకు?"

"ఆఁ గాంధీనగర్‌లో వుంది, లైబ్రరీకిపోయేదారిలో. రెండు మూడుసార్లు మీరు మేడమీద నిలబడి వుండగా లైబ్రరీకి పోతూ చూశాను."

మధుబాబు సంతోషించి "సాయంత్రం తప్పకుండా రండి. ఎదురుచూస్తూ వుంటాను" అన్నాడు. సత్యన్నారాయణ వెళ్ళిపోయాడు.

ఉమాపతి రాసిన ప్రతిరచనా అతను చదువుతూనే ఉన్నాడు. అతను యీ రంగంలో తనకంటే కొంచం ముందుగా ప్రవేశించాడు. కాని తను చేసినన్ని రచనలు అతను చేయలేదు. రాయటం ప్రారంభించి ఏడాది గడిచినా అన్నీ కలిసి ఏడెనిమిదికంటే మించవు.

నాలుగున్నరకి కాలేజినుంచి యింటికివచ్చి బట్టలు మార్చుకుని, అయిదయేసరికి కిటికీలోంచి బయటకుచూస్తూ కూర్చున్నాడు. తను అతన్తో మాట్లాడవల్సిన విషయాలు గురించి ఆలోచిస్తున్నాడు. చివరకు అయిదున్నర దాటుతూండగా వాళ్ళిద్దరూ వచ్చారు. ఉమాపతి కొంచం యించుమించు అతని తమ్ముడిలాగే వున్నాడు. జుట్టు కొంత భాగం కళ్ళమీదుగా ముందుకు పడుతోంది. పైజమా, లాల్చీ వేసుకున్నాడు. కళ్ళు నిశితమైన దృష్టితో, భావపూర్ణంగా వున్నాయి. చూడగానే రచయిత అనిపించేటట్లుగా వున్నాడు. మధుబాబుని చూస్తే ఎవ్వరూ రచయిత అనుకోవడానికి ఆస్కారం లేదు. అతను సన్నగా, పొడుగ్గా, ఎర్రగా, లేతగా ఉంటాడు. అతని క్రాఫు ఉంగరాలుగాని, వంకెలుగానీ తిరగలేదు. పైకి దువ్వుతాడు.

నమస్కారం చేసి, యిద్దర్నీ లోపలకు తీసుకుపోయి తన గదిలో కూర్చోపెట్టాడు.

«మిమ్మల్ని ఓ రకంగా నేను ఎరుగుదును» అన్నాడు ఉమాపతి ఆసీనుడయినాక.

"ఎలా?"

«మనం యిద్దరం ఒక స్కూల్లోనే చదివాం. ఫిఫ్త్ ఫారం చదివే రోజుల్లో, యింకా డివిజన్స్ చెయ్యకముందు అందరకూ కలిసి కామన్‌గా అటెండెన్స్ తీసుకుంటూ వుండేవాళ్ళు. ఓ సారి అటెండెన్స్ పిలిచేటప్పుడు పరధ్యానంగా వుండటంచూసి నేనే యిచ్చేశాను రెస్పాన్స్," అని నవ్వాడు ఉమాపతి.

"అయితే మనమిద్దరం క్లాసు మేట్సుమా?" అన్నాడు మధుబాబు ఆశ్చర్యంగా.

"కొంతవరకూ. కొంతకాలం యిక్కడ చదివాక కలకత్తాలో మా పెదనాన్నగారి దగ్గరకు వెళ్ళిపోయాను. స్కూల్ ఫైనల్ తప్పాను. ఇంక చదవబుద్ధి కాలేదు. చదువుకి తిలోదకా లిచ్చేశాను మా తమ్ముడికీ నాకూ వయస్సులో ఏడాదికంటె తేడా లేదు. వాడు ప్రయివేటుగా మెట్రిక్ కట్టి కాలేజీలో చేరాడు"

"మరి ప్రస్తుతం మీరేం చేస్తున్నారు?"

"ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాను."

మధుబాబు లోపలినుంచి కాఫీలు తీసుకువచ్చాడు. కాఫీలు తాగుతూ వాళ్ళు మామూలు విషయాలు యథాలాపంగా మాట్లాడుతున్నారు.

"మీరు చాలా కథలు రాశారనుకుంటాను" అన్నాడు ఉమాపతి మొదలుపెడ్తూ.

"ఔనండీ. ఓ పాతికవరకూ రాశాను. ఒక్క భారతి మినహాయించి, యించుమించు అన్నిట్లోనూ అచ్చయి నాయి."

"అంత త్వరగా ఎట్లా వ్రాయగలుగుతున్నారు?" మధుబాబుకి అర్థంకాలేదు. "అంటే?"

"అంత ఎక్కువగా యెట్లా ఉత్పత్తి చేయగలుగు తున్నారు? శ్రమ అనిపించటల్లేదూ మీకు?"

ఈమాట మధుబాబుకి చాలా కొత్తగాఅనిపించింది. 'శ్రమ' అని ఎప్పుడూ అనుకోలా. ఏదో యితివృత్తంతట్టడం రాసి పంపించేయటం అంతే" అన్నాడు.

"మీరు ఒకసారి రాసింది మళ్లీ ఫెయిర్ చేస్తారా?"

"చెయ్యను. నిజం చెప్పాలంటే రాసింది చదువు కొనటానిక్కూడా నాకు ఓపిక వుండదు. అచ్చులో వస్తే చదువుకొనలమే."

ఉమాపతి యీ మాటలకు బాగా ఆశ్చర్యపడినట్లు కనిపించాడు. "ఓ కథ రాసేముందు మనసులో తర్జనభర్జన, విమర్శ, యోగ్యత యివన్నీ ఆలోచించుకోరా?" అన్నాడు కొంచం ఆగి.

"ఊహుఁ" అన్నాడు మధుబాబు చిక్కులోపడి.

"అసలు మీ ఆశయం ఏమిటి?" అన్నాడు ఆ రచ యిత వున్నట్లుండి.

మధుబాబు ఉలిక్కిపడ్డాడు. ప్రశ్న తూణీరంలా వచ్చింది. సరికొత్తది, యిదివరకు ఎన్నడూ విని యెరుగనిది. ఏమిటి తన ఆశయం? ఏముంది? అయోమయంగా చూశాడు పృచ్ఛకుని వంక.

"చెప్పండి" అన్నట్లు అతను గ్రుచ్చి గ్రుచ్చి చూశాడు.

మధుబాబు గబగబ ఆలోచిస్తున్నాన్నాడు. ఇంత వరకూ తాను రాసిన కథలన్నీ మననం చేసుకుంటున్నాడు

"ఇంతవరకూ పాతిక కథలు రాశారు. అన్నిట్లోనూ ఏదో చెప్పాలని ప్రయత్నించారు. కొత్తకొత్త పాత్రల్ని సృష్టించారు. కొంతవరకు మీ అభిప్రాయాల్ని నేను ఊహించగలను. కాని కలిశారు కాబట్టి మీ ముఖతః వినాలని వుంది. ఏమిటి కలం చేపట్టటంలో మీ ఆశయం?"

అబ్బ! పెద్దపెద్ద డైలాగులు దొర్లుతున్నాయి కాని ఏమి సమాధానం చెటుతాడు తాను? తన కేమీ ఆశయం లేదు. ఆశయంకోసం యింతవరకూ రాయలేదు. కథను మొదటి అక్షరంనుంచీ చివరి అక్షరంవరకూ ఏవో పాత్రలతో ఊహించి రాశాడు అంతే.

"మీ రచనల ద్వారా సమాజానికి మీ రివ్వదలచుకున్న సందేశమేమిటి?"

అయ్యబాబోయ్! ఏమిటీ ప్రయోగాలు తనమీద? సమాజాన్ని సంస్కరించాల్సిన బాధ్యత తనకు వుందా? దానికి ఓ సందేశాన్ని వినిపించవల్సిన అవసరం తనకు

కలదా? అయితే రాయటానికి ఓ ప్రయోజనం, ఓ సిద్ధి వుండాలన్నమాట.

"నాకేమీ ఆశయాలు లేవండీ" అన్నాడు సమాధానానికి ప్రయత్నిస్తూ.

జవాబు విని ఉమాపతి విస్తుపోయాడు. అతనికి ధోరణి విచిత్రంగా కన్పించింది. అన్నాడు "ప్రపంచానికి మనం ఎలుగెత్తి చెప్పదల్చుకున్నది లేనివాడు కాయితాన్ని ఖరాబు చేయటం శుద్ధ దండుగ. అసలేదో దుఃఖ, తీవ్ర తపన మనలో జనించి, ఆ తాపాన్ని తీర్చుకోవటానికి కం పడితేనే అతడు నిజమైన రచయిత. ఆశయం లేని వాడు ఎవడూ వుండడు. అయితే కొందరికి నిర్దుష్టమైన అభిప్రాయాలుండవు వయసూ అనుభవం ఆ నిర్దుష్టత కలిగిస్తవి?

"మరి నాకు లేదంటే" అన్నాడు మధుబాబు నిరసం గ్రమ్మినట్లు.

ఉమాపతి మందహాసం చేశాడు. "మీ రచనలు చదివితే అట్లా అనిపించదే. వాటిల్లో అభూత కల్పనలు ఏవీవుండటం లేదు. మనచుట్టూ జరుగుతోన్న సమస్యల్ని చిత్రిస్తున్నారు. మిమ్మల్ని గురించి మీకు సరైన అభిప్రాయం లేదు. మీలో అవ్యక్తమైన ఆరాటంవుంది" అన్నాడు.

మ... బాబుకు అబద్ధం చెప్పాలనిపించలేదు. "రాను
చేతులా... లన్న ఆరాటంతప్ప ప్రపంచాన్ని ...
వ ... నేను కావాలని యింతవరకూ ...

స్యనూ తీసుకోలేదు. ఆదర్శాలు విరజిమ్మాలనీ ప్రయత్నించలేదు. నా ఆనందంకోసం, తృప్తికోసం రాసుకున్నా నంతే" అన్నాడు.

"అలాకాదు చూడండి" అన్నాడు ఉమాపతి. "ఒక నిర్దుష్టమైన గమ్యం లేకుండా ఎవడూ ఉత్తమ రచయిత కాలేడు. మీ అభిమాన రచయితలంటూ ఎవరైనా వున్నారా...?"

"శరత్..."

"శరత్‌ని మీ రెందుకు అభిమానిస్తున్నారు?"

సుధుబాబు ఆలోచించసాగాడు.

"ఆయన వ్రాసే ప్రతి రచనలోనూ యీ సమాజం లోని కఠిన నియమాలకూ, మూర్ఖపు దురాచారాలకూ బలైపోతున్న అభాగ్యుల ఆక్రందన పౌరుషంగా వినిపిస్తుంది. ఆ నిర్భాగ్యుల్ని వివిధ కోణాల్లో చిత్రించాడు. తన ఆశయ నిర్వహణకు యీ సమాజాన్నే ఒక విలన్‌గా తీసుకున్నాడు. సాధారణంగా ఆయన పుస్తకాల్లో విలన్లుండరు. సంఘాన్ని పాలిస్తోన్న దారుణ సిద్ధాంతాలకు గుర్రై, బలైపోతుంటాయి పాత్రలు. తను చెప్పదలుచుకున్న విషయాన్ని ట్టి దానికి అనుగుణ్యమైన భాషా, వాతావరణం, శిల్పంతీస కున్నాడు. రాసిన ప్రతి అక్షరంలోనూ తను గోచరిస్తూ వుంటాడు. అతని ఆశయమూ, దాని ఆచరణ విధా రెండూ ఉదాత్తాలైనాయి — ఏదీ ఏవగింపు కలగ డా. అం చేతనే అతను నిలిచాడు. కొందరు శర

ముగించడు అని విమర్శిస్తూ వుంటారు. ఇట్లా విమర్శించేవాళ్లు తాము వాంఛించిన సంఘాన్ని, అప్పుడే ఏర్పడిపోయినట్లు చిత్రిస్తున్నారు. వీటిల్లో కసేగాని – కరుణలేదు. మనుషుల్ని ఊహాకతీతమైన స్థితిలో పెట్టటానికి ప్రయత్నించారు. అదీగాక సమస్యను బట్టే భాష అన్న సంప్రదాయాన్ని విచ్చలవిడిగా వాడుకున్నారు. వాస్తవికతకు విపరీత అర్థాలుతీసి సాహిత్యాన్ని రసహీనంచేసి, వొట్టిపొడిగా తయారుచేశారు. అంచేతే ఎంత ఆర్భాటం చేసినా శరత్ హృదయాలను ఆకర్షించినట్లు ఆకర్షించలేక పోయారు. మనకు సమాజంపట్లవున్న కసిని వికృతంగా తీర్చుకోకూడదు అదీగాక విజాతీయ ఉద్రేకం ఎరువు తెచ్చుకోకూడదు. మన సాహిత్యాన్ని కొంతమంది దుర్భాషలాడితే–వాళ్లెవరూ చేరుకోలేని వున్నత శిఖరాలను చేరుకున్నా ననుకోవటం ప్రగల్భం."

ఎక్కడా తడుములాట లేకుండా, స్వచ్ఛమైన కంఠస్వరంలో చెప్పాడు ఉమాపతి. ప్రక్కన నిశ్శబ్దంగాకూర్చున్న అతని తమ్ముడు సత్యనారాయణకూడా శ్రద్ధగాఆలకించాడు. శరత్‌ని గురించి నేను యిలా మాట్లాడగలనా అని ప్రశ్న వేసుకున్నాడు మధుబాబు. అతనికి ఆశ్చర్యంగా వుంది.

"శైలీ, శిల్పం వీటిగురించి మీకున్న నమ్మకాలేమిటి? అవి వాస్తవికతకు ఎంతవరకూ ప్రతిబంధకాలౌతాయి?" అన్నాడు ఉమాపతి ఒక్క నిముషం ఆగి.

ఇతరుల రచనలు చదువుతూన్నప్పుడు యీ చెప్ప

బడిన వాటిలోని ప్రత్యేకత, సమర్థత మధుబాబుని ఆకర్షిస్తూ వచ్చాయి. ఒక్కొక్క రచయిత రచనా విధానంలో ఒక్కొక్క విశిష్టత వుంటుందని అతనికి తెలుసు.

"శైలి, శిల్పం లేకుండా సూటిగా చెప్తే చాలా డ్రైగా, వొట్టి పిండెల్లా వుంటాయి" అన్నాడు జవాబు చెప్పాలి గనుక.

"సూటిగా చెప్పటం కూడా ఓ శైలే" అన్నాడు ఉమాపతి నవ్వుతూ.

మధుబాబు యిబ్బందిలోపడి "నేను అట్లాంటి వాటి కోసం ఏమీ సాధనం చెయ్యలేదండీ" అన్నాడు.

"చెయ్యనక్కర్లేదు నిజానికి. నిజమైన వ్యక్తిత్వం ప్రత్యేకమైన శైలిని సృష్టిస్తుంది. ఉదాహరణకు మిమ్మల్నే తీసుకుందాం. అజ్ఞాతంగా చాలామంది రచయితల ప్రభావం మీమీద ప్రసరిస్తున్నా—కథను మలచటంలోనూ, సంభాషణలను పలికించటంలోనూ మీది చాలా చిత్రమైన పద్ధతి. ఓ సుకుమారత్వం వుంది అందులో. పాఠకుల్ని చాలా చప్పున ఆకర్షిస్తుంది. అయితే యింకా నిశితమైన నిర్దుష్టత రాలేదను కోండి. రాసే సమయంలో యితర రచయితల గురించి మరిచి పోయి, మిమ్మల్నే కళ్ళముందు వుంచుకుంటె చెక్కు చెదరని శైలి అమరుతుంది. కాని మీ టెక్నిక్ మెచ్చుకో దగ్గది సుమండీ."

మళ్ళీ ఓ కొత్తపదం.

"సమస్యను తీసుకుని కథ అల్లుకోక ఆలోచించటమే

“ఉన్నమాట. ఇవాళే స్నేహమైంది. అందులో ఒక తను రచయిత” అన్నాడు మధుబాబు ఉత్సాహంగా.

ఆ రాత్రి అతనికెంతకీ నిద్ర పట్టలేదు. తనకోసం ఓ రచయిత వెదుక్కుంటూ రావటం, తనలోని ప్రత్యేకతని బయటపెట్టటం ముదావహంగానే వుంది. కాని అతను తన కేమీ ఆశయంలేదని తనలోనే వొప్పించి పోయాడు. ఎట్లా వస్తుంది తనకది ? ఏం చెయ్యాలి ? ఇట్లా యిష్టంవచ్చినట్లు దేన్నిపడితే దాన్ని గురించి రాయటం ప్రగతికి ప్రతిబంధకమా? స్త్రీనిగురించి తీసుకుంటే? తనకేమీ తెలీదు వాళ్ళని గురించి. నిరుపేదలు, దరిద్రం, గుమాస్తా, కళాకారుడు, కులమత తారతమ్యాలు; ఓ రాజకీయ సిద్ధాంతం – వీటిల్లో దేన్నో ఒకదాన్నే తన పథంగా నిర్దేశించుకోవాలా? దాన్ని గురించే ప్రత్యేకంగా పుస్తకాలు చదివి అనేక విషయాలు గ్రహించి, వాటిని గురించి తర్జన భర్జనలు జరుపుతూ వుండాలా? ఎట్లా లభిస్తుంది తనకు ఆశయం ? తన ముద్ర, ప్రజలమీద వేసే ఆ మంత్రం ఏమిటి?

ఎంత తన్నుకున్నా అతని ఆలోచనకు ఓ ఫలితం ఏర్పడలేదు. విసిగిపోయాడు. ఎట్లాగో నిద్ర పట్టింది.

# 6

ఇంటర్మీడియట్ మొదటి యేడు పూర్తయింది. సెల వుల్లో మధుబాబుకు కావలిసినంత తీరిక. చదవాలన్న ఉత్కంఠకూడా బాగా పెరిగింది. ఇంగ్లీషు క్లాసిక్సూ, షేక్స్పియర్ నాటకాలూ చదవటం ప్రారంభించాడు. అభిరుచి లేకపోయినా అవసరం క్రిందచేసుకుని తెలుగుపద్యకావ్యాలూ ప్రబంధాలూ చదవసాగాడు. అతనికి ఛందస్సురాదు. అయినా కొన్ని గేయాలు రాశాడు. వాటిల్లో కొన్ని ప్రముఖ వార పత్రికల్లో అచ్చయినైకూడా. కాని యీ కావ్యాలు అతనికి సరిగ్గా నంటుబట్టేవికావు. సగం సగం అర్థమయేవి కఠినమైన పదం ఒకటి తటస్థ పడినప్పుడల్లా దాన్ని మననం చేసుకుని, హృదయసీమలో పదిలం చేసుకునేవాడు. కాని చదువు తోంటే సరిగ్గా ఏకాగ్రత కుదిరేదికాదు. ఊహాలమీద ఊహాలు పొర్లుకుంటూ వచ్చేవి. అవి కాగితంమీదకు ఎక్కిం చేవరకూ చేతులు దురదలు పుట్టేవి.

క్రమంగా అతని బంధువుల్లో అందరికీ అతను రచయి తగా ఆదరపాత్రుడు కాసాగాడు. అతని మేనమామలూ, వరు సకు అన్న అయినవాళ్ళూ అభినందిస్తూ ఉత్తరాలు రాసే వాళ్ళు. "మధూ! నీ కథలు బాగుంటున్నాయి. చక్కని సైకాలజీ ద్యోతకమౌతోంది. ఏ మనిషినికూడా నిర్లక్ష్యం చేసి చూడకు. ప్రతివారినుంచీ ఏదుకుంటే కావలసినంత

సామగ్రి లభిస్తుంది, ముఖాలు పరిశీలించి అంశీకరణాలు గ్రహించటం నేర్చుకో" అని ఓ మేనమామ రాశారు.

ఉమాపతి తరుచు కలుస్తున్నాడు. అయితే మధుబాబు మునుపటిలాగా మాట్లాడలేని వాడకాదు. అతనిప్పుడు కొన్ని కొన్ని అభిప్రాయాలు వ్యక్తం చేయగలడు. తనకు ఓమార్గం లేదే అన్నచింత అంతగా యిప్పుడులేదు. రాసిన ప్రతిదాన్ని గురించీ ఓ ప్రయోజనం సిద్ధింపజేసి చెప్పగలడు. అనేసికిలా చెప్పగలగటం సాధనమీాద వచ్చింది కథ రాసేముందు కాక పోయినా, రాశాకనయినా యిందులో ఏముందా అని ఆలో చిస్తున్నాడు అందులోంచి ఓ ముత్యాలసరం బయటకుతీస్తు న్నాడు ఒక అంశాన్ని గురించి వాదోపవాదాలు వచ్చి నప్పుడు అవతలివాడ్ని సరికి సరి ఎదిరించి తట్టుకునేటంత శక్తి రాకపోయినా – తన పాయింటుమీాద పెనుగులాడ గలడు.

అయితే ఒక్కలోపం మాత్రం అతన్ని విడిచిపోలేదు. తనకు ఏది అత్యంత ప్రీతిపాత్రమైన వస్తువో అతనింకా గ్రహించలేదు. ఓ గదిలో పదిరకాల జంత్రాలు మ్రోగు తున్నాయనుకోండి. అన్నీ కదలిక కలిగించేవే ప్రత్యేకంగా "యిది నన్ను బాగా కదిలించింది'' అని చెప్పలేనిస్థితి. ఎంగు నచ్చిన అన్ని పథాల్లోనూ పాంథుడిగా నడిచి ప్రయోగాత్మ కంగా అనుభవిస్తున్నాడు.

అన్నట్టు–అతను ఎన్నాళ్ళనుంచో కోరిన కోరిక సఫల మైంది. మొదటిసారిగా అతని కథ భారతిలో అచ్చయింది. ఉమాపతి రచన లింతవరకూ అచ్చుకాలేదు. బహుశా

యింత చిన్న వయస్సులో భారతిలో కధరాసిన వాళ్ళెవరూ లేరేమో. అతనికి గర్వం కలిగింది. తాను పైకిపోతున్నాడు.

* * *

వేసవి సెలవులు గడిచి, కాలేజి తెరిచారు. మధుబాబు రెండో ఏటిలో ప్రవేశించాడు. కొన్నాళ్ళకు యధావిధిగా ఎలెక్షన్లు జరిగాయి కాలేజి మేగజైన్‌కి పోటీపరీక్ష జరిగింది. అతను మళ్ళీ పాల్గొన్నాడు. అంశం: "యింగ్లీషులో విద్యాభ్యాసం సమంజసమా?" అతను ఆలోచించి శక్తికొద్దీ బాగా రాశాడు. దాని తర్వాత యింటర్వ్యూకి కొంతమందిని సెలక్టు చేసి పిలిచారు. వాళ్ళలో మధుబాబు కూడా వున్నాడు. తర్వాత ఫలితాలు తెలిశాయి. అతను సెలక్టు అయ్యాడు.

"హమ్మయ్య" అనుకున్నాడు తను అనుకున్నది నెరవేరింది. మంచి మేగజైన్ తీసుకు రావాలి. ఇదివరకు ఎవరూ తీసుకు రానట్లుగా కొత్త కొత్త ఆకర్షణలతో తయారు చెయ్యాలి.

భారతిలో అతనికధ అచ్చుకావటం చుట్టూ మంచి వాతావరణాన్ని సృష్టించింది. "అందులో ఏముంది చెత్త" అని కొంతమంది ప్రబుద్ధులుఅన్నా, కొంతమంది విద్యార్థులు దగ్గరకువచ్చి అభినందించ సాగారు. కొన్నాళ్ళలో మరి రెండు మూడు కధలుకూడా భారతిలో అచ్చయినాయి. నిజానికి అవి చాలా మంచి కధలు. ఎంతోమంది హృదయాలను కదిపాయి. మధుబాబు దాకా రాలేదుగాని - మిగతా రచయితల్లో చైతన్యవంతమైన చర్చలకు కారణభూతమైంది.

అందులో ఒక కథలో చనిపోయేముందు ఆ విషయం తెలిసి తపనపడ్డ ఒకడి మనస్తత్వం హృదయ విదారకంగా చిత్రింపబడింది. అది అచ్చయినాకనే రేడియోవాళ్ళ దగ్గర్నుంచి నాటిక రాయమని ఆహ్వానం వచ్చింది. మధుబాబు పులకితుడయ్యాడు. ఇదివరకు రేడియోకు ఎన్ని నాటికలు పంపినా తిరిగి వచ్చాయి. రెండురోజులు కష్టపడి పదిహేను నిముషాలకు సరిపోయే ఒకనాటిక రాసి పంపాడు.

కాలేజీలో ఓ మహాకవి వున్నాడు. ఆయనంటే మధుబాబుకు చాలా భక్తిశ్రద్ధలు. మహాకవి నిజంగా గొప్పవాడు. సాహిత్యసామ్రాజ్యంలో ఆయన స్పృశించని విభాగంలేదు. గొప్ప వక్తకూడా. కాని పెడసరం మనిషి. మనసు మృదువైనదేగాని, మాట కఠినంగా వుంటుంది. దేశమంతా ఆయనకు బోలెడంత శిష్య బృందముంది. ఆయనంటే గిట్టనివాళ్లూ సమయం వొస్తే పరాభవిద్దామని కాచుకు కూర్చున్నవాళ్లూ అనేకులు వున్నారు. అయితే ఆయనముందు ఆ పప్పులేం వుడకవు. ఎంతటి వాడినైనా ఎటువంటి పరిస్థితిలోనైనా చీమని దులిపి పారేసినట్లు దులిపేస్తాడు. ఆయన వ్యక్తిత్వం చాలా గొప్పది. ఏం రాసినా, ఏం చెప్పినా పరిపూర్ణమైన విశ్వాసంతో, మరో యిరవయ్యేళ్ళ తర్వాతనయినా అదేమాట చెప్పగలిగేస్థయిర్యంతో చెబుతాడు. ఆయన్తో ఎట్లాగయినా పరిచయం కలిగించుకోవాలని మధుబాబు ఉవ్విళ్ళూరుతున్నాడు. ఆయన తనక్లాసుకి రాడు. అందుకని తనగురువుగా సంబంధం వుంచుకునే అవకాశం అతనికి కలగలేదు. ఓరోజు

ధైర్యంచేసి ఆయన ఇంటికి వెళ్ళాడు. ఆదివారం. ఉదయం తొమ్మిదవుతోంది. పడకకుర్చీలో కూర్చుని మహాకవి ఏదో గ్రంథం పఠిస్తున్నాడు. "నమస్కారమండీ" అన్నాడు మధుబాబు వణికే కంఠంతో.

మహాకవి తలఎత్తి "ఎవర్రా అబ్బాయి? నా స్టూడెంటువా?" అని ప్రశ్నించాడు.

మధుబాబు తడుముకుని "కాదండీ, నేను ఫస్టియర్ చదివే రోజుల్లో మీరు సెకండియర్‌కి వెళ్ళేవారు. ఇప్పుడు నేను సెకండియర్‌కి వచ్చేసరికి మీరు ఫస్టియర్‌కి వెడుతున్నారు. మీరు మాకు రావటల్లేదు" అన్నాడు.

"మీకా అదృష్టం లేదురా" అన్నాడు మహాకవి.

కొంచం ఆగి, ఆయనే "ఏం చెయ్యను రా అబ్బాయి? మీ క్లాసే తీసుకుందామనుకున్నానుగాని ఆరోగ్యం బాగుండటంలేదు. ఫస్టియర్ వాళ్ళైకవుతే ఎక్కువ శ్రమ తీసుకోనక్కర్లేదని వాళ్ళకి పోతున్నాను" అన్నాడు.

మధుబాబు జవాబు చెప్పకుండా నిలబడ్డాడు.

"అన్నట్లు ఎందుకొచ్చావు? నీ పేరేమిటి? ఆ కుర్చీ యిలా లాక్కుని కూర్చో"

అతను కుర్చీ దగ్గరకు లాక్కుని కూర్చుని, తనపేరు చెప్పి "సాహిత్యమంటే అభిలాష వుందండీ" అన్నాడు.

ఆయన చిత్రంగా కళ్ళెగురవేసి "ఏమిటి ? నీకూ ఆ పైత్యం వుందన్నమాట" అన్నాడు.

మధుబాబుకు నవ్వొచ్చింది. "కథలు రాస్తుంటానండీ" అన్నాడు మెల్లగా.

"అచ్చయినాయా?"

మధుబాబు తలవూపి యీ మధ్యనే భారతిలో అచ్చయిన కథపేరు చెప్పాడు.

మహాకవి ముఖంలో రవంత ఆశ్చర్యం పొడసూపింది. గుర్తు తెచ్చుకుంటున్నట్లుగా "ఏమిటి? అది నేను చదివినట్లున్నానే. ఉండు" అని లేచి ఆల్మారా దగ్గరకు వెళ్ళి ఆ నెల భారతి తీసుకొచ్చి ఓ పేజీ తీసి "యిదేకదూ!" అన్నాడు.

మధుబాబు ఉత్సాహంగా "అవునండీ" అన్నాడు.

ఆయన మళ్ళీ కుర్చీలో కూర్చుని పేజీలు త్రిప్పుతూ "నేను చదివానురా అబ్బాయి యిది. కథకూడా గుర్తుంది. నేను నేటి నవీన సాహిత్యం చదవనని అంతా అనుకుంటారు. అది అబద్ధం. కొత్తవాళ్ళు రాసేది చాలావరకూ చదువుతూనే వున్నాను. నీకథ నాకు నచ్చింది. నీకు మంచి అభివృద్ధి వుంది. పైకివస్తావు. అవును గాని యింత పెసిమిస్టుగా ఎందుకు తయారయ్యావురా?" అన్నాడు.

మధుబాబు నీళ్ళు నములుతూ "నేను... అట్లాగే..." అంటూ యింకా ఏదో చెప్పబోయాడు.

"పెసిమిజం యీనాటి ఫ్యాషన్ అయిందిలే. అట్లా రాస్తేనేగాని పేరు రాదుకూడా. నీకు శిల్పం యింకా అమరలేదు. పద్యాలు రాయటం వచ్చునా?"

"రాదండీ"

"బ్రతికించావు. నువ్వు ఎన్నటికీ కవివి అవటానికి ప్రయత్నించకు. పైకి రావటం సులభమేగాని, రెండు

కావ్యాలు రాసేసరికి కలం యింకిపోతుంది. అప్పుడు నీకు గతమేగాని భవిష్యత్ వుండదు" అన్నాడు మహాకవి.

కొంచం ఆగాక మధుబాబు "కాలేజి మేగజైన్‌కు నేను స్టూడెంటు ఎడిటర్ని. రచన ఏమైనా యివ్వగలరా?" అని అడిగాడు కొంచం ఆగి.

"కష్టం. తీరిక లేదు. ఇటు విమర్శలూ, అటు కావ్య పరంపరలూ తల మునిగివున్నాను. అయినా ప్రయత్నిస్తాను. కొన్నాళ్ళు పోయాక కనిపించు. ద్రౌపదిమీద ఓ వ్యాసం రాస్తాను"

"మరి వస్తాను. సెలవండీ" అన్నాడు మధుబాబు లేచి నిల్చుని.

"పోయిరా" అన్నాడు మహాకవి.

అతను బయటకు వచ్చేశాడు.

* * *

కాలేజిలో తెలుగు అధ్యాపకులందరి దృష్టినీ మధుబాబు ఆకర్షించాడు. వాళ్ళలో ప్రతిఒక్కరూ భారతిలో రాయటానికి ప్రయత్నించిన వాళ్లే. ఒకాయనివి మట్టుకు నాలుగయిదు విమర్శలు ప్రచురింపబడినై. మిగతా వాళ్ళకు అది గగన కుసుమం అయింది. మళ్ళీ గట్టిగా ప్రయత్నించగా ఒకటిరెండు కలగూరగంపలో వేసుకున్నారు.

ఒకరోజు మధుబాబు వాళ్ళ స్టాఫ్‌రూమ్ మీదుగా పోతూండగా "ఇలా ఓసారి రా నాయనా" అని లోపలకు పిలిచారు.

అతను లోపలకు వెళ్ళి "ఎందుకండీ?" అన్నాడు.

"భారతిలో కథలు రాసింది నువ్వేకదూ!"

అతనికి అర్థమైంది. "అవునండీ" అన్నాడు నెమ్మదిగా.

అవధాన్లుగారు గట్టిగా పొడుంపీల్చి "ఎలా వేసుకుంటున్నారోయి నీవి?" అని అడిగాడు.

అతనికి యీ మాటలకు కష్టంవేసింది. జవాబుచెప్పకుండా వూరుకున్నాడు.

బల్లమీద కాళ్ళు బారజాచిన శాస్త్రిగారు "నువ్వు కథ పంపితే ఎన్నాళ్ళలో వేసుకుంటారు?" అని అడిగాడు.

ఈ ధోరణి మధుబాబుకి నచ్చలేదు. "మొన్న కథ పదిహేను రోజుల్లో వేసుకున్నారు" అని చెప్పాడు చెప్పాలని లేకపోయినా.

గుప్తాగారు కళ్ళజోడు సవరించుకుని "మేటర్ లేపోతే అట్లాగే వేసుకుంటూంటారు ఒక్కోసారి. కథకెంత యిస్తున్నారేమిటి?" అని అడిగాడు ఓరగా చూస్తూ.

మధుబాబుకి నిజం చెప్పాలనిపించలేదు. "ముప్పై" అన్నాడు.

'ఆఁ' అని అక్కడున్నవాళ్ళంతా ఒక్కసారి నోరావలించారు. వాళ్ళకు చాలా కొద్ది మొత్తాలు వచ్చివున్నాయి యిదివరకు.

మధుబాబుకు అక్కడ వుండబుద్ధిగాక "వస్తాను" అని అక్కడినుంచి కదిలాడు. 'పెద్దవాళ్ళు ఏళ్ళు.'

కొన్నాళ్ళు గడిచాయి. ఓ ఆదివారం రాత్రి అతను

రాసిన నాటిక ప్రసారమైంది. రేడియోముందు అతనూ, తల్లీ తండ్రీ, తమ్ముళ్ళూ, చెల్లెలూ అంతా కూర్చుని విన్నారు. సంభాషణలు ఎవరోగాని అక్కడక్కడ మార్చేశారు. కొంత భాగం కత్తిరించారు. మధుబాబుకి బాధ అనిపించింది. కాని అతను రాసిన సంభాషణలు వాళ్ళెవరో చదువుతోంటే హాయిగా వుంది. నాయిక వేసిన అమ్మాయి ఒకచోట "నా ప్రాణానికి చిగురులా దాపురించావు" అన్న సంభాషణ పలుకుతూ నవ్వాపుకోలేక ఓ అరనిమిషంపాటు కిలకిల మని నవ్వేసింది. నాటకం ముందూ, తర్వాతా అతని పేరు చదువుతోంటే చెల్లెలు చిలిపిగా ముఖంలోకి చూసి నవ్వింది. తల్లి గుంచుకున్నది. తండ్రి ఏమీ అభిప్రాయం వెలిబుచ్చలేదు.

## 7

కాలేజి మేగజైన్‌కి రచనలు వచ్చిపడుతున్నై. మధుబాబుతోపాటు యింకో విద్యార్థి కూడా సంపాదకుడిగా వున్నాడు కాని అతను ఏమీపట్టించుకోడు. బాధ్యతఅంతా మధుబాబు నెత్తిన పడింది.

చీఫ్ ఎడిటర్ అయిన తెలుగు లెక్చరర్ ఒకాయన యితన్ని పిలిచి వచ్చిన రచనలన్నీ చదివి, చెత్తగా వున్న వాటిని వొదిలేసి మిగతావి తనకు యిమ్మనీ, అందులోంచి తను ఫైనల్ గా సెలక్ట్ చేస్తాననీ అన్నాడు డిశంబరులో ఒక

సంచిక వస్తుంది. ఏప్రిల్‌లో పరీక్షల సమయంలో రెండోది[?] వస్తుంది. రెండవదాంట్లో ఎక్కువభాగం ఫోటోలూ, వివిధ ఎసోసియేషన్ల రిపోర్టులూ వుంటాయి. రచనలన్నీ అతనుయింటికి పట్టుకు పోయాడు. అతనింకా వాటిని చదవటం ప్రారంభించనేలేదు. కొందరు విద్యార్థులు అతను కనిపించినప్పుడల్లా "నా రచన విషయం ఏంచేశారు?" అని ప్రశ్నించటం మొదలు పెట్టారు. ఒకడొచ్చి "నేనిచ్చిన నాటిక వుంది చూశారు? అందులో కొన్ని డైలాగులు మోతగా రాశానండి[?]" అన్నవాడు[?]. మరొకడొచ్చి "నేనిచ్చిన కథలో ఓ, గేయం కూడా రాశానండోయి. చెప్పకోకూడదుగాని శ్రీశ్రీ ఎందుకు[?] పనికిరాడనుకోండి. అట్లా రాశాను. కొంచం చూద్దురు[?]" అనేవాడు.

మధుబాబు ఓపిగ్గా చదవసాగాడు. ఎక్కువభాగం ప్రేమకథలు. లేకపోతే కాపీ కొట్టిన బాపతు. కాని అక్కడక్కడా మంచివి—చాలా మంచివికూడా కనిపించాయి. లేడీ స్టూడెంట్సు దగ్గరనుంచి కూడా పది పదిహేను వరకూ వచ్చాయి. వాటిని ఉత్సాహంగా చదివాడు. ఒకమ్మాయి మాతృభక్తిని గురించి రాసింది. ఒకమ్మాయి భర్తగా మొగవాడి దౌర్జన్యాన్ని గురించి రాసింది. కాని రాజ్యలక్ష్మి అనే అమ్మాయి రాసిన కథ చదువుతోంటే, అతనిగుండె గుభేలుమంది. ప్రశంస అంతా కాలేజి అబ్బాయిలూ, అమ్మాయిల గురించే. ఆడపిల్లలు జట్కాల్లో పోతూంటే కుర్రాళ్ళు వెంటబడటం, నిక్‌నేమ్సు పెట్టి ఏడిపించటం — అదంతా రాసింది. ఓసారి తను (కథలో నాయిక) రైల్లో పోతోంటట. ఎదుట

సీట్లో తన క్లాసుమేటు రఘు, ఊరికినే ఎగాదిగా చూస్తు న్నాడు. ఈ అమ్మాయి విసుక్కుంది. కాసేపటికి నిద్రవచ్చి కునికిపాట్లు పడుతోంది. ఇంతలో స్పర్శ తగిలి ఉలికిపడి లేచే సరికి రఘు కంగారుగా ఆమె చేతిని పట్టుకుంటున్నాడు. మళ్ళీ ఆలోచించకుండా ఊ చిపెట్టి ఒక్క చెంపకాయ కొట్టింది. అతను తెల్లబోయి బిక్క మొహంతో ఏదో చెప్పబోతోంటే వినిపించుకోకుండా తిట్ల వర్షం కురిపించింది. పెట్టెలోవున్న వాళ్ళంతా యీ పిల్లనే సమర్థించారు. ఆ అబ్బాయి ప్రక్క స్టేషన్‌లో తలవంచుకు దిగిపోయాడు. తర్వాత అతను కాలే

రాలేదు. జ్వరం ముంచుకు వచ్చింది. ఆ జ్వరంలో యీ మ్మాయినే కలవరిస్తున్నాడు. అతని తల్లిదండ్రులు వచ్చి ా పిల్లను బ్రతిమలాడారు—ఒకసారివచ్చి చూడమని. పాపం అని జాలిపడి వెళ్ళింది. అతను యిట్లా కలవరిస్తున్నాడు: "నేనేమీ దురుద్దేశంతో చేయలేదులీలా! నువ్వు నన్నపార్థం చేసుకున్నావు నువ్వు నిద్రపోతోంటే నీ వ్రేలి ఉంగరం వొదులుగా వుందేమో—జారి క్రింద పడుతోంది. నీ చెయ్యి కిటికీలో వుండటంవల్ల, అది బయటపడి పోతుందేమోనన్న ఆరాటంతో చెయ్యి పట్టుకున్నాను" ఆమెకు కళ్ళనీళ్ళు తిరి గాయి. తను ఎంత అపోహపడింది! అప్పట్నుంచీ అక్కడే వుండి అతనికి సపర్యలు చేసింది, రక్షించుకుంది. తరువాత వాళ్ళిద్దరి మధ్యా పర్యవసానం పాఠకులే ఊహించుకుందురు గాక. ఇది చివరివాక్యం.

ఇది పబ్లిష్ చేస్తే యీ రాజ్యలక్ష్మికి పుట్టగతులుం

టాయా అనుకున్నాడు మధుబాబు. ఎట్లా ధైర్యం చేసింది అట్లా రాయటానికి? మారు మాట్లాడకుండా దీన్ని ఒక మూలకు నెట్టివేయవచ్చు కాని అతనికి ఆ అమ్మాయిని చూడాలనీ, వీలయితే మాట్లాడాలనీ కోరిక కలిగింది. ఫస్టి యర్ చదువుతోంది. సైన్సు గ్రూపే. మరునాటి ఉదయం ఆడపిల్లలందరూ క్లాసులకి పోతోంటే వరండాలో నిలబడి గమనిస్తూ "రాజ్యలక్ష్మి ఎవరోయి అందులో?" అని ప్రశ్నించాడు ప్రక్కనున్న అతన్ని.

"ఏం? దానిమీదకు పోయింది మనసు? అదిగో! అట్నుంచి నాలుగో అమ్మాయి. ఆకుపచ్చరంగు వోణీ వేసుకోలా? అదీ" అన్నాడు ప్రక్కవాడు.

"పదహారేళ్ళకంటే ఎక్కువ వుండవు" అనుకున్నాడు మధుబాబు. పరికిణీ, వోణీ వేసుకుంది. కొంచం సన్నగా, తెల్లగా, కోలముఖం, పెద్దపెద్ద కళ్ళతో చురుగ్గా గోచరించింది. కాని ప్రక్క విద్యార్థి ఆమెను 'అది' అని సంబోధించటం అతనికి నచ్చలేదు. అతను ఒక్కడే కాదు. పరోక్షంలో ప్రతివాడూ-అమ్మాయిల్ని గురించి అలానే మాట్లాడటం గమనించాడు.

మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో ధైర్యం చేసి గరల్స్‌రూమ్ దగ్గరకు వెళ్ళాడు. అతని గుండె గబగబ కొట్టుకోసాగింది. తను అక్కడకు ఎందుకు వెళ్ళాడో స్పష్టంగా తెలీదు. గుమ్మం యివతల నిలబడి బెదురుతూ లోపలకు చూశాడు.

ఆడపిల్ల లందరూ లోపల నవ్వుతూ, కేరింతాలు కొడుతూ ఉషారుగా వున్నారు. ఒకళ్ళనొకళ్లు పరాచికాలు ఆడుతున్నారు. ఒకళ్ళిద్దరు ఓ మూల గట్టిగా అరుచుకుంటూ మాట్లాడుకుంటున్నారు. కొంతమంది టిఫిన్ తింటున్నారు. ఒకమ్మాయి తెలుగు నవల, ఏదో చదువుతోంది. ఒకతె ప్రక్కనున్న నేస్తురాలితో "వాడులేడూ? జనార్దనంగాడు. క్రిందాక నన్ను నోట్సు అడిగాడు సిన్సియర్‌గా పోజువేసి" అంటూ మధుబాబు ముఖం కనిపించి ఆగిపోయి, నాలిక కొరుక్కొని నెమ్మదిగా లోపలకు జారుకుంది.

ఓ ఎర్రటి అమ్మాయి బయటికొచ్చి "ఎవరు కావా లండీ?" అనడిగింది సంకోచించకుండా.

"రాజ్యలక్ష్మి." అన్నాడు తడబడుతోన్న కంఠంతో మధుబాబు. "ఎందుకొచ్చాను-బుద్ధి గడ్డితిని యిక్కడకు ?" అని లోలోపల విసుక్కున్నాడు.

"ఏ రాజ్యలక్ష్మి అండీ ?" అన్నదాపిల్ల కొంచం ముందుకువంగి, ప్రశ్నార్థకంగా ముఖంపెట్టి

"ఎన్. రాజ్యలక్ష్మి, ఫస్టియర్ బై. పి. సి"

ఆ అమ్మాయి లోపలకు వెళ్ళి, గట్టిగా "ఓ రాజ్యలక్ష్మి ఎన్. ఫస్టియర్ బై. పి. సి. నీకోసం ఎవరో వేంచేశారు. దయచెయ్యి" అన్నది కొంటెగా.

లోపలనుండి రాజ్యలక్ష్మి కొంచం కంగారుగా యివతలకు వచ్చింది. గుమ్మం యివతల నిలబడివున్న మధుబాబుని చూశాక "నీవా? రా?" అన్న తెలుస్కున్న భావం ఆమె వదన మండలంలో గోచరమైంది.

"ఏమిటండీ?" అన్నది దగ్గరకొచ్చి నిలబడి ఎంతో చనువుగా.

మధుబాబు నమస్కారం పెడదామని ఆసంగతి మరిచి పోయాడు. అంతేగాక తను వచ్చింది వొట్టినే ఆషామాషీగా కాదని, సకారణయుతంగాననీ ఆమెకు వెంటనే తెలిసేటట్లు చేయాలని తాపత్రయ పడసాగాడు.

"మీతో ఒక విషయం మాట్లాడదామనివచ్చానండీ" అన్నాడు తొట్రుపాటుతో.

రాజ్యలక్ష్మి వెనక్కి తెరిచివున్న తలుపుకి భుజాన్ని ఆనించి, చేతులు రెండూ హృదయం మీదుగా కట్టుకుని "చెప్పండి" అన్నది చిన్నగా నవ్వి

ఈ దృశ్యం చూపరులకు ఎట్లా వుంటుందా అని ఆలోచించాడు మధుబాబు. తాను దిగువన నిలబడి కొంచం తలఎత్తి మాట్లాడుతూండటం, ఆమె కాస్త ఎత్తులో వయ్యారంగా తలుపుకి భుజాన్ని ఆన్చి నవ్వుతూ మాట్లాడుతూండటం...! అప్పుడప్పుడు కొంతమంది స్టూడెంట్సు, లేడీస్టూడెంట్సుతో యిక్కడ నిల్చుని సంభాషించేటప్పుడు యిదే భంగిమలో కనబడ్డారు. ఇతరుల దృష్టికి ఫలానావిధంగా గోచరించాలని అజ్ఞాతంగా వీళ్ళు ఊహిస్తూ వుంటారనటంలో పొరపాటు ఏమీ లేదు కదా.

"మేగజైన్‌కి కథఒకటి యిచ్చారు మాశారూ...?"

లోపల అమ్మాయిల అల్లరి హెచ్చుతోంది. "వాడు లేడూ...? ఆ అరేబియన్ హార్సుగాడు" అంటోంది ఎవర్నిగురించో ఓ రాలుగాయి.

"పిల్లాయింతే. అబ్బాయిల్ని గురించి వాడు, వీడూ అనే సంబోధిస్తూ వుంటారు" అని విస్మయం చెందాడు మధుబాబు.

"చదివారా ?" అంది రాజ్యలక్ష్మి కొంచం సిగ్గు పడి.

"చదివాను" అని ఊరుకున్నాడు మధుబాబు. తాను ఏమి చెబుదామని వచ్చాడు ? ఇక్కడ బాగుంటుందా ఆ ప్రసక్తి ?

"అది... చూశాకూ – ఆ కథ బాగానే వుందిగానీ–బాయిస్ గురించి అలా రాయటం, చివర్న ముగింపు కొంచం యిదిగా వున్నాయి. అందులో ఫస్ట్ పర్సన్‌లో రాశారు. అది పబ్లిష్ చేస్తే –స్టూడెంట్సు సంగతి మీకు తెలియనిది ఏముంది?" అంటూ ముక్కలు ముక్కలుగా విషయం బయట పెట్టేశాడు.

రాజ్యలక్ష్మి కిలకిలమని నవ్వి "మొహమాట పడుతున్నారే ఉన్న విషయం చెప్పటానికి" అంది. సిగ్గుతో మధుబాబు ముఖం అరుణరాగ రంజితమైంది. చేతులు క్రిందికి దించి, వోణీ అంచు వ్రేలికి చుట్టుకుంటూ "నిజమేనండీ, పిచ్చిదానిలా ఏదో రాశాను. ఎందుకలా రాశానో నాకే తెలీదు తరువాత ఆలోచించుకుంటే బలే సిగ్గేసింది. అది కర్మంకాలి మీరు అచ్చువేస్తే యీ కుర్రాళ్ళు నన్ను బ్రతకనివ్వరు. చింపెయ్యండి దాన్ని. ప్లీజ్." అన్నది జాలిగా ముఖం పెట్టి

"ఆఁ, చింపట మెందుకులెండి. తిరిగి పంపించేస్తాను. పోనీ యింకోటి రాసివ్వండి" అన్నాడు మధుబాబు సంకో చంగా. అతనికి ఆశ్చర్యంగా వుంది ఆమె మాటలకు.

ఆమె పెదవి విరిచి "కథలు తక్కువైనాయి నా బ్రతుక్కి. ఎందుకో యిప్పుడే రాశావంటే. ఏదో గమ్మత్" అని ఆలోచిస్తూ ఊరుకుంది.

మధుబాబు నీరస కంఠంతో "మీ యిష్టం, మరి వస్తాను. సెలవు" అంటూ వెనక్కి తిరిగాడు.

"సెలవు కవిగారూ" అన్నది రాజ్యలక్ష్మి మృదు కంఠంతో వెనకనుండి.

ఒక మృదు సుగంధం వీచినట్లయింది. అతను ఆగి, వెనక్కి చూసి, "నేను కవినిగాను. రచయితను" అన్నాడు.

"ఊహుఁ. అలాగా? నాకు రెంటికీ డిఫరెన్సు తెలీదు లెండి. అయితే సెలవు అభిమాన రచయితగారూ" అంది, కొంచం నవ్వి.

అతను పులకితుడయాడు. ఈ అనుభూతి సరికొత్తది. "నమస్తే" అంటూ మెల్లిగా అక్కడ్నుంచి కదిలాడు.

  

ఓ సంధ్యాసమయాన రాజ్యలక్ష్మి మరో స్నేహితు రాలితో కాలేజీకి అవతలగా, కాలవ ఒడ్డున షికారు కొడుతూ మధుబాబుకు గోచరించింది. అతను రాసుకుందా మని క్లాసులు అయిపోయాక అటు కేసి వెళ్ళాడు. ఆమె చెలి కత్తెతో సాక్షాత్కరించింది.

"రండి, రవయితగారూ రండి. ప్రకృతిసౌందర్యాన్ని తనివితీరా గ్రోలుదామని యిలా వచ్చాం. చూశారా యీ కాలవ! నిండుగా, గర్వంగా, అస్తమిస్తోన్న సూర్యకాంతిలో ఎర్రని కాంతులు చిమ్ముతూ ఎట్లా ప్రవహిస్తోందో! దూరంగా ఆ సగం విరిగిన కొండ చూడండి. జీవితమే విరిగినట్లు లేదూ! దాన్ని చూస్తోంటే? అబ్బ! చుట్టూ రకరకాల యీ మొక్కలు, చెట్లు, అర్థంలేని పువ్వులు! ఈ కాలవలో దూకి చచ్చిపోవాలని వుందండి" అనేసింది రాజ్యలక్ష్మి ఊపిరి లేకుండా.

ప్రక్కనున్న స్నేహితురాలు ఆమె తలమీద ఒక్క మొట్టికాయ వేసి చెప్పుకుని "ఆపవే పిచ్చిమొద్దూ నీ వాగుడు" అంది మందహాసం చేస్తూ.

మొదట వాళ్ళనా ప్రాంతంలో చూసి, యిబ్బందిలో పడి అక్కడ్నుంచి వెళ్ళిపోదామనుకున్నాడు మధుబాబు. ఈ ధోరణి చూసి చకితుడై శిలావిగ్రహంలా నిలబడ్డాడు ఆ సూర్యాస్తమయ కాంతిలో, ప్రకృతి శోభలో—ఆ లేత మగువ వనదేవతలా గోచరించింది అతనికి.

"మాట్లాడక నిలబడ్డారేం? రండి. ఆ యిసుకరాసుల మీద కూర్చుని కబుర్లు చెప్పుకుందాం" అని అటుకేసి దారి తీసింది. రాజ్యలక్ష్మి మిత్రురాలు కొంచం యిరకాటంలో పడింది. అయినా యీ కొత్త అబ్బాయి ముందు నోరు మెదల్చలేక మౌనంగా అనుసరించింది.

స్నేహితురాళ్ళిద్దరూ ప్రక్క ప్రక్కన చతికిలబడ్డారు. మధుబాబు కొంచం ఎడంగా కూర్చున్నాడు.

"మీ కథలంటే నాకు చాలాయిష్టమండీ" అంది రాజ్యలక్ష్మి సంభాషణ ప్రారంభిస్తూ.

ఒక అందమైన అమ్మాయి నుంచి యీ కాంప్లిమెంటు లభించిందంటే ఎవరు మధురానుభూతిని పొందరు గనుక ? అతను చిరునవ్వు నవ్వాడు మనసులో ఆశ్చర్యపడ్తూ.

రాజ్యలక్ష్మి ఒక్క నిముషం మౌనం వహించి "మీరు అంతా ఊహించి రాస్తారా; జీవితాన్నుంచి చూసి రాస్తారా?" అని ప్రశ్నించింది.

కొన్నాళ్ళ క్రితం అయితే అతని ప్రశ్నకు జవాబు లేకుండా వుండేవాడు. ఇప్పుడు కొంచం కొంచం నేర్చుకుంటున్నా డయ్యె!

"నా వయస్సు చాలా చిన్నది" అన్నాడు. "ప్రపంచంలో నాకు తెలీని విషయాలు ఎన్నో వున్నాయి. నా అనుభవం చాలా కొద్దిపాటి. ఊహిస్తాను. కాని ఊహించేటప్పుడు నన్నా పరిస్థితుల్లో యిమాజిన్ చేసుకుని వ్యక్తిగత మైన అనుభూతి పొందుతాను. అదే రాస్తాను."

నిజానికి ప్రపంచాన్ని విమర్శనా దృష్టితో పరిశీలించి, అది సాహిత్యంగా రూపొందించ గలిగేశక్తి అతనికింకా అలవడ లేదు. కాని అతను ఊహించి రాసేవన్నీ ఎక్కడో నిజాలు గానే వున్నాయి.

"మీ ఆశయం ఏమిటి?" అనడిగింది రాజ్యలక్ష్మి.

"అది నేనింకా స్పష్టంగా తెలుసుకోలేను. నన్ను బాధించే వేధించే సమస్యలు అనేకం కనిపిస్తున్నాయి. వాటన్ని

నేను మనస్ఫూర్తిగా దేన్ని వరించాలో తెలుసుకోలేని స్థితిలో వున్నాను. రోజురోజుకూ నాలో క్రొత్తదనం ఫీలౌతున్నాను. ఈ నూతనత్వం ఆగిపోయే వరకూ నాకు నేను స్పష్టంగా అర్థంకాను. దానంతట అది సహజంగా సిద్ధించే వరకూ నేనేమీ సిద్ధాంతాలు లేవనెత్తను; వాటిని యితర్ల మీద ప్రయోగించను నేను స్వంతంగా కొన్ని అనుభవాలు పొందాలి. అయినా యీ అతివాదాలూ, యిజమ్సూ నాకు సరిపడవు. మానవత్వానికి దెబ్బకొట్టే ప్రతి అంశమూ నాకు వస్తువే. ఈ మానవత్వపు విలువల్ని ప్రదర్శించటమే బహుశః నా ఆశయ మనుకుంటాను. జీవితాన్ని కప్పివేసే అనేక తెరలు వుంటాయి ఈ తెరచాటున అసలు నిజం ఎక్కడో దాగొని వుంటుంది. వాటిని తరుచుకుంటూపోయి, ఆనిజాన్ని ప్రకటించటమే బహుశా నా లక్ష్యం" మధుబాబు ఆగాడు.

అతనిప్పుడు మాట్లాడిన మాటల్లో పూర్తి నిజాయితీ వుంది. కొంతమందికి ఓ ప్రకృతి వుంటుంది. ఫలానా అంశాన్ని గురించి స్థిరమైన అభిప్రాయమంటూ ముందునుంచీ వుండదు. ఎవరైనా దాన్ని గురించి గుచ్చి గుచ్చి ప్రశ్నించి నప్పుడు ఆత్మవిమర్శ చేసుకుంటూ సమాధానం మొదలెడతారు. ఒకే సమయంలో అభిప్రాయాన్ని ఏర్పాటు చేసుకోవటమూ, దాన్ని యితరులకి వ్యక్తం చేయటమూ జరుగుతుంది.

"అసలు మీరు రాయటం ఎందుకు మొదలు పెట్టారు?" అనడిగింది. రాజ్యలక్ష్మి ముగ్ధురాలై. స్నేహితురాలు యిసుకని గుప్పిళ్ళలో తీసి క్రిందకువిడుస్తోంది.

ఈ ప్రశ్నకు ఆనాడు ఉమాపతికి జవాబు చెప్పలేక తికమక పడ్డాడు. ఓ ముఖ్యమైన సంఘటన అతని కప్పుడుగుర్తు రాలేదు.

"ఓసారి ఓ దృశ్యం తిలకించాను. నేను ఎంతగానో ప్రేమించిన మా అక్కయ్య ముద్దులకొడుకు, అనుకోకుండా జేజిలో కలిసి పోయాడు. మేమంతా ఏడుస్తున్నాం. ఆ సమయానికి దారిన పోతోన్న ఓ చిన్నపిల్ల అక్కడకు వచ్చి హృదయ విదారకమైన యీ దృశ్యం చూసి జలజలా కన్నీరు కార్చివేసింది ఆ సంఘటన నా హృదయాన్ని ఊపివేసింది. ఆ అనుభూతి, మమత కాగితంపై పెట్టాలనిపించింది. మొట్టమొదటి కథ రాసేశాను"

రాజ్యలక్ష్మి తన విశాల నేత్రాలను ఎత్తి అతనివంక చూస్తూ "ఆకథ యిప్పుడుందా?" అని అడిగింది.

"ఎక్కడో వుండాలి. వెదకాలి" అన్నాడు మధుబాబు.

"వెదకండి. కనిపిస్తే నాకు తప్పక ఓసారి యివ్వాలి మీరు" అంది ఆమె.

"అలాగే"

క్రమంగా చీకటి తెరలు క్రమ్ముకు వస్తున్నాయి. రాజ్యలక్ష్మి చిన్నగా నిట్టూర్చింది "నాకెందుకో మీరాసే చవలంటే ఎంతో యిష్టం. మరి ఎవరివి చదివినా—వాటిల్లో కావలిసినంత గడుసుదనం అగపడేది. మీ రచనల్లో మాత్రం

నిష్కల్మషమైన మీ హృదయం ఎల్లెడలా వెల్లివిరుస్తూ వుంటుంది" అన్నది.

కాసేపు మౌనంగా కూర్చున్నారు. రాజ్యలక్ష్మి స్నేహితురాలు ఆమెను నెమ్మదిగా చేతిమీద గిచ్చి "వెడదామా?" అన్నట్లు సంజ్ఞ చేసింది. "ఇంక పోదామండీ" అన్నది రాజ్యలక్ష్మి. ముగ్గురూ లేచి నిలబడ్డారు. ఓ పది నిముషాలుపాటు నడిచి చుట్టుగుంట దగ్గర రోడ్డుమీదకు వచ్చారు.

"బస్సులోనే వస్తారా?" అనడిగింది రాజ్యలక్ష్మి.

"తప్పదుగా"

ముగ్గురూ రోడ్ ప్రక్కగా నిల్చున్నారు. బస్ వచ్చేలోగా ఆమె ఎన్నో కబుర్లు చెప్పింది. ఆమెకు డ్యాన్సంటే చాలా అభిరుచి. మొన్న మొన్నటిదాకా నేర్చుకుంటూనే వుంది. కాలేజీలో చేరాక యింకా యీ తైతక్క లాడటమేమిటని వాళ్ళ పిన్ని కోప్పడితే నాన్నగారు మానిపించేశారుట తనకు చదువంటే పెద్ద యింటరెస్ట్ లేదుట. అందులో యీ సైన్సు గ్రూపంటే మహా చికాకు. కాని తాత్రిపోరు మీదట తప్పలేదు. పుస్తకాలు ఎక్కువ చదువుతుందిట. అందులో ట్రాజడీలంటే చెవి కోసుకుంటుంది.

బస్ వచ్చింది.

గవర్నరుపేట సెంటర్ రాకముందే ఓ స్టాప్‌లో ఆమె స్నేహితురాలితో దిగిపోయింది-వాళ్ళయిల్లు సమీపంలో వున్నదని. మధుబాబు వంటరిగా ఆలోచిస్తూకూర్చున్నాడు.

అనుకోకుండా అకస్మాత్తుగా యీ అమ్మాయితో పరిచయం లభించింది. ఒకవేళ తను కథకుడు కాకపోతే యీఅవకాశం లభించి వుండేది కాదేమో. చాలామంది చాలా పద్ధతుల్లో అమ్మాయిలతో పరిచయం చేసుకుంటారు. తను మరో రకంగా చేసుకోలేడు. ఎంత చనువుగా మాట్లాడింది! తాము అలా దగ్గర దగ్గరగా కూర్చుని మాట్లాడటం ఎవరైనా చూశారా? ఈ కాలేజీలో వదంతులకు లోటు లేదు

అన్నిటికన్నా-తనని రచయితగా అభిమానించటం అతనికి నచ్చింది. బహుశా యింత మనస్ఫూర్తిగా యింత వరకూ ఎవ్వరూ తనని అభిమానించలేదేమో.

## 8

డిశంబరు ప్రవేశించింది. కాలేజీలో సాంస్కృతిక వారోత్సవాలు జరుగుతాయి. నాటకాలతో, ఉపన్యాసాలతో, యింకా అనేక యితర ముచ్చట్లతో ఆకర్షణీయంగా గడిచేకాలం.

మధుబాబు దగ్గరకు కొందరు విద్యార్థులు వొచ్చి వారోత్సవాల్లో ప్రదర్శించటానికి ఒక నాటకం రాసిపెట్టమని అడిగారు. నాటకం! అతను మొదట సంకోచించాడు. ఇంత వరకూ ఎప్పుడూ రాయలేదు. "ప్రయత్నిస్తానండీ" అన్నాడు.

"టైము లేదండీ. చాలా త్వరగా రాసివ్వాలి. మళ్ళీ రిహార్సల్సు, వగైరాలు ఉంటాయి కదండీ"

మధుబాబు అంగీకరించాడు

అంతే. ఇతి వృత్తికోసం ఎడతెరిపి లేకుండా బుర్ర బద్దలు కొట్టుకున్నాడు. ఎవరో అన్నట్లు కథ రాయటం మొదలు పెట్టేటప్పుడు ఒక మాదిరిది అయినా పర్వాలేదనే ఉద్దేశం వుండొచ్చుగాని_నాటకం అయితేమాత్రం బ్రహ్మాండమైంది రాయాలన్న సంకల్పంతో ప్రారంభిస్తారు... ఒచ్చిన చిక్కేమిటంటే స్త్రీ పాత్ర వుండకూడదు. నాలుగయిదు రంగాలకంటే ఎక్కువ వుండకూడదు. ఈ నాలుగయిదిట్లోనూ రంగస్థలం మారకూడదు

మొదలుపెడితే_ఆపని పూర్తయ్యేవరకూ నిద్రపట్టే స్వభావం కాదయ్యె. ఇదివృత్తం స్ఫురించటమేమిటి? మూడు రోజులు ఏకబిగిన కూర్చుని రాసెయ్యటమేమిటి - నాటకం పూర్తయిపోయింది. పుస్తకం పట్టుకెళ్ళి ఆవిద్యార్థులకిచ్చాడు. వాళ్ళది చదివి "బాగుందండీ" అన్నారు. రిహార్సల్సు ప్రారంభమైనాయి.

మధుబాబు ఉత్సాహంగా రిహార్సల్సుకి వెళ్ళసాగాడు సాంస్కృతికోత్సవాల్లో యిదేగాకుండా యింకా మూడు నాలుగు నాటకాలు ప్రదర్శించ బడుతున్నై. అవన్నీ ప్రసిద్ధ రచయితలు వ్రాసినవే. తననాటకం వాటిముందు నిలుస్తుందా అని భయపడ్డాడు మధుబాబు. ఆలోచినప్పుడల్లా సంభాషణలు మారుస్తూ వచ్చాడు.

ఇంతలో ఒక తమాషా జరిగింది. ఆనాటకంలో కథా నాయకుడి వేషం వేస్తోన్న అబ్బాయికీ, మిగతా విద్యార్థులకూ ఏదో సందర్భంలో తగాదా వచ్చింది. అతను నటించ నని భీష్మించి వెళ్ళిపోయాడు మిగతావాళ్ళకు వెళ్ళి అతన్ని బ్రతిమలాడే సహృదయం లేకపోవటంలో వింతలేదు. ఇంకా గడువు అయిదు రోజులేవుంది. నాటక ప్రదర్శన ఆగిపోయే పరిస్థితి వచ్చింది

"ఇంకెవరూ తేరా హీరోగా పనికి వచ్చేవాడు?" అని అడిగాడుమధుబాబు.

"ఎవరున్నారు? హీరోలమని చెప్పకు తిరిగేవాళ్ళంతా ఎందులోనో ఒకదాన్లో నటిస్తున్నారు. మేము యిందులో మిగతా పాత్రలు తీసుకొంటిమాయె ఇప్పుడీ విషయం డ్రమెటిక్ అసోసియేషన్ వైస్ ప్రెసిడెంట్‌కి తెలిస్తే మండిపడ టమేగాక మననాటకాన్ని స్టేజిచేయనివ్వడు" అన్నారు వాళ్ళు.

మధుబాబు ఆలోచనలో పడ్డాడు.

ఇంతలో వాళ్ళలో ఒకడు "మీ పర్సనాలిటీ బాగుం టుందండీ. మీరే యాక్టు చేసెయ్యకూడదూ?" అన్నాడు.

మధుబాబు కంగారు పడుతూ "నేను యింతవరకూ ఎప్పుడూ నటించలేదే" అన్నాడు

"దానేముందండీ? మీరు రాసిన నాటకమయ్యె! మీకన్న పాత్రను ఎవరెక్కువ అర్థం చేసుకుంటారు గనుక? పొరబా రాదనే బెంగకూడా వుండదు. అదీగాక మీలో మంచి కల్చర్ వుంది"

తను యిలా నటుడిగా స్టేజిమీద ప్రత్యక్షమయ్యే అవకాశం వస్తుందని కలలోకూడా అనుకోలేదు. ఒకవేళ ఊహాలోకంలో చాపల్యానికి ఎప్పుడైనా యీ యోచన మెదిలివుంటే "ఆ సులభంగా తప్పించుకోగలను—ఆ పరిస్థితి నుంచి' అని తేలిగ్గా భావించి వుంటాడు. కాని ఒకళ్ళు బలవంతం చేసినప్పుడు తమకు యిష్టంలేని పనులు చేయటానికి మనుషులు ఎట్లా సంసిద్ధులౌతారో యిప్పుడు గ్రహించాడు.

వాళ్ళంతా కలిసి అతన్ని ఉక్కిరి బిక్కిరి చేశారు. చివరకు "ఊఁ" అనిపించారు.

కాని యీ రిహార్సల్సు, హడావుడీ చాలాకాలం వ్యయమౌతుంది. చాలా రాత్రయేవరకూ కాలేజీలో గడపాల్సి వుంటుంది. చదువుకునేందుకు స్నేహితుడింటికి పోతున్నానని యింట్లో అబద్ధం చెప్పాల్సి వచ్చింది. రిహార్సల్సు అట్టహాసంగా జరిగిపోతున్నాయి.

ఈ విషయం రాజ్యలక్ష్మికి తెలిసింది. "హీరో అయ్యారుటగా" అంది నవ్వుతూ గరల్సురూమ్ ముందు.

"మీరు నర్తకి అయినప్పుడు......"

"చచ్చాం. అయితే అప్పుడే మీదాకా వచ్చిందీ ? ఇంగ్లీషు లెక్చరర్ వచ్చి ఒప్పుకునే దాకా తెగ వేధించాడనుకోండి"

"మన యిద్దరి ప్రోగ్రామ్సూ ఒకే రోజున తెలుసా?" అన్నాడు మధుబాబు.

"ఏమిటి? మీది ఆవేళేనా? స్పెషల్ డే కాదా అది లేడీస్ కు?" అనడిగింది రాజ్యలక్ష్మి విస్మయ పూర్వకంగా.

"మీకు స్పెషల్ డే అంటూ ఏమీ లేదు. ఆ వేళ ఎక్కువ భాగం అతిథులుగా స్త్రీలు వస్తారంతే"

"మీ రిహార్సల్సు చూడాలని వుంది" అంది రాజ్యలక్ష్మి గారాబంగా.

"వద్దు బాబూ! నాటకం చూడకుండానే ఉడాయించాల్సి వస్తుందప్పుడు" అని మధుబాబు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

ఆరోజు వచ్చింది.

అనుకున్నట్లు బయటినుంచి వచ్చిన అతిథులలో అధికం స్త్రీలే. అయితే కాలేజి విద్యార్థులుకూడా రోజుకంటే ఎక్కువగా వచ్చారు. విద్యార్థినుల బుర్రకథ, ఫ్యాన్సీడ్రెస్-చాలా ఉత్సాహజనకమైన అంశాలున్నాయి. గ్రీన్ రూమంతా హడావుడిగా, అట్టహాసంగా ఉంది. ఆడవాళ్ళదే మెజారిటీ అయిపోయింది. వాళ్ళందరూ మేకప్ చేసుకోవటం, హంగామా చాలా వుంటుంది కాబట్టి నాటకంలో వేసే వాళ్ళు కర్టెన్ దాటి ఇవతలకు రాకూడదని, ఆంక్ష పెట్టి, వాళ్ళచుట్టూ ఒక తెరకట్టేశారు. "మరి బ్రహ్మాండమైన అప్స[illegible] ఏమయినా వస్తేనో?" అన్నాడు ఓ విద్యార్థి తలకా[illegible]తలపు పెట్టి. "ముందా తలకాయి అవతలకు దూర్చండి,

అవసరం వుంటే అవతల్నుంచి "కేకెయ్యండి" అందో యువతీమణి.

ప్రోగ్రాంలో ఎందువల్లనో కొన్ని మార్పులు జరిగాయి. దాని ప్రకారం మొదట ఫ్యాన్సీడ్రెస్, తర్వాత నాటకం, పిదప డ్యాన్స్ ఈ విషయం వెల్లడి అయేసరికి 'అరె! కే స్టేజి ఎరేంజ్ చేసుకోవాలే' అంటూ అప్పటికి మేకప్ పూర్తయిన మధుబాబు తెర తొలిగించుకుని యువతులను వచ్చాడు.

"అయ్యయ్యో! ఆడవాళ్ళం వున్నాం" అంది సోదె వేషం వేస్తోన్న అమ్మాయి.

"అయితే భయపడాల్సింది నేను" అన్నాడు చప్పున మధుబాబు పరిహాసంగా.

"హాసీవ్! అతిను కవే జాగ్రత్త" అని హెచ్చరించింది ప్రక్కనున్న ఓ ఎలజవ్వని.

"కవిగారూ! సోదె చెప్పమంటారా?" అంది ముందుకొస్తూ ఆ పాత్రధారిణి

"చెయ్యిచూశా? అయితే యిదిగో నా చెయ్యి"

ఆ అమ్మాయి చనువుగా అతని చెయ్యిపట్టుకొని పరిశీలిస్తూ "సోది సెపుతునయ్యా సోది సెపుతాను. ఉన్నది వున్నట్లు—లేనిది లేనట్లు, అరిచెయ్యి—చూసి— అరిమరికి లేక" అని "పెట్టవుందా బాబూ నీకు?" అని ప్రశ్నించింది

"ఇద్దరు" అన్నాడు మధుబాబు

"ఊఁ, ఉషారైన పోతు. గుసగుస లాడుతున్నాడు" అని అతనిచెయ్యి విసిరికొట్టింది.

ఇంతలో అక్కడికి డ్రమెటిక్ వైస్ ప్రెసిడెంట్ వచ్చి హడావుడిపడుతూ, "ఇంకా యిలాగే వున్నారా టైమయి పోతోంటే? ఫ్యాన్సీడ్రెస్ వాళ్ళంతా ఒకరివెంట ఒకరు తెర ముందుకు వచ్చెయ్యండి. ఊఁ, క్విక్" అన్నాడు.

"మనసంత కంగారు – మన పోతురాజుకు
వట్టిపోజేగాని – గట్టితనమే లేదు"

"ఓసి పదవే అల్లరి చెయ్యకుండా" అని, మరో యువతీలలామ ఆమెను ముందుకు తోసింది. అంతా కిలకిల మని నవ్వుకుంటూ ప్రక్కకి వెళ్ళారు.

గోడకు ఓ క్యాలెండర్ తగిలించాలి, రంగస్థలాలంకరణకు. క్యాలెండరైతే వుందిగాని–అది గోడకి తగిలించటానికి ఏమీ లేదు. మధుబాబు అన్వేషిస్తోన్న నేత్రాలతో అటూ యిటూ చూశాడు. లోపల కర్టెన్ వెనక కదలిక అయింది. అటుకేసి తిరిగి వెళ్ళాడు.

"అయ్యో!" అంది స్త్రీ కంఠం. వెంటనే నేలజీరాడుతున్న పమిటను భుజంమీదకి వేసుకుని "ఎవరండీ మీకు? చెప్పాపెట్టకుండా యిలావస్తే ...." అని కోపాన్ని వెలిగక్కింది.

"రాజ్యలక్ష్మి!" అన్నాడు మధుబాబు ఆమె ముఖంలోని సౌందర్య రేఖలకు విభ్రాంతుడై.

ఆమె చకితయై, అతనిముఖంలోకి తీక్షణంగా చూసి, మరుక్షణ లో కిలకిలమని నవ్వేస్తూ "అబ్బ! మీరా? ఎంత మారిపోయారు వేషంలో?" అన్నది.

మధుబాబు కొంచెం లజ్జితుడై, ప్రక్కకిచూస్తూ "పిన్నీసువుందా రాజ్యలక్ష్మి మీదగ్గం?" అన్నాడు.

ఆమె ఓసారి గాజులు సవరించి చూసుకుని "లేదే, ఎందుకూ?" అంది.

"తెరకి కాంలెండర్ గుచ్చాలి. ఇప్పుడు మా నాటకమే ప్రారంభమౌతోంది తెలుసా? మీ నాట్యం ఆ తర్వాత."

"అయ్యబాబోయ్! అంతసేపూ యీ అలంకరణ అంతా భరిస్తూ జపం చెయ్యాలా? ఎందుకు మార్చింది ప్రోగ్రాం?" అనడిగింది విసుగ్గా.

"ఏమో! నాకు తెలీదు. వస్తాను. స్టేజి ఎరేంజి చేసుకోవాలి" అని మధుబాబు అక్కడ్నుంచి కదలబోయాడు.

"ఉండండి" అంది.

అతను ఆగాడు.

"పిన్నీస్ కావాలన్నారుకదూ? కొంచం అటు తిరగండి యిస్తాను."

"తిరక్కపోతే యివ్వరా?"

"సరే తిరక్కండి" అని ఆమే అటుతిరిగి జాకెట్ నున్న పిన్నును ఊడదీసి, చేయిజాచి యిచ్చింది.

"థ్యాంక్స్" అన్నాడు మధుబాబు అందుకుంటూ.

"నేను బాగున్నానా?" అంది రాజ్యలక్ష్మి.

"ఏదీ? ఇంకోసారి చూడనివ్వండి. ఇటుతిరగండి మరి పూర్తిగా."

"అబ్బ! నాకుసిగ్గేస్తుంది బాబూ. చెప్పనక్కర్లేకుంటే వెళ్ళండి."

ఓ చిత్రమైన పరిమళం ఆమె శిరసునుండి వ్యాపించి అతన్ని ఆవహించింది. ఆ మెర్క్యూరిక్ లైట్లవెలుగులో ఆ తెల్లటి శంఖంలాటి కంఠం, సుకుమారమైన ఆలేత భుజం మీది సౌందర్యం అతన్ని మత్తెక్కించింది ఎక్కడిదుంచో మధురమైన సుగంధం వీచినట్లుయింది. ఒక్కక్షణం... ఒక్క క్షణంలో అతను వ్యామోహాంధకారంలో మునిగిపోయాడు. చప్పున ఓ అడుగు ముందుకువేసి ఆమెను భుజాలమీద పొదివిపట్టుకుని బలవంతంగా తనవైపు త్రిప్పుకున్నాడు.

"మధుబాబూ ?" అంది రాజ్యలక్ష్మి కంపిత స్వరంతో.

అతనికళ్ళు జిగేల్ మన్నాయి. అట్లాగే కళ్ళువిప్పి చూడసాగాడు: ఆకాంతిని, సహజలాలిత్యపు సౌందర్యాన్ని తేజోమయ రూపాన్ని భరించలేకపోయాడు. మోహావేశంలో ఆమె ముఖంమీదకు వొంగాడు.

ఛళ్ మంది అతని చెంప.

అతనికి తెలియులేదు. ఆమె సుందర నయనాలకేసి చూస్తున్నాడు. ఆమె కన్నార్పకుండా అతన్ని చూస్తోంది. చప్పున మళ్ళీ ముందుకువొంగి తన పెదాలతో ఆమె పెదా

లను తాకాడు. అతని చూపమీద ఎవరో యీడ్చి కొట్టినట్ల యింది. నిజానికి ఎవరూ కొట్టలేదు. ఇందాకటి దెబ్బ యిప్పుడు స్ఫురించింది. ఆమెను వొదిలి, గబగబ యివతలకు వచ్చేశాడు.

"టైము అయిపోవచ్చింది. ఎరేంజిమెంట్సు పూర్త యినయ్యా?" అంటున్నాడు వైస్ ప్రెసిడెంట్ హడావుడిగా వచ్చి.

మధుబాబు జవాబు చెప్పకుండా కుర్చీఎక్కి క్యాలెం డర్ని తెరకి గుచ్చుతున్నాడు. అతని చెంప మంట పెడు తోంది. రాజ్యలక్ష్మి పెదాలుకూడా మండుతున్నాయి గాపును యిలాగే, అవతల-ఆవంక. ఎట్లాభరిస్తోంది యీ అవమానాన్ని?

"టైములేదు" అంటున్నాడు వైస్ప్రెసిడెంటు.

మూడే మూడునిముషాల్లో బల్లలూ, అవీసర్దేశారు. మధుబాబు అన్నీ యాంత్రికంగా చేస్తున్నాడు. అతన్తోనే మొదలౌతుంది నాటకం. వైస్ప్రెసిడెంట్ ఏదో ఎనౌన్స్ చేశాడు మైకులో. తెరలేచింది.

జీవితంలో మొదటిసారిగా కొంచం పేరుతెచ్చుకున్న రచయిత మధుబాబు నటిస్తున్నాడు.

అతనికి కీర్తివుంది, ధనం వుంది, విద్యవుంది, యవ్వ నం వుంది కాని సుఖం లేదు. ముందుకు వేసే ప్రతి అడుగూ అశాంతిని తెచ్చిపెడుతున్నాయి. అతనికి ఏ ఆడదీ మనసు యివ్వదు. ఇచ్చి యివ్వలేనిస్థితి. స్నేహితులెవరూ అర్థం

చేసుకోగు. ఒక్క నిమిషం మనశ్శాంతి లేదు. ఆత్మహత్య చేసుకోవాలంటే అనేక అవాంతరాలు.

పాత్రలో లీనమై నటిస్తున్నాడు మధుబాబు.

రాజ్యలక్ష్మి స్టేజి ప్రక్కగా నిల్చుని ఆశ్చర్యంగా చూస్తోంది. ఆమెకు జరిగిందంతా గుర్తురావటంలేదు. కన్నార్పకుండా పరిశీలిస్తోంది. ఎంత బావున్నాడు! ఏదో కవ్విస్తోంది అతన్నుంచి. తన ఊహకి అందని అంతస్థులో వున్నాడు. ఎక్కడికో, గొప్పగా పెరిగాడు. ఉన్నతమైన, సుకుమారమైన అతనిమూర్తి ఆమెను ప్రలోభపెట్టింది. జాలి కలుగుతోంది ఏమిటో! ఆమె నేత్రాంచలాలలో నీళ్లు చిలికాయి.

మధుబాబుకు భయం వెయ్యటంలేదు. అతను సర్వం విస్మరించాడు. హృదయం పరవశత్వంతో పొంగిపోతోంది. తనుకళాకారుడు, కళాకారుడు. అతనికంటికి ఎవరూ కనపడ్డం లేదు. ప్రేక్షకులకంటికి అతనుతప్ప ఎవరూ కనబడ్డం లేదు. అవి సంభాషణలుకావు. హృదయ వీణాతంత్రులు. ఎలా రాశాడని ఏమీ తెలియని మధుబాబు? అది సాంఘిక నాటకం కాదు, చారిత్రకం కాదు. కాలానికీ, పరిధులకూ అందీ అందని ఓ అపూర్వ మనస్తత్వ చిత్రణ.

గంటన్నర గడిచాక నాటకంముగిసింది. మధుబాబుని స్టేజిమీద పరిచయం చేస్తోంటే ప్రేక్షకులు కరతాళధ్వనులు చేశారు కాలేజీ ప్రిన్సిపాల్ కళాపిపాసి. ఆయన పులకరించిపోయాడు. గ్రీన్‌రూములోకి వెళ్ళి అతన్ని కావలించుకున్నంత పనిచేసి అభినందించాడు.

మధుబాబుకు తెలియటంలేదు. కలగావుంది. ఎవ్వరికీ జవాబు చెప్పట్లేదు. ఓ మూలకుపోయి మౌనంగా కూర్చున్నాడు.

రాజ్యలక్ష్మి అతన్ని చూసింది. ఎలాగైనా వెళ్ళి పలకరించాలని తొరట్లాడసాగింది. ఇంతలో అతన్ని చాపమీద కొట్టిన సంగతి జ్ఞప్తికి వచ్చింది. కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. వెళ్ళి ఆ చాప - అలా - మృదువుగా రాయాలనుకుంది. శరీరం మరిచి ముందుకు కదలబోయింది. ఎవరో ఆమె భుజంమీద చెయ్యివేశారు. "రావే మతిమరుపుదానా, అప్పుడే ఎనౌన్సుకూడా చేసేశారు బలేదానివే"

మధుబాబు ముఖంఎత్తి ఆమెవంక చూశాడు అదే సమయంలో ఆమె జాలిగా చూసి అక్కడ్నుంచి వెళ్ళిపోతోంది "రాజ్యలక్ష్మి!" అన్నాడతను బలహీనంగా. ఆమెకు వినపడలేదు.

తబలా, హార్మోనియం శ్రుతి నందుకున్నాయి.

నాట్యం మొదలయింది.

మరో లోకంలోకి ఎగిరివెళ్ళింది రాజ్యలక్ష్మి.

"అనిల తరళ కువలయ నయనేన
తపతిన సా కిసలయ శయనేన
సఖి! యారమితా వనమాలినా..."

మధుబాబు విభ్రాంతుడై అవలోకిస్తున్నాడు. రాజ్యలక్ష్మిలోయింతటికళారాధన గూడుకట్టుకుని వుందనితెలియదు యింతవరకూ.

"వికసిత సరసిజ లలిత ముఖేన

స్ఫుటతినసా మనసిజ విశిఖేన"

పెదవులు....తను మలినపరిచిన ఆ మృదువైన అధ రాలు జంకించి పోతున్నాయి. లలిత లలితంగా, మధుర మధురంగా.

"లేదులేదు" అనుకున్నాడు మధుబాబు ఆరాటంతో కొట్టుకుపోతూ–"నేనామెను ప్రేమించలేదు. మహోజ్వల మైన ప్రేమ ఎక్కడ? నా చంచల ప్రవృత్తి ఎక్కడ? ఒక పుష్ప సౌరభాన్ని ఆఘ్రాణించినట్లు యీ సోయగాన్ని ఆస్వా దించటానికి చపలచిత్తుడినై చలించాను. నాది స్వార్థం?"

ఎక్కడినుంచో ఓరాయి విసురుగా వొచ్చి సరిగ్గా ముఖంమీద కొట్టుకుంది "అబ్బా!" అని నుదురు పట్టుకుని నిలబడిపోయింది ఆమె. కళ్ళు గిరగిరమని తిరిగాయి. క్రిందకు వొరిగిపోసాగింది.

ప్రేక్షకుల్నుంచి హాడావుడి బయల్దేరింది. అంతా అల్లకల్లోలమైపోయింది. కొంతమంది విద్యార్థులు గబగబ స్టేజిమీదకు వచ్చి ర్యాలక్ష్మిని పడిపోకుండా పట్టుకున్నారు. మధుబాబులో ఆవేశం పొంగులువారింది. క్రిందకు దూకి బయటకు పరిగెత్తాడు.

ఈ ఘనకార్యం చేసినవాడికి యింత కల్లోలం చెల రేగేసరికి గుండె బేజారైపోయింది. అటూ యిటూ చూసి ప్రక్కనున్న చెలికానితో కాలికి బుద్ధిచెప్పాడు.

వాళ్ళను మధుబాబు వెంటాడుతున్నాడు.

చీకటి. మనుషులలీల్లామాత్రమైన స్వరూపాలు గోచరిస్తున్నాయంతే. మధుబాబుకు ఎక్కడలేని బలం, వేగం వచ్చాయి. రెండు ఫర్లాంగులు వెళ్ళాక కాలవ సమీపంలో అవతల వాళ్ళలో ఒకడ్ని పట్టుకున్నాడు.

"వొదులు, నన్నొదులు" అని గింజుకులాడ్తున్నాడు వాడు.

"దుర్మార్గుడా! ఆ అమ్మాయి నీకేం అపకారం చేసిందిరా?" అంటూ దవడ పగిలేటట్లు ఒక్కటి తగిలించాడు మధుబాబు.

కొంచెం ముందుకు పరిగెత్తిన అతని మిత్రుడు పరిస్థితి గమనించి వెనక్కి తిరిగివచ్చాడు.

"విడిచిపెట్టు" అంటున్నాడు మొదటివాడు.

ఎక్కడలేని ఆగ్రహంతో మధుబాబు మరో చెంపకాయ కొట్టాడు.

రెండవవాడు వెనకనుంచి బలంగా మధుబాబు నెత్తిమీద కొట్టాడు. అతనికి తల తిరిగింది. శక్తినంతా కూడదీసుకుని వెనక్కి తిరగబోయాడు. కాని అవతలివాడు అదే చోట మరోదెబ్బ దబ్‌మనికొట్టి గట్టిగా అవతలకుతోశాడు. మధుబాబుకు కాళ్ళలో బలం నశించింది ఆ తాకిడికి తట్టుకోలేక నేలమీద పడిపోయాడు. లేద్దామని ప్రయత్నిస్తున్నాడు మొదటివాడు తానుచేసే పనేమిటో తెలుసుకోలేని స్థితిలో,

క్రిందనుంచి ఓ రాయితీసి విపరీతమైన కసితో దాంతో అతని తలపై మోదాడు "అమ్మా!" అని ఒక్కసారి మూలిగి తల వాల్చేశాడు మధుబాబు.

యువకులిద్దరూ వెనుదిరిగి చూశారు. కాలేజీఆవరణ నుంచి జనం యిటుకేసి గుంపుగా పరిగెత్తుకు రావటం గోచరించింది. గబగబ పరిగెత్తి కాలవలో దూకి, ఈదుకుంటూ అవతలి వొడ్డుకు వెళ్ళిపోయారు.

## 9

అంతిరాత్రి వేళప్పుడు కొడుకు తలనిండా గాయాలతో తీసుకు రాబడటం చూసి-సుందరమ్మగారికి గుండెలవిసి పోయాయి. "ఇదేం కర్మరా దేముడా నిశ్శబ్దంగా కాలేజికి వెళ్ళిన కుర్రాడికి" అంటూ ఏడ్చింది.

విశ్వనాథంగారు డాక్టరుకి కబురుచేసి వచ్చి "వీడసలే అర్భకపు సన్నాసిగదా. ఆ రాడీలజోలికి పోకపోతే ఏం చెప్పు? చేతులు కలపటానికి తగినబలం ఏడిసింది గనుకనా?" అన్నాడు.

మధుబాబు నీరసంగా మంచంమీద పడుకున్నాడు. తండ్రి మాటలకు అతనికి దుఃఖం కలిగింది "నేనింత బలహీనంగా ఎందుకుపుట్టాను?" అనుకున్నాడు.

తల్లి అతని ప్రక్కలో కూర్చుని గుండెమీద చెయ్యి వేసి "ఎంతరక్తం పోయిందో ఏమో పిల్లాడు డీలా పడి పోయినాడు" అంటోంది

తనకు పదెనిమిదేళ్ళు. తను పిల్లవాడా? అంత నీరస స్థితిలోనూ తాను గ్రీన్‌రూమ్‌లో చేసినపని జ్ఞాపకంవచ్చింది. అది పిల్లవాళ్ళు చేసేపనా? అతనికి రాజ్యలక్ష్మి ఎలావున్నదో తెలుసుకోవాలని ఆతృత కలిగింది. కాని ఎవర్నడుగుతాడు? అతన్ని దింపి మిగతా విద్యార్థులంతా వెళ్ళిపోయారు.

తలంతా మండుతోంది-గాయాలతో, ఆలోచనలతో.

* * *

రెండు రోజులు గడిచాక అతన్ని వెదుక్కుంటూ రాజ్యలక్ష్మి వచ్చింది. ఉదయం పది దాటుతోంది. విశ్వనాథంగారు యింట్లో లేరు. సుందరమ్మగారు అప్పుడే వంట పని ముగించుకుని, ముందు గదిలోకి వస్తోంది.

రాజ్యలక్ష్మి గుమ్మంలో నిలబడి సిగ్గుపడుతూ "మధు బాబుగార్ని చూడ్డంకోసం వచ్చానండీ" అన్నది.

"లోపలకు రామ్మా. నీపేరు ఏమిటి?"

చెప్పింది.

"అదిగో! ఆ గదిలో వున్నాడు. తీసుకు వెళతాను రామ్మా... మధూ! నీకోసం ఎవరో వచ్చారు చూడు" అని ఆమెను అక్కడ దింపి యివతలకు వచ్చేసింది.

"రాజ్యలక్ష్మి!" అన్నాడు మధుబాబు ఆశ్చర్యంగా.

"ఎలావుంది?" అనడిగిందామె ముఖంమీదకు వొంగి ఆదుర్దాగా.

"ప్రమాదమేం లేదు, వొట్టి నీరసంతప్ప. నాలుగయిదు రోజుల్లో లేచి ఫ్రీగా తిరగ గలుగుతాను. ఆ కుర్చీ యిలా లాక్కో రాజ్యలక్ష్మి, ఏమీ అనుకోకపోతే."

ఆమె కుర్చీని అతనికి సమీపంగా లాక్కుని కూర్చుంది. చాలా మామూలుగా, పరికిణీ, వోణీ వేసుకుని వచ్చింది రాజ్యలక్ష్మి. ఎండలో నడిచి రావటంవల్ల ముఖమంతా స్వేదబిందువులు అలుముకుని, కొంచం వడిలివుంది ముఖంలో ఏదో విషాదం తాలూకా జీర్ణరేఖలు స్ఫుటంగా దృగ్గోచర మౌతున్నాయి. తలనిండా కట్టుకట్టుకుని పడుకున్న ఆ యువకుడ్ని చూస్తే ఆమెకు విచారం కలిగింది.

"ఎందుకలా చేశారు?" అంది బాధగా.

"ఏం చేశాను?" అన్నాడతను సందిగ్ధంలో నుంచి మతమౌతూ.

"రౌడీల జోలికెందుకు పోయారు?"

"దుర్మార్గులు నిన్ను రాయిపెట్టి కొట్టలేదూ? అయ్యో! అసలు విషయం మరిచాను. నీకు బాగా దెబ్బ తగిలిందా రాజ్యలక్ష్మి?" అంటూ అతను ఆతృతగా ఆమె ముఖంకేసి పరీక్షగా చూశాడు. ఫాల భాగంమీద ఎడంవైపుగా చిన్న మచ్చ కనిపించింది.

ఆమె నిర్లక్ష్యంగా పెదవి విరిచి "కొంచం కళ్ళు తిరిగాయి అంతే. హాయిగా వున్నాను యిప్పుడు" అంది.

మధుబాబు ఆనాటిదృశ్యం జ్ఞాపకం చేసుకుంటున్నాడు. ఒకవిధంగా ఆమె ముఖంకేసి చూడాలంటే సిగ్గుతో చచ్చిన చావుగా వుంది.

"నేను పాపిష్ఠిదాన్ని నావల్లనే మీకు గాయాలు తగిలాయి. మీకు నయమయ్యేవరకూ సపర్యలుచేస్తూ యిక్కడే వుండిపోతాను"

ఈ మాటలు అతనికి విచిత్రంగా ధ్వనించి, ఆమె ముఖంకేసి చూశాడు. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఇద్దరి పెదాలమీదా చిరునగవు అవతరించింది.

"సి కథలో లాగా" అన్నాడు మదుబాబు

రాజ్యలక్ష్మి నవ్వాపుకుంది "పోదురూ!"

మరుక్షణంలో అతని ముఖం మలిన పూరితమై పోయింది "నన్ను క్షమించు రాజ్యలక్ష్మీ...ఆరాత్రి..." అంటూ ఆగిపోయాడు

ఆమె తల వంచుకుని ఆలోచిస్తోంది, ఎట్లా చెప్పటమా యీ విషయమని. అప్పుడు గ్రీన్‌రూమ్‌లో కవిగారు చేసిన పని ఆలోచించదగ్గదే. తను శిక్షకూడా విధించింది. కాని శిక్షముందు, నేరం తర్వాత బొటనవ్రేలితో నేలను రాస్తూ "ఎట్లా చెప్పను? ఇతనికి ఎట్లా చెప్పను?" అనుకుంటోంది.

మదుబాబు భావనాపరంపరలో వున్నాడు బహుశా రాజ్యలక్ష్మి మనసులోనూ యిదే సమస్య ఉత్పన్నమై వేధిస్తోందేమో! తను ఆమెను ప్రేమించాడా? దాన్ని గురించి ఎంతో లోతుగా, విలువైనదిగా చెబుతారే! తనవరకూ వస్తుందా? క్షణికమైన వ్యామోహం తనది. ఈ ఆత్మవంచ

నతో ఆమె జీవితంలో జొరబడే సామర్థ్యం, తెగింపు తనకు లేవు. అదీగాక యీ విషయం తలిదండ్రులకు తెలిస్తే పస్తు పోవటమే గాకుండా నవ్వులపాలు కూడా కావల్సి వస్తుంది. ఒకవిధంగా తనికా జీవితం ప్రాథమిక దశలోవున్నాడు. ఒక వేళ ఆమెను ప్రేమించాననుకుంటే పెళ్ళిచేసుకునేశక్తి తనకి వుందా? తన మాటను ఎవరూ ఖాతరు చెయ్యరు ఆమెను. తన తలిదండ్రులు యిష్టపడకపోతే, వాళ్ళని ఎదిరించే సాహసం వుందా? "ఏడిశావ్. నోరుమూసుకో" అంటాడు తండ్రి. తను రచయిత. లోకానికి వెలుగెత్తి చాటగలడు. ఇంట్లో తనమాట సాగదు. తనవిద్య, అభివృద్ధి వీటన్నిటి మీదా యీ ప్రేమ భస్మీభూతమై పోతుంది.

"మీతో విషయం చెబుదామని వొచ్చాను" అంది రాజ్యలక్ష్మి తలవంచుకొని.

"ఏమిటి?" అన్నట్లు చూశాడు మధుబాబు జాలిగా.

"నన్ను మరిచిపోండి" ఆమె కంఠం జీరపోయింది. నయనాంచలాలనుండి జలజల నీరు కారింది.

"ఏడుస్తున్నావా రాజ్యలక్ష్మీ?" అన్నాడు మధుబాబు వ్యాకులపాటుతో.

"ఏం చేసేది ఏడవక? నన్ను మరచిపోండి. అదే నేను కోరేది" అంటూ ఆమె చివ్వున లేచినిల్చుని "వస్తాను మరి. సెలవు" అని అతను పిలుస్తున్నా వినిపించుకోకుండా బయటకు వెళ్ళిపోయింది.

అతను నిశ్చేష్టితంగా చూస్తూ వుండిపోయాడు.

ఓ ఘడియ గడిచాక సుందరమ్మగారువచ్చి "ఎవర్రా ఆ అమ్మాయి?" అనడిగింది.

అతను ఉలికిపడి "మాకు జూనియర్ అమ్మా. ఆ అమ్మాయినే రౌడీలు రాయిపెట్టి కొట్టింది" అన్నాడు.

"పాపం! ఈ అమ్మాయినేనా? అప్పుడే వెళ్ళిపోయిందేం?"

"కాలేజీకి టైమయిందట" అన్నాడు అతను తడుము కోకుండా. తనకు ఆడపిల్లలతో పరిచయమున్నట్లు తెలియటం, తనకోసం ఆమె యిక్కడికి రావటం - అతనికి ఆవిడ ముందు చాలా యిరకాటంగా వుంది.

ఆమె అక్కడ్నుంచి వెళ్ళిపోయాక యీ విపరీత పరిణామాన్ని గురించి తలపోస్తూ పడుకున్నాడు. రాజ్యలక్ష్మి తన హృదయంలో మంటరేపి పోయింది. ఆమె అట్లా అనటానికి కారణమేముయి వుంటుంది? తను ఆమెని మరిచి పోకపోతే ఏమవుతుంది? తను చేసిన పనిని గర్హించటం, హర్షించటం యీ రెండూ వొదిలేసి అర్థంకాని అయోమయస్థితిలో పడేసి పోయింది చిత్రమైన పిల్ల రాజ్యలక్ష్మి.

♦ ♦ ♦

మధుబాబుకు బాగా నిమ్మదించాక ఓ రోజు విశ్వనాథంగారు అడిగారు: "నాకు చెప్పనన్నా చెప్పకుండా నాటకంలో వేషం ఎందుకు వేశావురా?"

ఈ ప్రశ్న తండ్రి నోటినుంచి వినబడుతుందని అతనికి తెలుసు. ఆసమయం ఎప్పుడాసన్నమౌతుందోనని భయపడుతూనే వున్నాడు.

"తప్పనిసరి అయింది నాన్నగారూ!" అన్నాడు తల వంచుకుని వినయంగా.

"తప్పనిసరి అయితే అయింది. నా పర్మిషన్ ఎందుకు తీసుకోలేదు?"

అతను మెదలకుండా వూరుకున్నాడు.

విశ్వనాథంగారు ఓ ఘడియ తాళి ఉపక్రమించాడు: "చూడూ! ఈ నాటకాలంటేనాకు ఇష్టంలేదు. వాటిని నేను అసహ్యించుకుంటాను. అదో వ్యసనం. ఆ వ్యసనంలో పడిన వాడెవడూ బాగుపడడు. చదువు అంటదు. నువ్వు చదువుకోవాలి. పైకి రావాలి. నువ్వు బిజినెస్‌కి పనికిరావు. ఇవన్నీ జీవితంలో దమ్మిడీఎత్తుకూడా ఫలంలేని వ్యాపకాలు. నువ్వు కథలు రాసుకుంటూంటే వారించి ఊరుకున్నాను. నాటకంలో వెయ్యటం మాత్రం హర్షించలేను. తెలిసిందా?" మధుబాబులో వేదన చెలరేగింది.

## 10

పరీక్షలు సమీపిస్తున్నాయి. మధుబాబు శ్రద్ధగా చదవసాగాడు. అతి ప్రయత్నంమీద ఏకాగ్రత అలవర్చుకుంటున్నాడు.

రాజ్యలక్ష్మి అతణ్ణి కలవరపరుస్తోంది. చాలాసార్లు ఆమెను విపులంగా అడుగుదామని ప్రయత్నించాడు. కాని

ఆమె అవకాశం యివ్వటంలేదు. మామూలుగా, ఏమీ తెలియనట్లుగా మాట్లాడేది. భగీరథ ప్రయత్నంమీద అలా నటిస్తోంది అన్న సత్యం స్ఫురిస్తూనే వుండేది. నవ్వుతూ వుండడానికి వ్యర్థ ప్రయత్నం చేసేది. దిగులుగా, విరక్తిగా గోచరించేది రాజ్యలక్ష్మి.

ఒకసారి సాయంత్రం "మీతో విషయం చెప్పాలి మధుబాబూ!" అన్నది అణచుకోలేక.

"ఏమిటి రాజ్యలక్ష్మీ? ఏమిటి నీ మనోవేదన?"

"ఇప్పుడు కాదులే మధుబాబు! మీ పరీక్షలు కానివ్వండి. నా గురించి ఆలోచనలతో మనసు పాడుచేసుకోకండి. మీరు ఫస్ట్‌క్లాస్‌లో ప్యాస్ కావాలి. పరీక్షలు రాశాక చెబుతాను. అప్పటిదాకా నన్నేమీ ప్రశ్నించకండి. ప్లీజ్" అన్నది.

మధుబాబు ఆమెని విడిచిపెట్టి ఖేదంతో వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

పరీక్షలు ముగిశాయి. చివరి నెలరోజులూ చాలా శ్రమించి చదివాడు మధుబాబు. నిరంతరం తండ్రి అన్న మాటలే గుండెల్లో ధ్వనిస్తూ వుండేవి. ఓపికనుమించి, శక్తినంతా ధారపోసి చదివాడు.

చివరిపేపరు రాసివస్తోంటే గేటుదగ్గర రాజ్యలక్ష్మి పలకరించింది. "బాగా రాశారా?"

"అనుకుంటున్నాను"

"క్లాస్ వస్తుందా?"

"చెప్పలేను రాజ్యలక్ష్మి. మంచిమార్కులతో ప్యాస్ అవుతానని మాత్రం చెప్పగలను. ఇంకా ప్రాక్టికల్సు వున్నాయిగా"

ఆమె అటూయిటూ చూసి కంఠస్వరం చిన్నది చేసి "సాయంత్రం కృష్ణానదీ తీరానికి వస్తారా? పాత రేవు వైపు" అన్నది.

అతనామె కళ్ళలోకి చూస్తూ "తప్పకుండా వస్తా రాజ్యలక్ష్మి" అన్నాడు. ఆమె చిన్నగా నడిచి వెళ్ళిపోయింది.

సాయంత్రం అయిదయేసరికి బట్టలు వేసుకుని తయారై కృష్ణాతీరానికి వెళ్ళాడు. వేసవి ప్రారంభమైంది. సూర్య కిరణాలు అధిగమించిన వేడితో భూమిని తాకసాగాయి. కాని నదీతీరం కాబట్టి అక్కడ చల్లగా, హాయిగా ఉంది. ఆనకట్ట ప్రక్కనుంచి కార్లూ, బళ్ళూ పోవటం ప్రారంభమైంది. దూరంగా నదీ తరంగాలమీద తెరచాప ఎత్తిన రెండు పడవలు కదిలిపోతున్నాయి. బెస్తవాళ్ళు వలలు వేసి చేపలు పట్టుకుంటున్నారు. ఒడ్డున అక్కడక్కడా ఒకరూ యిద్దరూ తప్ప మనుషులు లేరు. ఒక చాకలి పడుచు మధుబాబు నిలుచున్న ప్రదేశానికి వొచ్చి బట్టలు ఉతకసాగింది. నీళ్ళు చింది అతని ముఖాన పడ్డాయి. ఆమె నాలిక కొరుక్కుని "దూరంగా తొలగండి బాబూ. దగ్గరుంటే నీళ్ళు చిందుతై" అని అతనికి కోపం రాకుండా వుండేందుకు చిన్నగా నవ్వింది. అతను దూరంగా జరుగుతూ తలతిప్పి చూశాడు.

ఇసుకలో రాజ్యలక్ష్మి నడిచి వస్తోంది.

మధుబాబు గుండె గబగబ కొట్టుకుంది. ఏమి చెబుతుంది రాజ్యలక్ష్మి? అట్లాగే చూస్తూ నిలబడ్డాడు.

చిన్నచిన్న అడుగులు వేసుకుంటూ చివరకు రాజ్యలక్ష్మి దగ్గరకు వచ్చి "ఎంత సేపయింది వచ్చి?" అన్నది కొంచం నవ్వుతూ.

"కొద్ది నిమిషాలు"

"రండి అలా కూర్చుందాం" అందామె అతనికి చేరువగావచ్చి. ఇద్దరూ కలిసి కొంతదూరం నడిచి—నీటికి దగ్గరగా యిసుకలో కూర్చున్నారు.

రాజ్యలక్ష్మి ముఖం అలసిపోయినట్లుగా, బలహీనంగా వున్నది. ముంగురులు చెదురుగా కళ్ళమీదకు పడుతున్నై.

"చెప్పు రాజ్యలక్ష్మి" అన్నాడు మధుబాబు తొందరగా.

వాళ్ళిద్దరూ ఒకరి కొకరు చాలా దగ్గరగా వున్నారు.

"నన్ను మరిచిపోండి" అన్నది ఆమె దీనంగా ముఖం పెట్టి.

మధుబాబు మనస్సు వికలమైంది. "ఎందుకని?" అన్నాడు విషాదంగా.

"మన ప్రేమకు పర్యవసానం వుండదు కాబట్టి"

"నువ్వు నన్ను ప్రేమించావా రాజ్యలక్ష్మి?" అనడిగాడు మధుబాబు హఠాత్తుగా.

ఆమె యీ ప్రశ్నకు అదిరిపడింది. కనుకొలుకుల్లోంచి

అతన్ని చూస్తూ "ఎందుకొచ్చింది మీకా సందేహం... యిప్పుడు" అంది చిన్నగా.

"ఏముందని... నాలో ఏముందనీ?" అని గొణిగాడు మధుబాబు అస్పష్టంగా.

"అది నాకు తెలియదు మధుబాబూ" అన్నదిరాజ్యలక్ష్మి కంపితస్వరంతో. "అలా చేసేశారు ఆరోజు పాపిష్టి దాన్ని. మిమ్మల్ని హింసించాను ఆ రాత్రంతా ఎంతఏడ్చాననుకున్నారు? మీ రూపమే, మీస్మృతే నన్ను ఆక్రమించుకుని వేధించ సాగింది ఆ క్షణమే తెలుసుకున్నాను— మిమ్మల్ని ప్రేమిస్తున్నానని కాని సమయం మించిపోయింది మధుబాబూ. బంధితురాల్ని నేను"

"అదెలా రాజ్యలక్ష్మీ?" అనడిగాడతను వ్యగ్రపాటుతో.

ఆమె తల వంచుకుని, సన్నని స్వరంతో "నేను చెప్పేది విని నన్నసహ్యించుకోకుండా వుంటారా?" అన్నది.

"నిన్నా? నేనా? అసహ్యించుకోవటమూ? ఏంప్రశ్న రాజ్యలక్ష్మీ?"

• సీతానగరం కొండలమాటున సూర్యుడు అస్తమిస్తున్నాడు "మీతో పరిచయం కావటానికి కొద్దిరోజులక్రితం జరిగింది మధుబాబూ" అని చెప్పసాగింది ఓ క్షణం ఆగి – "మాఅమ్మనాచిన్నప్పుడే చనిపోయిందని మీకు చెప్పానా? నాన్నగారు త్వరలోనే మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు. పిన్ని మంచిదే. నన్ను ఎంతప్రేమగానో పెంచింది. ఆమెతో

తిమ్మిరుండేవాడు. అప్పుడప్పుడూ మా యింటికొస్తూ వుండేవాడు. వొట్టి కబుర్లపోగు. నన్ను కవ్విస్తూ, నవ్విస్తూ వుండేవాడు. నేను వయస్సులో చాలా చిన్నదాన్నే. అనుభవం బొత్తిగాలేదు. అతనంటే ప్రేమ కాదుగాని_ఓ రకం ఆకర్షణగా, వ్యామోహంగా వుండేది. ఓ రోజు యింట్లో ఎవరూ లేని సమయంలో అతను తన మాటల్తో నన్ను ఏదో లోకానికి తీసుకువెళ్ళి హఠాత్తుగా నన్ను తన చేతుల్లోకి తీసుకున్నాడు. వారిద్దామనుకున్నాను. తిరస్కరిద్దామనుకున్నాను కాని ఎందుచేత అలా అయిపోయానో తెలీదు. వాంఛ అని చెప్పలేను. ఏమీ చేయలేక పోయాను. ప్రతిఘటించలేక పోయాను”

ఆమె కళ్ళనుంచి నీళ్ళు కారసాగాయి. “నన్ను అంధకారంలో ముంచివేసి వెళ్ళిపోయాడా రాత్రి. స్తబ్ధుగా పడివున్నాను మంచంమీద. ఇంత చిన్నదాన్ని ఎందుకిలా జీవితాన్ని సర్వనాశనం చేసుకుంటున్నాను? వలవలా ఏడ్చేశాను. అంతా శూన్యంగా వుంది చెప్పలేని బాధ... మరునాడు వచ్చాడు. అతడ్ని చూస్తే ఓ రాక్షసుడ్ని చూచినట్లుగా అనిపించింది అసహ్యం, భయం కలిగాయి ఇట్లాంటి వ్యక్తికి నే నెట్లా లొంగిపోయాను! నేను చేసిన పొరపాటు అనుక్షణం తలపుకు వొచ్చి నన్ను కాల్చసాగింది. అవకాశం చిక్కినప్పుడల్లా అతను నాదరి చేరటానికి ప్రయత్నిస్తూ వుండేవాడు. నేను తప్పించుకు తిరుగుతూ వుండేదాన్ని అతనంటే నాకేమీ లేదని తెలుసుకున్నాను. ఎట్లా భరించేది అతన్ని? ఓసారి యీ విషయం స్పష్టంగా చెప్పేశాను. కోపంవచ్చి

మా విషయం పిన్నికి చెప్పేశాడు. ఆమెవచ్చి నిజమేనా? అని అడిగింది. ఒప్పుకున్నాను. నన్ను నానాతిట్లూ తిట్టిఅతన్నే పెళ్ళిచేసుకొమ్మని శాసించి వెళ్ళిపోయింది. నాకు వేరేయింకెవరితోనూ పెళ్ళికాదు. అతనంటేరోజురోజుకూ అసహ్యం పెరిగిపోతోంది. ఎట్లా జీవించేది యీ సంఘర్షణతో. జీవితంమీద యిచ్ఛ నశించింది. ఇంక బ్రతికనెంతకాలం."

ఏడుస్తోంది రాజ్యలక్ష్మి. చేతుల్లో ముఖం కప్పుకుని విలపిస్తోంది. మధుబాబు హృదయం ద్రవించసాగింది లేత వయస్సులో, యీ పసిపాప వంటి అమ్మాయి-టెది?

చీకటి పడుతోంది.

"నేనంటే అసహ్యంగా లేదు యిప్పుడు?" అనడిగింది ఆమె ముఖానవున్న చేతులు తొలగించి, దగ్గుత్తికతో.

"లేదు లేదు రాజ్యలక్ష్మి" అంటూ అతనామె దగ్గరకు జరిగాడు.

"పాపిష్ఠిదాన్ని. పతితను. నన్ను తాకి మీ శరీరాన్ని మలినం చేసుకోకండి మధుబాబూ"

అతడామె చేతిని ఆప్యాయంగా తన చేతుల్లోకి తీసుకుని_"నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను రాజ్యలక్ష్మి. ఇది నిజం" అన్నాడు దృఢ నిశ్చయంతో.

ఆమె కంగారు పడుతూ "వద్దు వద్దు మధుబాబూ! పండువంటి మీ జీవితం యీ దౌర్భాగ్యురాలికోసం నాశనం చేసుకోకండి. అర్థంలేదు మీ త్యాగానికి" అన్నది.

"నన్ను సంశయిస్తున్నావా రాజ్యలక్ష్మి?"

"మీకు తెలీదు మధుబాబూ. మీ చరిత్ర కలుషిత మౌతుంది"

"ఎన్నటికీ కాదు."

కొంచెమాగి ఆమె "మా యింట్లో అంగీకరిస్తారనే ఆశలేదు రాక్షసుల క్రింద మారారు వాళ్ళు..."

మధుబాబు నిట్టూర్పు విడిచి "నా కోసం మీ వాళ్ళని ఎదిరించలేవా రాజ్యలక్ష్మీ?" అన్నాడు.

అతని చేతుల్లో ఆమె చెయ్యి వొణికింది. "మీ కోసం ఏనా చేస్తాను" అన్నది కాసేపు తాళి. కాని ఆమె కంఠస్వరం ఆమెనే వెక్కిరించినట్లు తోచింది.

చాలాసేపు యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. బాగా చీకటి పడింది. మధుబాబుకు మనసులో చాలా చెప్పాలని వుంది. ఇంత లేత వయస్సు...యిలా యిద్దరూ అనుకోకుండా దగ్గరకు చేరటం...యీ అనుభూతులు...తన ధైర్యం అతనికి అయోమయంగా ఉంది.

"ఇంక పోదాం మధుబాబూ!" రాజ్యలక్ష్మి గొంతు గాద్గదికంగా వినబడింది.

"పద!" అతను లేచాడు.

ఇద్దరూ ఒకరికొకరు అనుకుని నడవసాగారు

"రాజ్యలక్ష్మీ! ఈ పరిస్థితి ఏమీ నీకిష్టంగా లేదా?"

"లేదు లేదు. చాలా బాగుంది."

అతను నిట్టూర్పు అణచుకున్నాడు

◆ ◆ ◆

అటుతల్లీ, తండ్రీ...యిటు భవిష్యత్...ఏమో అర్థం

కాని ఆశయాలు ! ఏమిటిది అర్థంకాని పయనం? తెగునా యీ నిర్ణయం?

తనని ఆకర్షించింది రాజ్యలక్ష్మి. హృదయంలో స్థావరం ఏర్పరుచుకుంది. కాని దీనిని ప్రేమఅనే సాహసం లేదు తనకు. తను యింకా అంతటి అంగస్థుకు ఎదగలేదు. ఒకవేళ యిది వ్యామోహామే అయితే దీనికి అంతెక్కడ? తల్లీ—తండ్రీ వీళ్ళని ధిక్కరించట మెలాగ? ఓ కుర్రవాడు తను. లేతవయసు యువకుడు. కొంత అయోమయ ప్రకృతి.

అలిసిపోయాడు మధుబాబు ఆ రాత్రి ఆలోచనల్తో.

అతనికి భయం వెయ్యసాగింది.

* * *

కాని మధుబాబు తన ధైర్యసాహసాలు ప్రదర్శించే అవకాశం సంఘటిల్లకుండానే, అతను ఎటూ కొట్టుకుపోయే పరిస్థితి ఆసన్నం రాకుండానే, రాజ్యలక్ష్మి ఓమహా సాహసం చేసింది.

అది ఆత్మహత్య.

కాలేజీ ఆవతల నిండుగా ప్రవహించే కాలవప్పుండే—ఓసారి అక్కడి ప్రాంతంలో నిలబడి సగం విరిగిన కొండను తిలకించిందే—సరిగ్గా అక్కడే నిలబడి ఆ హతభాగ్యురాలు ప్రవహించే నీళ్ళలో దూకేసింది.

ఆ నీళ్ళలో కొట్టుకుపోయింది రాజ్యలక్ష్మి. ఆమె శవం ఎక్కడో తేలింది.

మధుబాబు ఓవెర్రికేక వేశాడు చాలాలనుకున్నారు. జుట్టు పీక్కున్నాడు. అంతే, ఆదో అధ్యాయం.

ప్రపంచం మామూలుగా సాగిపోతూనే వుంది సగం చచ్చిన మధుబాబుని తనతో తీసుకుపోతూ.

## 11

మధుబాబు రిజల్ట్సు తెలిశాయి. అతను ప్యాసయినాడు. కాని క్లాసు రాలేదు. విశ్వనాథంగారు కాస్త విసుక్కున్నాడు. అందులో సగం సతిమీదా, సగం తనయుడిమీదా ర్శించాడు. క్లాసు రాకపోతే ఎమ్. బి. బి. ఎస్‌లో సీటు ఎలా వస్తుందని ఆయన ఆరాటం. తాత్కాలికంగా యీ చదువుమీద ఉత్సాహంగా లేదు మధుబాబుకి. అందుచేత ఎక్కువ దిగులనిపించటంలేదు యాంత్రికంగా అన్ని మెడికల్ కాలేజీలకు అప్లికేషన్లు పంపించాడు. మణిపాల్‌లోనూ, బెంగుళూరులోనూ డొనేషన్ కాలేజి లున్నాయి. వాటికి రాస్తే మరో రెండుమూడు ఏళ్ళవరకూ సీట్లు రిజర్వ్ అయిపోయాయనీ, యిప్పుడు కట్టబడితే మరో రెండేళ్ళ తర్వాత సీటు లభించే అవకాశం వుందనీ జవాబు వచ్చింది. అంత కాలం ఆగటమా? మధుబాబుకు మనస్కరించలేదు. తాను సాధ్యమైనంత త్వరలో జీవితంలో ప్రవేశించాలి. తన కాళ్ళ మీద నిలబడగలగాలి. ఒకవేళ ఎమ్. బి. లో ఎక్కడా సీటు రాకపోతే ఏంచేసేటట్లు? తండ్రిలా బిజినెస్‌లో ప్రవేశించటమా? అతని కిష్టంలేదు బొత్తిగా. వ్యాపారంలో తను

అసలు ప్రవేశించలేడు. అటు రాజ్యలక్ష్మి స్మృతులు, యిటు యీ విద్యాసమస్య – అతని సాహిత్యవ్యాసంగం బొత్తిగా మూలబడింది. ఎక్కడకు వెళ్ళినా చుక్కెదురౌతూండేసరికి యింట్లో తండ్రి ధాంధూంలు హెచ్చసాగాయి. అతనికి యింట్లో వుండాలనిపించలేదు. ఎక్కడికైనా పోయి వంటరిగా గడపాలనిపిస్తోంది. కాని ఎలా సాధ్యం? మనశ్శాంతి నశించింది. చివరకు దేనిమీద తనకు యిచ్ఛవుందో తెల్సుకోలేని స్థితికి వచ్చాడు.

అతనికి క్లాసు రాకపోయినా మార్కులు కొంతవరకు బాగానే వచ్చాయి. అందుకని అనుకోకుండా విశాఖపట్నం కాలేజినుంచి యింటర్వ్యూకి పిలుపు వచ్చింది. తండ్రిముఖం యింతైంది. సీటు వచ్చినట్లుగానే పొంగిపోసాగాడు. ఇంటర్వ్యూలో ధైర్యంగా జవాబులు చెప్పమని కొడుకుని ప్రోత్సహించసాగాడు. తనుకూడా వస్తానన్నాడు. అక్కర్లేదని చెప్పి మధుబాబు వంటరిగా రైలెక్కాడు.

జీవితంలో మొదటిసారిగా టక్ చేసుకుని మధుబాబు ధైర్యంగా యింటర్వ్యూకి వెళ్ళాడు. వాళ్ళేదో ప్రశ్నలు వేశారు కలగాపులగంగా. తనకు తోచిన సమాధానాలు చెప్పేశాడు. "నీ హాబీస్ ఏమిటి?" అని ఒకాయన అడిగాడు. "కథారచన" అన్నాడు మధుబాబు గర్వంగా. "ఏవయినా అచ్చయినాయా?" అన్నాడు ఒకాయన ఎగతాళిగా. "ఎన్నో అచ్చయినాయి. రేడియోలో కూడా వచ్చాయి" "మరి లిటరేచర్ తీసుకోక మెడిసన్ ఎందుకు ట్రై చేస్తున్నావ్?"

"అది నా హాబీ అంతే. దానిమీద జీవించలేనని నాకు తెలుసు. అంతేగాక డాక్టరునై ప్రజాసేవ చెయ్యాలనివుంది"
ఇంటర్వ్యూ ముగిసింది. మధుబాబు ఆ సాయంత్రమే రైలు ఎక్కి యింటికి వచ్చేశాడు

రోజులు గడవసాగాయి. ఫలితంకోసం ఎదురు చూడసాగారు యింటిల్లపాదీ. అది ఒకవేళ రాకపోతే యీలోగా పుణ్యకాలం కాస్తా గడిచిపోతుందని గుంటూరు బి. ఎస్. సి లో చేరి మొదటి టరమ్ జీతం కట్టి వచ్చాడు.

కొన్నాళ్ళకు ఫలితాలు తెలిశాయి. మధుబాబుకు సీటు రాలేదు. కాని అతనిపేరు వెయిటింగ్ లిస్టులో వుంది. తండ్రీ కొడుకు లిద్దరూ నిస్పృహ చెందారు. అయినా ఓ ఆశ మిణుకు మిణుకు మంటోంది – రాకపోతుందా అని.
"గుంటూరు కాలేజీకి పోయి వస్తూండరా? అక్కడకూడా అటెండెన్స్ పోవటం దేనికి?" అన్నాడు తండ్రి. ఉసూరు మంటూ మధుబాబు ప్రొద్దున్నే రైలెక్కి గుంటూరెళ్ళి సాయంత్రం కాగానే తిరిగి రాసాగాడు. రోజులు నిస్సారంగా దుఃఖభాజకంగా, యాంత్రబద్ధంగా గడుస్తున్నాయి. అతనికి విసుగ్గా వుంది.

అయితే వున్నట్లుండి విశాఖపట్నంలో సీటు వచ్చిందన్న వార్త తెలిసింది.

# 12

మెడికల్ కాలేజీజీవితం చాలా కొత్తగా కనిపించింది. ఆర్ట్స్ కాలేజిలో లాగా యిక్కడ విచ్చలవిడిగా వుండరు విద్యార్థులు. ప్రతివాడికీ ఓ వ్యక్తిత్వం, ఓ అహంభావం, ఏదో ప్రకర్ష. కళాత్మకమైన అనుభూతి ఏమీ వుండదు. అసలు విద్యార్థికి తీరిక అంటూ లేదు. ఉదయంనుంచీ సాయంత్రం వరకూ ఆ శవాల మధ్య, మైక్రోస్కోపుల ముందు, లేదా ప్రొఫెసర్ల చేత చివాట్లు తింటూ యంత్రాలా పనిచేసుకుపోవాలి. గదికి వచ్చాక మరునాటికి తరగని పని. రాత్రి పన్నెండూ, ఒంటిగంటా అయేవరకూ చదువుతోనే సరిపోయేది. ఇహ విశ్రాంతి. కొంతమందికి ఆటల ప్రమేయం వుండేది. మధుబాబు సాహిత్య పిపాసని గురించి ఎవరూ పట్టించుకునే అవకాశం లేకపోయింది. ఓ రకంగా యించుమించు అతనే మరిచిపోయాడు. కాలేజి వాతావరణంలో పడి అదంటే ఆసక్తికూడా సన్నగిల్లింది. ఇదివరకు నిరంతరం ఏదో ఓ యితివృత్తాన్ని గురించో, పాత్రను గురించో మనసులో మెదుల్తూండేవి. ఇప్పుడు ఏదో అస్పష్టంగా ఎప్పటికైనా రాయాలి అన్న ఆరాటమేగాని, నిర్దుష్టమైన వొత్తిడి ఏమీ లేదు లోపలినుంచి. పైగా మూడు నెలల్లోనే కెమిస్ట్రీ పరీక్షలు. అతను హడావుడిగా చదవసాగాడు రాజ్యలక్ష్మిని జానను మరిచిపోలేదు. కాని గుర్తుపెట్టుకుని చేసేదేముంది —

నిద్ర పాడు చేసుకుని కన్నీళ్ళు విడవటం తప్పు ?

* * *

క్రమంగా మెడికల్ కాలేజి వాతావరణానికి అలవాటు పడిపోయాడు. జీవితంలో యిదివరకెన్నడూ యింత కష్టపడి చదవలేదు. తన ఓపికకి తనకే ఆశ్చర్యంగా వుండేది.

కెమిస్ట్రి లెక్చరర్ పేరు శ్యామలరావుగారు. ఆయన యింకా యువకుడు. సాహిత్యంలో చాలా అభిలాష వుంది. ఎవరో మధుబాబుని గురించి ఆయన చెవిలో ఊదారు. ఇతని కథలు ఆయన కొన్ని చదివి వున్నాడు 'అరె! యింతచిన్న వాడా యితను?' అని విస్మయం చెంది ఓసారి ప్రాక్టికల్ హాలులో పలకరించి "ఓసారి మాయింటికి రండి" అని ఆహ్వా నించాడు మధుబాబును. మరునాటి సాయంత్రం మధుబాబు ఆయనకోసం వెళ్ళాడు. ఆయన కూర్చోబెట్టి, కాఫీయిచ్చి చీకటి పడేవరకూ ఏవో వివిధ విషయాలను గురించి మాట్లా డుతూ కూర్చున్నాడు. లిటరేచర్‌లో ఆయనకంత అభినివేశం వుందని మధుబాబుకి పూర్వం తెలియదు. ఈవాతావరణంలో యిలాంటి తోడు దొరికినందుకు అతనికి చాలా సంతోషంగా వుంది. ఇద్దరూ ఎంతో సన్నిహితులైపోయారు. అప్పటినుంచీ అవకాశం వున్నప్పుడల్లా కలుసుకుంటూ వుండేవాళ్ళు మధు బాబు సబ్‌జెక్ట్‌ని గురించి తనకువున్న అనుమానాలు, ఆయన్ని అడిగి తీర్చుకుంటూవుండేవాడు.

ఎలెక్షన్ల విషయంలో యిక్కడకూడా ఆ వాతావర ణమే వుండటం గ్రహించాడు మధుబాబు. వాటిల్లో పాల్గొన టానికి అతనికి మనస్కరించలేదు. కాని అతను రచయిత

అని తెలిసి బలవంతంగా మేగజైన్ సెక్రటరీగా అతన్ని నిల్చో బెట్టారు. తీరాచూస్తే అతనికి పోటీ లేకుండా పోయింది. అతను ఏక గ్రీవంగా ఎన్నిక అయినాడు.

*　　　*　　　*

కెమిస్ట్రీ పరీక్షలు జరిగాయి. మధుబాబు ఓరల్స్ కూడా బాగానే ఆన్సర్స్ చేసి యింటికి బయల్దేరాడు. ఎగ్జామినర్స్ అందరూ రైల్లో పోతూండగా కాలక్షేపానికి శ్యామలరావు మిగతావాళ్ళకు ఓ కథచెప్పి "యిది రాసింది మా స్టూడెంటే పేరు మధుబాబు" అని చెప్పాడు. చిత్రం ఏమిటంటే ఎగ్జామినర్స్‌లో ఒకరికి మధుబాబు అభిమాన రచయిత. "అయ్యో, ముందుగా చెప్పకపోయారే! అతనెవరో తెలీకుండానేఅతనికి ఓరల్స్ తీసుకున్నానా? అతను పరీక్ష ప్యాసయ్యాడో లేదోనండీ? నెంబరెంత? నెంబరెంత?" అని ఆదుర్దా పడసాగాడు. శ్యామలరావుగారికి కూడా అతని నెంబరు గుర్తు రాలేదు. "జ్ఞాపకం లేదండీ" అన్నాడు విచారంగా.

కాని మధుబాబు పరీక్ష ప్యాసయాడు.

# 13

వేసవి సెలవులు. చాలా రోజులకు మధుబాబుకు సావకాశంగా ఆలోచించుకునేందుకు వ్యవధి దొరికింది. ఇంటికి వచ్చిన సాయంత్రం అట్లా నడుచుకుంటూ కృష్ణానదీ తీరానికి వెళ్ళాడు. కృష్ణాబ్రిడ్జిమీద, ఉపరితలాన మనుషులు నడవటానికి దారి వుంది. దానిమీద ఎక్కి, నడుస్తూ నది మధ్యనువచ్చి క్రింద ప్రవహిస్తోన్న నదీతరంగాలని తిలకించ సాగాడు. గతస్మృతులన్నీ తలపుకు రాసాగినై. రాజ్యలక్ష్మి తనను అన్యాయం చేసి యీ లోకంనుంచి నిష్క్రమించింది. తనకు యీ భూమ్మీద తల్లీ, తండ్రి, అక్క, చెల్లెలూ, తమ్ముళ్ళూ వీళ్ళంతా వున్నారు. అయినా ఒంటరితనం పీడిస్తోంది. తను ఒక్కడూ ఒకటి, ప్రపంచమంతా ఒకటి అనిపిస్తోంది. ఏమిటో యీ చదువు, యీ అభివృద్ధి, ప్రాకులాట... ఎందుకోసం యిదంతా?

ఆ రాత్రి బరువుగా గడిచింది

మరునాడు ఉమాపతి కలిశాడు. ఎంతో హాయి అనిపించింది మధుబాబుకు. ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతున్నాడు. తాను కొత్తగా రాసిన కథ ఒకటి చదివి వినిపించాడు ఉమాపతి. కథలో "మెరుపు" కనిపించలేదు మధుబాబుకు. వాస్తవికానికి దగ్గరగా వున్నమాట యదార్థమే. కావలిసినంత నిజాయితీ కూడా వుంది. కాని యీ రెండూ

పుష్కలంగా వున్నంత మాత్రాన చేత ఉత్తమ రచన అవుతుందా? కథకులుగా పేరొందిన ప్రముఖులు యిదే ధోరణిలో రాయటం చూశాడు మధుబాబు. వాస్తవికత పేరుతో యింత పేలవంగా ఎందుకు రచనలు తయారు చేస్తున్నారో బోధపడేది కాదు అతనికి. సాహిత్యానికి ప్రధానమైన అనుభూతి లోపిస్తుంది వాటిల్లో. సమగ్రత, నిండుతనం లేదు వాటిల్లో. ఉమాపతి కూడా ఆ కోవ కున్నాడు.

ఎట్లా వుందని అడిగాడు.

మధుబాబు మొహమాటస్థుడు "బాగుంది" క్లుప్తంగా. అది బాగున్నమాట వాస్తవమే. కాని బాగుండేందుకు అనేక అభ్యంతరాలున్నాయి.

"మీరేం రాయటంలేదా?" అని అడిగాడు ఉమాపతి.

"లేదండి, తీరిక వుండటంలేదు. బొత్తిగా మెడికల్ స్టడీస్‌లో పడిపోయాను. అదో ఊబి. ఆలోచించేందుకు తగిన కాలం, వ్యక్తిత్వం కోలుపోయే వాతావరణం."

చాలాసేపు ఏవో మాట్లాడుకున్నారు. గుమాస్తా ఉద్యోగం చేస్తూ, ఆమన స్తత్వాన్ని పూర్తిగా జీర్ణించుకున్న ఉమాపతి — ఆ పరిసరాలల్లోంచే సమస్యలని తీసుకుంటున్నాడు. ఆర్థిక శాస్త్రం చదివి, అందులో లోతుపాతులు అర్థం చేసుకోవాలని ఉబలాటపడుతున్నాడు.

మళ్ళీ రాయాలన్న జిజ్ఞాస రేకెత్తింది మధుబాబులో. ఆరాత్రి పడుకున్నప్పుడు తీవ్రంగా ఆలోచించాడు. కాని ఏ

గమ్యం చేరలేదు. చిక్కగా నిద్రపోయాడు.

మరునాడు సాయంత్రం ఏభూ తోచక ఓ తెలుగు సినిమాకు వెళ్ళాడు మధుబాబు. ఆ సినిమాలో హీరోయిన్ ం వేసిన ఆమెను చూడగానే షాక్ తిన్నట్లయింది. అత ాగా సన్నిహితమైన వ్యక్తి ఎవ. ఎవరా, ఎవరాఅని ను చేసుకున్నాడు. బయటకు వచ్చి వాల్ పోస్టర్ మీద ు చూశాడు. పరిచితమైనది కాదే. మళ్ళీ లోపలకు ాస్తున్నాడు...ఓహ్! రజని. అవును-ఆమె రజని. క్కా బడినుంచి వస్తూంటే చిన్నప్పుడు పిలిచి ్లూ, కాఫీయిచ్చి ఆప్యాయత ప్రదర్శించిన అందగత్తె. ాడనుంచి వెళ్ళిపోయినాక ఆమెఉనికిఏమీ తెలియలేదు. క్రమంగా ఆమె గురించి కూడా మరిచిపోయాడు. ఇప్పుడు సినిమాలో చేరిందన్న మాట. ఈరెండుమూడు సంవత్సరాలు ఎక్కడవుందో ! ఎట్లాగడిపిందో !! అతనికి హృదయం ఆర్ద్రి మైంది. ముగ్ధుడై చూడసాగాడు. అప్పటికన్న అందంగా, పొంకంగా వుంది ఎంత బాగా నటిస్తోందో! ఆమెని చూడా లనీ, కలుసుకోవాలనీ అతని కావేశం కలిగింది.

ఆ రాత్రి యింటికివొచ్చి ఆమెని గురించే ఆలోచిస్తూ పడుకున్నాడు. జీవితం నిజంగా చిత్రమైనదే. ఒక్కొక్క వ్యక్తి పురోగమనంలో ఎన్ని మలుపులు !

ఏటన్నిటి మధ్యా ఏదో రాయాలన్న ఉరటం దానికో స్వరూపం యివ్వలేనీ అస్పష్టత అతన్న వేధించ సాగాయి.

ఒకప్పుడు ఎంత తేలిగ్గా; సునాయాసంగా రాసే

వాడు. ఆలోచేన కూడా శ్రమ అనిపించేది కాదు. కొంత పేరు వస్తోన్న తరుణంలో యించుమించు రాయటం మానుకున్నాడు. తనని రచయితగా క్రమేపీ అంతా మరిచిపోతారేమో! అతనికి భయం వేసింది.

మరునాడు ప్రొద్దున్న యింటికి వచ్చిన వారపత్రిక తిరగేస్తాంటే – అందులో ఓ ప్రకటన కనబడింది. నవలల పోటీయట. ఉత్సాహంగా వివరాలన్నీ చదివాడు. అతనికి ఉద్రేకం కలిగింది. రాయాలి! రాయాలి.

సామాజిక యితివృత్తం తీసుకోవాలిట.

అనుకోకుండా ఆ మధ్యాహ్నం అతను రాయటం మొదలుపెట్టాడు. అంతా ఊహాగానమే ఓ మధ్యతరగతి కుటుంబాన్ని తీసుకున్నాడు తండ్రీ, తల్లీ, కొడుకులూ, కూతుళ్లూ... వాళ్ళ ప్రత్యేక స్వభావాలు......

అతని కలం సాగిపోతోంది.

ఓ పదిరోజుల్లో సగం నవల తయారయింది మొదట గజిబిజిగా, ఏమిటోగావున్న భావాలకు యిప్పుడో ఆకృతి ఏర్పడింది. పాత్రలను విశిష్టంగా మలచగలుగుతున్నాడు. లోపలకు ప్రవేశం దొరికినకొద్దీ, పరిధిని విశాలం చేసుకుంటూ, స్వేచ్ఛగా–తడుములాట లేకుండా రాసుకుపోసాగాడు. తనకు తెలియని సంగతులు కూడా అందులోకి దొర్లుకు రాసాగాయి.

ఓ రోజు ఉదయం మధుబాబుని వెతుక్కుంటూ ఓ పెద్దమనిషి వాళ్ళయింటికి వొచ్చాడు. ఆయన్ని అంతవరకూ

ఎప్పుడూ చూడలేదు. అందుచేత తెల్లబోయి, ఆయన్ని కూర్చోబెట్టి ప్రశ్నార్థకంగా చూశాడు.

ఆయన తనకితానుపరిచయం చేసుకున్నాడు. ఈమధ్య హైదరాబాద్‌నుంచి ప్రచురితమౌతోన్న కొత్త వారపత్రిక సంపాదకులలో ఒకడు. పనిమీద యీఊరువచ్చి మధుబాబు యిక్కడ వున్నాడని తెలుసుకుని చూడ్డానికి వచ్చాడుట. ఆ పత్రిక గురించి మధుబాబుకు తెలుసు, కొత్తగా స్థాపితమైనా వృద్ధిలోకి వస్తోంది. ఫీచర్స్ బాగుంటున్నాయి.

"మంచి సీరియల్ ఏమయినా ప్రారంభించాలని వుందండీ. త్వరగా కూడా మొదలెట్టాలి. కాని మంచి నవల వున్నట్లుండి ఎలా పుట్టుకు వస్తుంది? మీరు నవలలేమయినా రాసారా ?" అనడిగాడు సంపాదకుడు.

అసలు పత్రిక తాలూకు సంపాదకుడు తనని గురించి తెలుసుకుని రావటమే గొప్పగా వుంది మధుబాబుకు. ఈ ప్రశ్న మరీ ఉత్సాహం రేకెత్తించింది.

"ఒకటి రాస్తున్నానండీ. ఇంకా పేరు పెట్టలేదు. సగం వరకూ పూర్తయింది" అన్నాడు.

"ఏదీ...పట్రండి చూద్దాం" అన్నాడాయనఆత్రుతగా.

ఎందుచేతో మధుబాబు రచనలంటే ఆయనకి గురి వున్నట్లుంది. అతను తెచ్చిన పుస్తకం విప్పి చూస్తూండగానే ముఖం వికసించింది. "ఇది మేము ప్రచురిస్తామండీ" అన్నాడు పదినిమిషాలు పరిశీలించాక తలఎత్తి

మధుబాబు దిగ్భ్రాంతుడై "ఇంకా పూర్తికాలేదండీ" అన్నాడు.

"ఫర్వాలేదు. మీరు పూర్తిచేస్తూండండి. ఈలోగా మేము ఎడ్వర్టైజ్ చేస్తూ వుంటాం. రేపటిలోగా నవల టైటిల్ కూడా ఆలోచించి వుంచండి."

మధుబాబు సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయినా అతని మనసింకా: ఆ ప్రముఖ వారపత్రిక నడిపిస్తూన్న పోటీ మీద కొంచం వుంది.

"అసలు యిది నేను పోటీకని మొదలు పెట్టానండీ" అన్నాడు కొంచం జంకుతూ.

కాని సంపాదకుడు మాంఛి ఉత్సాహంమీదవున్నాడు "అబ్బే, మీరింకా అలా అనకండి. ఇది మేమే ప్రచురించాలి. పోటీలో యిచ్చే బహుమతి కన్న ఎక్కువే యిస్తాం సరేనా ?" అన్నాడు బలవంతంచేస్తూ.

మధుబాబు తల ఊపాడు.

తాను మరునాడు మళ్లీ వస్తాననీ, యీస్క్రిప్టు తీసుకు వెళ్ళి యివాళంతా చదువుతాననీ, మరునాటికి నవల పేరు ఆలోచించి వుంచమనీ చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

మధుబాబుకి క్రమంగా ఉద్రేకం చల్లారి సంకోచం పట్టుకుంది. ఒకవేళ ఆ సంపాదకుడు తొందరపాటుతో తన మీద అంత నమ్మకం వుంచాడేమో. తాను తూగుతాడో? తూగడో ?

సాయంత్రం యీసంగతి ఉమాపతికి చెప్పాడు.

ఉమాపతి వ్యవహారందగ్గర నిక్కచ్చిగావుండేమనిషి.

"డబ్బు ఎంతయిస్తాడో ఖచ్చితంగా తేల్చుకున్నారా అది ముఖ్యం. మొహమాట పడబోకండి" అన్నాడు.

మధుబాబుకు యీ సలహా నచ్చలేదు. మనిషికి మనిషికీ మధ్య మృదుపూర్వకమైన సంబంధ బాంధవ్యాలు వుండాలిగాని వ్యవహారపక్షంగా వుండకూడదని అతని ఉద్దేశం. మౌనంగా ఊరుకున్నాడు.

మరుసటివారం ఆ హైదరాబాద్ వీక్లీలో రాబోతున్న మధుబాబు నవలనిగురించి పెద్దఎత్తుప ప్రకటన పడింది తెలుగు సారస్వతంలో విశిష్ట స్థానాన్ని పొందగల నవలఅని భరోసా యిస్తున్నారు సంపాదకులు.

అతనికి సిగ్గువేసింది. తనని వీళ్ళు ఎక్కడికో ఈడ్చుకుపోతున్నారు. అసలు యీ నవల్లో తాను అనుకుని చేసిన గట్టి ప్రయత్నమేమీ లేదు. అంత గొప్పతనం ఏమీంలేదని కూడా నమ్మకం. ఈ విషయం వెల్లడి అయాక పత్రికాధిపతులూ, పాఠకులూ కూడా తనని తిట్టుకుంటారు.

అతనికి భయం వెయ్యసాగింది.

అతని కలం యిప్పుడు వొణుకుతోంది. అట్లాగే మరి పదిహేను రోజులు శ్రద్ధగా కూర్చుని నవల పూర్తి అయిందనిపించి పోస్ట్‌చేసేసి "హమ్మయ్యా" అని నిట్టూర్చాడు.

కొద్దిరోజుల్లో అసలు సంపాదకుడి దగ్గర్నించి అతనికో లేఖ వచ్చింది సీరియల్ మరో రెండుమూడు వారాల్లో ఆరంభించ నున్నారట. తమకి ఎంతో నచ్చిందిట అభినందిస్తూ, ఉజ్వలమైన భవిష్యత్ కాంక్షిస్తూ రాశాడు.

"అంతా పిచ్చివాళ్లే" అనుకున్నాడు మధుబాబు నిట్టూర్చి.

# 14

సెలవులు గడిచి—మళ్ళీ విశాఖపట్నం వొచ్చేశాడు. మళ్ళీ యీ శాసనాలు, నిబంధనలూ, నిర్బంధ జీవితం.

కాని వారంవారం అతనికి గొప్ప ఊరట కలుగు తోంది — సీరియల్ గా వస్తోన్న నవలని చదువుకుంటూవుండ టంవల్ల. మొదటివారం అతని ఫొటోతో బాటూ అతన్ని గురించి పొగుడ్తూ కొంత రాశారు. అలాంటి రచయిత తెలుగులో వున్నందుకు గర్వించాలి అని అల్టిమేటమ్. అతను లజ్జితుడైనాడు.

మొదటివారం ప్రచురితమైన రెండు అధ్యాయాలూ చదువుతోగానే అతనికి చప్పగా వున్నట్లనిపించింది. తాను అనుకున్న వాతావరణం బలీయమైన సృష్టి కనబడ లేదు. నిరాశ, విరక్తి కలిగాయి. కాని ఒకరోజు ఆగి మళ్ళీ చదువు తోగానే బాగున్నట్లే అనిపించింది. కొత్త సొబగులు గోచ రించసాగాయి.

ఇది మొదటి ప్రయత్నం. ఎట్లావుందో ఎవరినైనా అడుగుదామని మహా ఉబలాటపడ్డాడు. కాని నోరువిడిచి ఎవరినడిగినా ఏమయినా అనుకుని పోతారేమో. బాగా లేదంటే? ఊరుకున్నాడు.

కాని ఒక్క మెడికల్ కాలేజి విద్యార్థులేకాదు, యూని వర్సిటీలో మిగతా విద్యార్థులుకూడా ఆసీరియల్ ని ఆసక్తితో చదవసాగారు. మధుబాబు అక్కడి స్టూడెంటేనని అందరికీ

తెలిసిపోయింది అతని ఫొటో కూడా ప్రచురించబట్టి-యితనే అని తేలిగ్గా గుర్తుపట్టసాగారు కూడా.

నాలుగైదు వారాలు గడిచేసరికి అతని నవల బాగా ప్రచారంలోకి వచ్చింది. ఆ పత్రిక అమ్మకం కూడా విపరీతంగా పెరిగింది. అతని నవల పండితులూ, పామరులూ అంతా చదవసాగారు. కొంతమంది విద్యార్థులు ప్రత్యక్షంగా వచ్చి అభినందించ సాగారు.

ఈ లోగా విజయవాడనుంచి ఓ పబ్లిషర్ అతనికథలు ఓ సంపుటంగా వేస్తానని ఉత్తరం రాశాడు. అతని కథల కటింగ్స్ అన్నీ పదిలంగా అతని దగ్గరే వున్నాయి. వాటిని పంపించేసి యీ విషయం ఉమాపతికి తెలియ బరిచాడు. ఉమాపతి జవాబురాస్తూ టరమ్స్ ఖచ్చితంగా మాట్లాడుకొమ్మని సలహా యిచ్చాడు.

మొదట యిన్ని వారాలు ప్రచురిత మౌతుందని అనుకో లేదు మధుబాబు తన నవల గురించి. మూడు నెలలు గడిచేసరికి దాదాపు సగం పూర్తయింది. అతనికి ఆశ్చర్యమనిపించింది. ఇంతపెద్దనవల, యిన్ని సమస్యలతో, యిన్ని పాత్రలతో, అంత స్వల్ప వ్యవధిలో తాను ఎట్లా వ్రాయగలిగాడు? అతనికి నమ్మబుద్ధి కావటం లేదు.

♦ ♦ ♦

మొత్తం ఆరు నెలలు గడిచేసరికి అతని నవలప్రచురణ పూర్తయింది. ఏదో పోగొట్టుకున్నట్లు దిగులు కలిగింది అతనికి. వెల్తిగా వుంది.

ఈ వెల్తిని తీరుస్తూ అతనికి లేఖలు శర పరంపరలుగా రాసాగినై. అతనికి విచిత్రంగా వుంది. తెలుగు దేశంలో రచయితలకు యిలా ఉత్తరాలు రాసే వాళ్ళున్నారని అతనిప్పుడు ప్రత్యక్షంగా తెలుసుకుంటున్నాడు. తన నవల అంతగా కదిపిందా ప్రజలని? తనలో ఏముంది? తన కసలు ఏం తెలుసునని ?

అతనికి రాసిన వాళ్ళలో విద్యార్ధులూ, విద్యార్ధినులూ డాక్టర్లూ, ప్లీడర్లూ, వివిధ మనస్తత్వం గలవాళ్లూ అందరూ వున్నారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క కోణంలో రాసేవారు. ఇవన్నీ యువతల వుంచి మూడు నాలుగు ఉత్తరాలు అతన్ని కదిపివేశాయి.

"...నాజీవితం గురించే రాశారనుకుంటున్నాను అనూరాధ పాత్ర నాదే. నాదే. ఎంత పరిశీలన మీది ? చదువుకున్నంతసేపూ ఏడుస్తూనే వున్నాను—అభాగిని" అని ఒక ఉత్తరం.

"అటా యిటా అన్న సందిగ్ధంలో సతమతమౌతూన్న నాకు మీనవల చక్కని పర్యవసానం చూపించింది అన్నయ్యా, అవును. మీరు నాకు అన్నయ్యే? లేకపోతే యింత మంచి సలహా ఎందుకు యిస్తారు ?—అపరిచిత."

ఇట్లా వున్నాయి ఉత్తరాలు

తను యింట్లో కూర్చుని రాసినవి ఒక్కొక్కరిజీవితానికి యింత సన్నిహితంగా సంభవిస్తున్నవా? ఇది తన అదృష్టమా? ఏమిటో వైపరీత్యం?"

అతని కన్నులలో నీళ్ళు నిలిచాయి.

# 15

అతని కథల సంపుటి అచ్చయి వచ్చింది. పబ్లిషర్ పైకానికి బదులు వంద కాపీలు పంపించాడు. మధుబాబుకు ఎగ్రిమెంటు లాంటిది ఏమీ లేకపోవటంవల్ల మాట్లాడటానికి అవకాశం లేకపోయింది. అయినా మొదటిసారిగా పుస్తకం వెలువడ్డ మోజులో వుండబట్టి అంత పట్టించుకోనూ లేదు. తన ముఖ్య స్నేహితులందరికీ పుస్తకాలు పోస్టులో పంపించేశాడు. ఇంకా మెడికల్ కాలేజిలోని స్నేహితులందరికీ పంచి పెట్టేశాడు. కొన్ని పుస్తకాలు గదిలోవుంటే పరిచయస్థులు వచ్చినప్పుడు చూసి పట్టుకుపోయారు. మొత్తంమీద కాస్సిని రోజుల్లో అన్నీ పూర్తయినాయి

పత్రికల్లో సమీక్షలు మెచ్చుకుంటూనే వొచ్చాయి. కాని లోకంలో ఓ రకం మనుషులుంటారు. అందరూ అవునన్నదాన్ని కాదనటం వాళ్ళకో సరదా. లేకపోతే మరి ప్రత్యేకత ఏమిటి? అలాగే ఓవిమర్శక మహాశయుడున్నాడు. ఆయన సాహిత్యంలో వివిధ శాఖలూ తాకిచూసి, ఎందులోనూ ఉచ్ఛస్థితికి రాలేక, చివరకు విమర్శలు రాయటం ప్రారంభించాడు. అదృష్టం బాగుండి విమర్శకుడిగా పేరు వచ్చింది. ఇంకేం ? మానవుడికి నిరంకుశత్వం హెచ్చింది. అయినదాన్ని గురించీ కానిదాన్ని గురించీ చిత్తంవొచ్చినట్లు రాయటం మొదలు పెట్టాడు. ఎవ్వరికీ కనిపించని ఆకర్షణ

ఆయనకు కనబడుతుంది. అందరూ అభినందించిన దాంట్లో ఆయనకన్నీ తప్పుల కుప్పలూ. మధుబాబు కథల సంపుటిని గురించి ఓ పత్రికలో రాస్తూ "యిందులో మెచ్చుకోవలసిన సమాచారం ఏమీ లేదు. బొత్తిగా అనుభవ శూన్యంగా వున్నాయి" అని రాశాడు. మధుబాబుకు వళ్ళు మండింది. కాని ఏమి చేస్తాడు? దిగమ్రింగి ఊరుకున్నాడు.

అతనికి చిన్నవయస్సులో పేరుప్రఖ్యాతులు వస్తూండటం, చక్కగా రాయగలగటం, అతని తప్పుకాదు. కాని వయస్సులో చిన్నకావటం 'అనుభవం లేదు' అని విమర్శించటానికి అదను దొరికింది అసూయా పరులకు.

ప్రజలంతా వేనోళ్ళ బాగుందని కొనియాడిన అతని నవలని గురించి రాస్తూ "అస్పష్టంగా వుంది. మసక మసగ్గా వుంది. మొత్తంమీద ఓ మాదిరిగా వుంది" అంటాడా విమర్శకుడు.

అతని ఆగడం అంతటితో సమిసిపోలేదు. అతనికర్మం కాలి అదే రోజుల్లో రేడియోలో "నేటి తెలుగు సాహిత్య రీతులు" అని ఓ ప్రసంగం వచ్చింది. ఆ ప్రసంగం చదివినాయన వయసులోనూ, అనుభవంలోనూ, విజ్ఞానంలోనూ చాలా పెద్దవాడు. ఆయన మధుబాబు కథలనీ, నవలని ఉదహరిస్తూ – యీ యువకుడు సరికొత్త పోకడలతో కలాన్ని కదిలిస్తున్నాడని మెచ్చుకున్నాడు. దాన్ని గురించి ఓవ్యాసం రాసిపారేస్తూ విమర్శకుడు "ఫలానా ఆయన్ని గురించి ప్రసంగంలో ఉదహరించలేదు. ఫలానా యీయన్ని గురించి

ఉదహరించలేదు. వాళ్ళు ఎంత గొప్పవాళ్ళు? కాని మొన్న వొచ్చిన మధుబాబుని గురించిమాత్రం అనవసరంగా పేర్కొన్నారు” అని వెళ్ళబోసుకున్నాడు.

ఇదీ ఆ విమర్శకుడి వ్యాసాల విలువ

♦ ♦ ♦

యూనివర్సిటీ పరీక్షలు దెయ్యంలా సమీపిస్తోంది. అసలే మెడికల్ కాలేజీ విద్యార్థులు మిగతా వ్యాపకాలన్నీ పెట్టుకోకుండా ఎద్దులా పనిచేస్తారు. ఈ పరీక్షల సమయంలో వాళ్ళు పడేశ్రమ, చెందే కంగారూ హృదయ విదారకంగా వుంటుంది. అటు ప్రొఫెసర్లు గుక్క తిప్పుకోనియ్యకుండా పని చేయిస్తూ, కావలసినన్ని అక్షింతలు వేస్తూ వుంటారు ఇటు గదులకివచ్చి ఒకడిని చూసి ఒకడు పోటీపడి, అసూయపడి చదివేస్తూ వుంటారు. ఓమాదిరి స్వతంత్ర భావాలున్నవాడు యీ వాతావరణం భరించటం కష్టం. “ఇందులోకి ఎందుకు వచ్చానురా భగవంతుడా?” అని మధుబాబు విచారించిన క్షణాలు లేకపోలేదు. అతనేమిటి? ఇలా ప్రతి మెడికల్ స్టూడెంటూ ఎప్పుడో ఒకప్పుడు అనుకుంటూనే వుంటాడు.

ఈసారి ఏకాగ్రత కుదరటం కష్టంగా వుంది. కథల సంపుటి వెలువడటం, నవల, ఆ ప్రచారం, పేరు,ఉత్తరాలు అనుభూతి మనసుని చక్కిలిగింతలు పెట్టగా తరుచు వాటిని గురించిన తియ్యని తలపులే రాసాగినై. ఒకవైపునుంచి పరీక్షల భయం అధికమై పోతోంది. ఎట్లాగైనా ప్యాసయితీరాలన్న పట్టుదల హెచ్చసాగింది. ప్రక్క విద్యార్థుల్ని

చూస్తూంటే ఎక్కడలేని ఉద్రేకం వస్తోంది. రాత్రింబవళ్లు బల్లముందునుంచీ లేవకుండా చదివేయ సాగాడు. అసలే మనిషి దుర్బలుడు. ఈ మానసికాందోళన, శ్రమ అతన్ని మరింత బలహీనుణ్ని చేయసాగినై. ఆరోగ్యం పాడు కాసాగింది. వేళకు భోజనం వుండేదికాదు. అసలు ఏమన్నా తిందామన్నా సహించేది కాదు. కాఫీలు తెగ త్రాగుతూండేవాడు. రాత్రిళ్ళు నిద్ర వస్తోంటే—ఆరికట్టటానికి టాబ్లెట్స్ తెచ్చి వేసుకునేవాడు. ముఖంలో కాంతి హారించి పోసాగింది. కర్తవ్య పాలనలో మనసు మట్టుకు ఉజ్వలంగా ప్రకాశిస్తూ వుండేది.

చివరకు పరీక్ష రోజు వచ్చింది. ఆవేళ ఎనాటమీ పేపర్. అంతకు ముందు రెండురోజులు కన్నుమూయకుండా చదివాడు. ఆ రోజుకూడా చేతిలో పుస్తకం పెట్టుకునిగదిలో అటూయిటూ తిరుగుతూ తెల్లవార్లూ చదువుతూనే వున్నాడు. ఏడుగంటలకల్లా కాఫీత్రాగి, స్నానంచేసి కాలేజికి వెళ్ళాడు.

పేపర్లుయిచ్చారు. గబగబ కొట్టుకుంటూన్న గుండెతో మధుబాబు అందుకున్నాడు. అతని కళ్ళు ఆనందంతో మిల మిల మెరిశాయి అన్నీ తెలిసిన ప్రశ్నలే. అతను తలవొంచుకుని రాయటానికి ఉపక్రమించాడు.

అయిదు నిమిషాలు గడిచాయి.

ఎందుకో చేతులు వొణుకుతున్నాయి తన అక్షరాలు తనకే కనబడటంలేదు. అతని కర్థంకాలేదు. అయోమయంగా వుంది. ఓ నిమిషం వూరుకుని నిర్లక్ష్యంగా వుండటానికిమళ్లీ

ప్రయత్నించాడు. కాని వాణుకు యింకా ఎక్కువవుతోంది. కడుపులో, గుండెల్లో ఏదో మంట. కళ్ళు చీకట్లు క్రమ్ము తున్నాయి తల్లో ఏమిటో గిర్రున తిరుగుతున్నట్లుగా వుంది. కళ్ళు మూసుకుని "ఏమిటిది భగవాన్?" అనుకున్నాడు. ఇలా ఎప్పుడూ లేదు. ఎన్నడూ లేదు కళ్ళు తెరిచాడు. లాభంలేదు. బలవంతంగా మూసుకుపోతున్నాయి వాచర్‌ని పిలిచి తనస్థితి చెబుదామనుకున్నాడు శక్తినంతా కూడదీసు కుని లేచి నిల్చోబోయాడు. అంతే. స్మృతితప్పి క్రింద పడి పోయాడు.

తెలివి వచ్చేసరికి తన గదిలో వున్నాడు. ప్రక్కన కాలేజిలో పనిచేసే డాక్టరు ఒకరూ, యిద్దరు ఎకిండర్లూ వున్నారు.

"నాకేం జరిగింది?" అన్నాడు మధుబాబునీరసంగా.

"ఏమీ లేదు. అంత ఎక్కువగా ఎందుకు చదవాలి? ఎగ్జామినేషన్ హాల్లో ఫెయింట్ అయి పడిపోయావు" అన్నాడు డాక్టర్.

"ఆఁ! నా ఎక్జామినేషన్. ఇప్పుడు వెళ్ళి రాస్తాను"

డాక్టర్ "ఇంకేమిటి? ఓ అరగంటలో టైము అయి పోతుంది. బాగా రెస్టుతీసుకో. జరిగిపోయిందానికి విచారిం చకు. అయిపోయిందేదో అయిపోయింది. ఎట్లా వుంటుంది వాంట్లో?" అన్నాడు.

మధుబాబు హతాశుడై "నెలలతరబడి పడిన శ్రమ అంతా బూడిదపాలై పోయింది" అని గొణుక్కున్నాడు. అత నికి ఏడుపు వచ్చింది.

"ఎట్లా వుంది?"

"చాలా బాగుంది... చాలా బాగుంది"

ఎటెండర్‌తో కాఫీ తెప్పించుకుని తాగమనీ, సాయంత్రం వస్తానని చెప్పి డాక్టర్ వెళ్ళిపోయాడు. మధుబాబు మంచానికి అంటుకుని వుండిపోయాడు. ఎంతశ్రమ ! ఎంత శ్రమ !! అతని గుండె పగిలిపోతోంది

కొంతసేపటికి పరీక్ష వ్రాయటం ముగించిన మిగతా విద్యార్థులు వొచ్చి అతన్ని ఓదార్చ సాగారు. అతనెవరికీ సమాధానం చెప్పలేదు. మౌనంగా ఊరుకున్నాడు ఆలోచిస్తూ

కాని యీ సంఘటన అంతటితో సమసిపోలేదు. సాయంత్రానికల్లా అతనికి జ్వరం వచ్చింది. మరునాటికీకూడా తగ్గకపోయేసరికి హాస్పటల్‌లో జాయిన్ చేశారు. మిగతా విద్యార్థులు వాళ్ళయింటికి రాస్తానంటే మధుబాబు వద్దని వారించాడు. హాస్పటల్‌కి వచ్చి పదిరోజులయింది. కాంప రేచర్ తగ్గటంలేదు. రోజూ నూరూ, నూటొకటీ అలా వుంటూనేవుంది. చివరకు డాక్టర్లకు అనుమానంవొచ్చి ఎక్సరే తీయించి "టి బి "అన్నారు.

మధుబాబుకు గుండె లవిసిపోయాయి.

"తక్షణం యింటికి వెళ్ళిపోవాలి. ఏడాది దాకా చదువు డిస్‌కంటిన్యూ చేసి ఆరోగ్యాన్ని పొందాలి" — యిది డాక్టర్లిచ్చిన తీర్పు

ఇంటికి ఉత్తరం రాయలేదు ఆ రాత్రి సామానంతా తీసుకుని మిత్రుల సహాయంతో రైలు ఎక్కాడు. ట్రెయిన్

మెల్లిగా కదిలి, వేగంగా విజయవాడ వైపు పరిగెత్తి సాగింది.

పైన బెర్త్ మీద పడుకుని మధుబాబు శూన్యంలోకి చూస్తూ ఆలోచించసాగాడు. 'టి. బి.' ఇతరులకి వచ్చినప్పుడు 'అయ్యో' అని నిట్టూర్చే 'టి బి.' తనకథల్లో పాత్రలకు వచ్చిన 'టి. బి.'

అతని కళ్ళనుండి నీళ్లు కారసాగాయి.



## 16

సుందరమ్మగారు కొయ్యబారిపోయినారు. విశ్వనాథ రావుగారి గుండెలో ముల్లు విరిగినట్లయింది.

సామానుతో సహా యింటిముందు బండి దిగిన కొడుకుని చూసి — ఆయన పరీక్షలయి పోయినై కాబట్టి వచ్చాడని భావించాడు మొదట కాని లోపలకు ప్రవేశించినకుమారుడి చిక్కిశల్యమైన అవతారం చూడగానే కంపితుడై "యిదేమిటి?" అని గొణిగాడు.

"నాకు 'టి. బి.' నాన్నగారూ!"

* * *

విశ్వనాథరావుగారు ఊళ్ళోని టి బి. స్పెషలిస్ట్‌ను తీసుకొచ్చి మధుబాబుని పరీక్ష చేయించాడు. శానిటోరియమ్‌కి

పోవాలని వుంది మధుబాబుకు. డాక్టర్ అట్లా సలహాయిస్తే బాగుండునని ఆశించసాగాడు. కాని ఆయన "యింకా ప్రిలిమినరీ స్టేజెస్‌లోనే వుంది. అనవసరంగా యింజక్షన్లూ అవీ యివ్వటం యిష్టంలేదు. ఆరునెలలు కంప్లీట్‌గా బెడ్‌రెస్ట్ యివ్వండి. మంచి ప్రోటీన్ ఫుడ్ యివ్వండి. టానిక్స్ రాసి యిస్తాను"అని మధుబాబు భుజంతట్టి "ఏమీ బెంగపడకోయి. అసలు దీన్ని గురించి ఆలోచించకు. జీవితాన్ని గురించి ఆప్టిమిస్టిక్‌గా తీసుకో. అన్నట్టు నీకేమైనా హాబీస్ వున్నాయా?"

"కథలూ అవీ రాస్తూ వుంటాడండీ" అన్నాడు విశ్వనాథరావుగారు.

"భేష్! ఇంకేం? సాహిత్యప్రియుడివన్నమాట మనసుని ఎక్కువ అలసట చెందనియ్యకుండా సీక్రెట్ వచ్చిన పుస్తకాలు చదువుకో పరిమితంగా రాసుకో. చికాకు కలిగించే ఏ విషయాన్ని గురించీ ఆలోచించక. స్టడీస్ ఓ ఏడాది పోతే పోనీయ్. దాన్ని గురించి దిగులుపడకు. ఆరునెలల్లో ఎట్లా తయారౌతావో చూడు."

ఆయన వెళ్ళిపోయాడు కొడుకు దిగులు పడుతున్నాడని తండ్రి సాంత్వన వచనాలు పలకసాగాడు మధుబాబుకు యింతకాలం యింట్లో యీ దారుణ జీవితం గడపటం ఎట్లాగా అన్న చింత ఎక్కువయింది. ఏ మదనపల్లో పోయి శానిటోరియమ్‌లో జాయిన్ అయితే అక్కడి ప్రశాంతత, వాతావరణం ఎంత ఆహ్లాదకరంగా వుంటుంది! కాని...యిది జరగదు.అతను నిట్టూర్చాడు.

ప్రపంచంలో బాగా మేపు వలసిన వాడెవడయ్యా అంటే టి. బి. పేషెంటు.

ఉదయం, నిద్ర లేచినప్పటినుంచీ కార్యక్రమమంతా తిండి గురించే.

రెండు కోడిగ్రుడ్లూ, పావు శేరు పాలతో కార్యక్రమం ఆరంభమౌతుంది. తరువాత మంచంమీద పడుకోవటం. పద కొండు గంటలకు భోజనం. వంటకాలలో ఏమాత్రం కారం వుండకూడదు. అన్నం తడిసి ముద్దయేటట్లు నెయ్యి గుమ్మ రించుకోవాలి. మళ్ళీ మధ్యాహ్నం రెండు గంటలకల్లా గ్లాసుడు పళ్ళరసం. నాలుగింటికల్లా పావు శేరు పాలూ, దాంతో బాటు బలమైన ఆహారం, ఏడుగంటలకు భోజనం, పడుకోబోయే ముందు పాలు.

ఇవిగాక యింకా టానిక్కులు. అవీ వేలయినప్పుడల్లా తీసుకుంటూ వుండటమే పని.

మధుబాబు విసిగిపోతున్నాడు. తిండికోసం బ్రతుకు తున్నట్టుగా వుంది. విశాఖపట్నంలో చేరాక కాఫీ ఒకటి బాగా అలవాటయిపోయింది. అది లేకపోతే యిప్పుడు ప్రాణ సంకటంగా వుంది. తండ్రి చూడకుండా తల్లిని బ్రతిమాలి రోజుకి ఒకటి రెండుసార్లు కాఫీతాగేస్తూ వుండేవాడు.

జబ్బయితే అనుకున్నంత భయంకరంగా లేదు. కాని రోజులు గడవడం దుస్సహంగా వుంది. తలఅంతా వివిధ ఆలో చనలతో గజిబిజిగా వుండేది. కాబట్టి ఏమయినా పుస్తకాలు చదువుదామన్నా బుద్ధిపుట్టేదికాదు. వ్రాయడానికి అసలు మనసు పోయేదికాదు. సాయంత్రాలు తరుచు ఉమాపతి

వస్తూండేవాడు. ఇంకా ఒకరిద్దరు స్నేహితులు వస్తూండేవాళ్లు. సాధారణంగా రేడియో పెట్టుకుని సినిమాపాటలు వింటూ వుండేవాడు. లేకపోతే పిల్లలతో కలిసి కేరంబోర్డు ఆడుతూండేవాడు. ఎవరితో ఎక్కువ మాట్లాడేవాడు కాదు. విశ్వనాథ రావుగారికి కొడుకు దీనస్థితిచూస్తే బాధగా వుండేది. కథలు రాసుకో కూడదట్రా. ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటే మనసు పాడౌతుంది. హాయిగా రాసుకో— అనేవాడు. రాత్రుళ్ళు ఓ గంటసేపు ఆయనా, సుందరమ్మగారు, మధుబాబూ కలిసి పేకాట ఆడేవాళ్లు. మధుబాబు స్నేహితుడి ఒకడి దగ్గర బుల్ బుల్ తరంగ్ ఒకటివుంది. వీలయితే అది వాయించటం నేర్చుకోవాలని చాలా కాలంనుంచీ అతడికోరిక. కాని అది కొనిపెట్టమని అడగడానికి తండ్రి ఏమంటాడోనని అణచుకునేవాడు. ఇప్పుడు తండ్రి ఏమీ అనే స్థితిలో లేడాయె. అందుకని స్నేహితుడితో అది తెప్పించుకుని టింగ్ టింగ్‌మని తిప్పలు పడుతూండేవాడు.

ఇంత చేస్తున్నా జీవితం నిస్సారంగావుండేది. మధుబాబు ఏదో మంచిపని దగా చేసినట్లు నిరంతరం తపన పడుతూండేవాడు. ఎంత చేసినా యీ నాలుగుగోడలు దాటి బయటకు పోయే వీలులేదు. ఓ రకం చెరసాల. ఏ అర్ధరాత్రిప్పుడో మెలకువ వచ్చేది ఉలికి పడేవాడు. మళ్ళీ నిద్రపట్టేదికాదు. ఎన్నో ఆలోచన్లు!!

ఈ భూమిమీద బాధించే వాళ్ళెవరంటే—బంధువులు. మెడికల్‌కోర్సు చదువుతున్న కుర్రాడు ఇట్లా ఇంట్లో నెలల తరబడి కూర్చునేసరికి ముఖ్యబంధువులలోనూ యిరుగుపొరుగు వాళ్లలోనూ సంచలనం కలిగింది. ఇంటికి ఎవరైనా వస్తూంటే నే—

తనగురించి ప్రశ్నిస్తారేమోనని భయంగా వుండేది మధు బాబుకు. సరిగ్గా అలాగే జరిగేది. మధువచ్చాట్టకదే సుందరం అంటూ ఎక్కడినుంచో ఎవరో ఊడిపడటం; కాసేపు ఆ కబురూ యీకబురూ చెప్పి "కాలేజికి సెలవులేమిటి?" అని ఆరాదియ్యటం - యిదీ వరస.

"వాడికి ఒంట్లో కులాసాగా వుండడంలేదు" అని సుందరమ్మగారు బదులు పలికేసరికి—

"ఏం జబ్బా? ఏం కథా కమామిషూ? డాక్టరికి చూపించారా? ఏమన్నాడు? అపాయమేమీ లేదుగదా" యిలా ప్రశ్నల పరంపరలు. అవతలకుపోయి గుడగుడ లాడు కోవడం.

రంపపుకోతగా వుండేది మధుబాబుకు.

ఇలాంటి మాయదారి రోగాలు దాపరించినప్పుడు— దాని బాధకన్నా యీ ప్రజలబాధ ఎక్కువ

ప్రపంచమంటే అసహ్యం కలుగుతోంది అతనికి.

♦ ♦ ♦

అతనికథలు అచ్చేసిన పబ్లిషర్ ఓ రోజువచ్చి నవల కూడా వేసుకుంటానని అడిగాడు. ఈసారి డబ్బు అడగాలని పించింది మధుబాబుకు. ముఖం ఎదుట అడగలేక—అప్పటికి సరేలని తర్వాత పనివాడిచేతికి ఉత్తరంయిచ్చి పంపించాడు.

ఆ పబ్లిషర్ రెండొందలు యిస్తానని కబురు చేశాడు. ఇది అన్యాయం. ఆ పుస్తకం ధరప్రకారం అందరికీ యిచ్చే ప్రకారం కనీసం అయిదారు వందలు రావాలి. మధుబాబు ఆ సాయంత్రం ఉమాపతి వచ్చినప్పుడు సలహాఅడిగాడు. "అయి

దు వందలకు తమ్మిడితక్కువైనా ఒప్పుకోబోకండి" అన్నాడు ఉమాపతి. మొహం ఎదుటఅయితే నోరువిప్పడుగాని ఉత్తరాల్లో తన ప్రతాపం ప్రదర్శిస్తాడు మధుబాబు. అట్లాగే రాసి పంపించాడు పబ్లిషర్ మరో యాభయిదాకా చేసి బేరం పెట్టాడు మధుబాబు అంగీకరించలేదు. చివరకు వ్యవహారం విఫలమైపోయింది.

డబ్బుకోసం ఆశపడి అవకాశం పాడుచేసుకున్నానేమో అనుకున్నాడు మధుబాబు. కాని అతను భయపడనక్కర లేకపోయింది. మరునాటి సాయంత్రానికల్లా మరో పబ్లిషర్ తయారైనాడు. మొదట అతనికి వ్యాపారంలో ప్రతిద్వంది. మనిషి డాంబికంగా, సభ్యతగలవాడుగా కనిపిస్తాడు. మాట మృదువుగా వుంటుంది. పాతికలదగ్గరా, యాభయిలదగ్గయిరా పెంకేతనం చెయ్యడు "అంత యిస్తాను, ఇంతయిస్తాను' అని ముందుగానే చవులూరిస్తాడు. మధుబాబు ఉబ్బితబ్బిబ్బైపోయి నవల కటింగ్స్ తెచ్చి ఆయన చేతిలో పెట్టాడు.

"ఎగ్రిమెంరాసుకోకపోయినారా?" అని అడిగాడు ఉమాపతి.

"అబ్బే! ఆయన చాలా పెద్దమనిషి అంత నిక్కచ్చిగా వుండటం బాగుండదు. రేపు ఫస్టుకల్లా యడ్వాన్సుగా సగం యిస్తానన్నాడు" అన్నాడు మధుబాబు.

ఉమాపతి మౌనంగా ఊరుకున్నాడు.

♦ ♦ ♦

మెల్లిగా రోజులు గడుస్తున్నాయి. మధుబాబు ఆరోగ్యం కుదుటబడుతోంది. మనిషి కొంచెం వళ్ళు చేస్తున్నాడు. బయటకు పోకుండా, పడకపట్టున వుండడంవల్ల శరీరానికివింత కాంతి రాసాగింది ముఖం గుండ్రంగా, పొంకంగా తయారవుతోంది అద్దంలో చూచుకొంటూంటే అతనికి విచిత్రంగా ఉత్సాహంగా వుండేది.

హైదరాబాద్ వీక్లీ వాళ్ళు మరో నవలేమైనావుంటే పంపమని కోరుతూ రాశారు కొన్నాళ్ళకు.

అతనికి మహా ఉద్రేకం. తనురాయాలి! రాయాలి !! ఎందుకిలా కాలం వృథా చేస్తున్నాడు? ఆరాత్రి చాలాసేపటి వరకూ దాన్ని గురించే ఆలోచిస్తూ పడుకున్నాడు. అయితే మునపటికీ యిప్పటికీ ఓ తేడా తెలిసివచ్చింది. ఇంతవరకూ తనకు తెలియని ఏ సంగతి గురించయినా తడబాటులేకుండా స్పష్టంగా యోచించి ఓ రూపకల్పన చేస్తూండేవాడు. ఇప్పుడెంత బుర్రబద్దలుకొట్టుకున్నా తన పరిసరాలూ, తనూ, తన మాన స్వప్నాలు యివ్వే మనోపథంలో మెదుల్తున్నాయి గానీ — కొత్తయితివృత్తం గిరగిర స్ఫురించటంలేదు. తను కొత్తబాట తొక్కనున్నాడా? కొత్త అధ్యాయంలో ప్రవేశిస్తున్నాడా?

మొత్తంమీద స్థూలంగా ఓ ప్లాట్ తయారుచేసుకున్నాడు కొందరుముఖ్య పాత్రల్ని వాటి విచిత్ర మనస్తత్వాలని మనసులో సృష్టించుకున్నాడు. ఇప్పుడు మనసు కొత్తరకంగా భావన చేస్తోంది. అనుకున్నట్టే ఏమిటో సంఘర్షణ! మనిషిమీద మనిషిమిశ్రభావం. స్వార్థం — త్యాగం పుణ్యం — పాపం వీటికేశాల విలువలు, పాపానికి పరిధి ఎంత?

సత్యానికి సరిహద్దులేమిటి, అదృష్టానికి ఆనకట్ట ఎక్కడ – ఓ మహా సంకులసమరం చెలరేగుతోంది అతని మస్తిష్కంలో. ఇహ ఆ పాత్రల్ని తలచుకుంటూ, యీ సంఘర్షణను పరుచుకుంటూ పోవాలి. జీవితంలో పిరికివాళ్ళున్నా, అసమర్థులున్నా ఓ ఆసక్తి-సానుభూతి పెరిగింది. విభిన్న దృక్పథాలు గల వేరువేరు వ్యక్తుల్ని తీసుకుని, వారిచుట్టూ పరిస్థితులూ, వాతావరణం కల్పిస్తూ ముందుకు పోసాగాడు.

## 17

ఆ నవల అచ్చువేస్తానని తీసుకు వెళ్ళాడేగాని – ఎన్నిసార్లు కబురుచేసినా ఆ పబ్లిషర్ ఉలకడు పలుకడు గట్టిగా ఉత్తరం రాసి పంపించేసరికి – "యిదిగో యీ నెలలో ప్రారంభిస్తున్నా" అంటాడు. ఎందుకని త్వరగా మొదలుపెట్టడో అర్థంకాదు మధుబాబుకు. అతన్లో అసహనం ఎక్కువ కాసాగింది. ఇంతలో సాహితీసమితి పదేళ్ళుగా వచ్చిన నవలలన్నిట్లోనూ ఉత్తమ నవలను బహూకరించటానికి నిర్ణయించేసి ప్రకటించింది. దానికి పుస్తకరూపంలోవున్న నవలలే పరిశీలించబడతాయి. దీంతో మధుబాబుకు మరీ ఆతృత హెచ్చింది. తను బయలుదేరి పోవటానికి వీల్లేదు. పబ్లిషర్ రావటం మానేశాడు. గట్టిగా ఓ జాబు రాసి పంపించాడు.

"ఈనెలాఖరులోగా తప్పకుండా పుస్తకం పూర్తిచేస్తున్నాం" అని హామీయిస్తూ జవాబు పంపించాడు.

హైదరాబాద్ వీక్లీలో అతని రెండోనవల ప్రచురణ ప్రారంభమయింది. అయితే మొదటిదాని శైలికీ, దీని శైలికీ కొత్తిగా సంబంధం లేదు. ఇది చదివి ఎవరూ పొల్చుకోవచ్చు. "అయ్యో పాపం" అని నిట్టూర్పులు విడవకపోవచ్చు. కాని అడుగడుక్కీ రచయితప్ప ఆవేదన. అతన్లోని సంఘర్షణ, మానసిక పరిణామం, అతడ్ని గంద్రగోళ పరుస్తోన్న సమస్యలు కనిపించి తీరుతాయి మొదటి నవల స్కూలు విద్యార్థుల దగ్గరనుంచీ కూడా ఆకర్షించి తేలిగ్గా హృదయాలలో నాటుకుంది. అది ప్రతివాడికీ సన్నిహితంగా వున్నసమస్య నిత్యజీవిత సంఘటనలకు స్పష్టమైన చిత్రణం. ఇది మామూలు పాఠకుడి గుండెల్లో సూటిగా గ్రుచ్చుకోకపోవచ్చు అతీతమైన మన స్తత్వాలకు సంబంధించినది. గండిపడ్డ జీవితాల విషాద చరిత్ర. కదిలినవారు విపరీతంగా కదిలిపోయారు. అట్లా మధుబాబు అజ్ఞాతంగావున్న కొందరివ్యక్తులకు మరీ సన్నిహితుడై పోయాడు. అతనికి చిత్రవిచిత్రమైన ఉత్తరాలు రానాగినై. వాటిల్లో కొన్ని తల్లిచూసింది. ఇలా ఆడపిల్లల దగ్గరనుంచి కొడుక్కి ఉత్తరాలు రావటం ఆవిడను కంగారు పెట్టింది. కాని మధుబాబు శీలాన్ని గురించి, నడవడికను గురించి ఆవిడకు దృఢమైన నమ్మకం, గురీ వున్నాయి అందుకని బయటకు యీసంగతి ఏమీ ప్రస్తావించలేదు

ఈ మధ్య మధుబాబు స్త్రీనిగురించి ఎక్కువగా ఆలోచించటం మొదలు పెట్టాడు. అతనికి వచ్చే ఉత్తరాలు కొన్ని అందుకు ముఖ్యకారణాలైనాయి. కొందరు తమ విషాదగాథల్ని, విచిత్ర చరిత్రల్నీ అతనికి వాటిల్లో విపులంగా చెప్పుకున్నారు. తర్వాత తమ బంధువుల్లోని కొందరు ఆడవాళ్ళ దారుణ స్థితిగతులు అతనికి తెలుసు. రచనావ్యాసంగం ఆరంభమైనప్పట్నుంచీ అతను ప్రతి మనిషి స్వభావాన్ని పరిశీలనాదృష్టితో చూడటం ప్రారంభించాడు. స్త్రీలకు జరిగే అన్యాయాలని గురించీ, పురుషుల వికృతి చర్యలని గురించీ అతను యిదివరకే రాశాడు. కాని యిప్పుడు ప్రత్యేకం ఆ పరిశీలనలోనే తృష్ణ ఎక్కువయింది. దాంతో సాంఘికధర్మాలని గురించి ఆలోచించటం మొదలు పెట్టాడు. వివాహ బంధం, స్త్రీమీద పురుషుడి అధికారం; ప్రేమ, కూతురిగా, తల్లిగా, భార్యగా, స్త్రీబాధ్యత; కుటుంబాల్లో అరాజకం, అశాంతి; భార్యాభర్తల మధ్య విముఖత్వం, హింసాకాండ, లేచిపోవటం, వెళ్ళగొట్టటం, ఆత్మహత్యలు అతన్ని కలవరిపరిచినై. ప్రపంచం యింత అస్తవ్యస్తంగా, అపశృతులతో, ఆర్భాటాలతో ఎట్లా యింతవరకూ నడిచిందో అతనికి అర్థం కాలేదు. చేయని తప్పుకు భార్యని చావగొట్టిన వాణ్ణి చూశాడు; లేని నిజాన్ని సృష్టించటంకోసం కూతుర్ని చిత్రవధ చేసినవాణ్ణి చూశాడు; భర్త తనని చావగొట్టి చెవులు మూసినా అతన్ని మనస్ఫూర్తిగా ఆరాధించటం చూసి విస్తుపోయాడు. రోజూ చిత్రహింస పెడుతున్నా పెనిమిటికి ప్రాణంమీదకు వస్తే "నా మంగళసూత్రం కాపాడ

మని" భగవంతుడ్ని ప్రార్థించే అతివని చూసి కలవరపడ్డాడు. ఎట్లా యీ వ్యవస్థ చక్కబడటం? ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ–యీ భేదాలు కలకాలం నశించవా? సమానత్వం వల్ల నష్టముందా? సంభవమా అది?

ఈ మానసిక గందరగోళంలో అతను మళ్ళీ శరత్, చలం చదివాడు. ఒకే విషయాన్ని గురించి వివిధ కోణాలలో ఎందుకు చెప్పారు? శరత్ పాత్రలను కరుణామయంగా చిత్రించాడు. చలం సంఘంపట్ల తనకున్న కసినికూడా జోడించివిడిచి పెట్టాడు. శరత్ తన హృదయాంతర్గత వేదననిపాత్రల అసమర్థత ద్వారా వెలిబుచ్చాడు. చలం పాత్రలను తనే డామినేట్ చేసి విశ్వవిహారం చేశాడు. జరిగేది రాశాడు శరత్. ఇలా జరిగితే బాగుంటుందనుకున్నది రాశాడు చలం శరత్ తాను తీసుకున్న సమస్యకు అనుగుణ్యంగా సరిపోయేవాతావరణం, బలమైన యితివృత్తం తీసుకున్నాడు; చలం యితివృత్తంకోసం, వాతావరణంకోసం పేచీపడక సూటిగా చెప్పటమే పనిగా పెట్టుకోవటంవల్ల అవి వ్యాసాలుగా, విమర్శలుగా కనిపిస్తాయి. శరత్ తానే గాకుండా అతని పాత్రలు కూడా నిలిచేట్లుగా చేశాడు. చలం తాను మాత్రమే నిలిచే రచనలు చేశాడు. శరత్ సాహిత్యం పాఠకుల్ని కన్విన్స్ చేసి తనవైపు లాక్కుంటుంది. చలం సాహిత్యం పాఠకుల్ని భయపెడుతుంది, గందరగోళ పరుస్తుంది. ఆ గందరగోళం ఎటువైపు యీడ్చుకు పోతోందో వలిం తేల్చి చెప్పలేం.

ఎంత ఉత్తమ ప్రయోజనాన్ని ఆశించి రచన చేసినా ప్రజల్ని భయపెట్టే సాహిత్యం సృష్టించటం మంచిదికాదనే నిర్ణయానికి వచ్చాడు మధుబాబు. కాగాపోగా యిన్ని అసుపులు అరిచి, అతివాదాలు చేపి, యీ మొగాళ్ళందర్నీ కత్తితో పొడిచిపారేయాలన్న ఉద్దేశం ప్రదర్శించి వీళ్ళంతా శరత్ శేషప్రశ్న, చరిత్రహీనులకు తూగే నవల రాశారా అని ప్రశ్న వేసుకునేసరికి 'లేదు' అని జవాబు చెప్పుకోవాల్సి వచ్చింది మధుబాబుకు. అక్షయబాబు వంటి పరమ ఛాందసుడ్ని కూడా తన వాదన ప్రభావంతో జయించి సానుభూతి సంపాదిస్తుంది కమల. అట్లాంటి పాత్రలు ఏవి యీసృష్టిలో? అదీగాక సెక్సు వాదం అసలు విషయాన్ని మరుగు పరిచి అనర్థంలోని పరిణామాలకు దారితీసిందని విశ్వసించాడు మధుబాబు. జీవితంలో సెక్సుకు ప్రముఖస్థానం వుంటే వుండవచ్చుగాని — సెక్సునే జీవితంగా చిత్రించటం—అది యితర సమస్యలను మ్రింగి వేసినట్లు చిత్రించటం అతనికి నచ్చలేదు. వాస్తవికతకు అసాధారాలేమో యివన్నీ! అదీగాక యీ కొత్త సాహిత్యంలోని మనుషులు తాము ఏది అసహ్యించుకుని కొత్త జీవితాన్ని వెదుక్కుంటూ పోతున్నారో, తిరిగి అక్కడ అలాంటి అసహ్యాన్నే ఆదరించటం చికాకు కలిపించింది. భర్త నస్యంపీలిస్తే భరించలేని వ్యక్తి, అందుకుగానూ అతన్ని చీదరించుకున్న వ్యక్తి, ప్రియుడు తాగవచ్చినా, తనకు సమ్మతం కాని మాంసం భుజించినా, బండబూతులు తిట్టినా, తన్నినా అదో ప్రేమక్రింద అభిమానిస్తోంది. ఏమిటి యీ

నిజాయితీ? ప్రేమించినవాడి కోసం భర్తనూ, సంసారాన్నీ, సమస్తాన్నీ త్యజించి వెళ్ళటం త్యాగమే అయితే యీ భూమ్మీద త్యాగం అని మనం దేనిని సమర్థించలేం? నిజమైన త్యాగానికి నిర్వచనం ఏమిటి?

అతనికి అంతు పట్టటం లేదు.

ఈ హఠాత్తు పరిణామాలవల్ల, నిర్ణయాలవల్ల సుఖభ్రాంతేగాని సుఖం లేదన్న నమ్మకం అతనికి కలగసాగింది. టాల్‌స్టాయ్ అనా కరినినాలో ఆమె భర్తని విడిచిపెట్టి వెళ్లాక ఎదుర్కున్న ఒడుదుడుకుల్ని, దారుణ మానసిక నరకాన్ని చిత్రించటానికి వందలకొద్దీ పేజీలు రాయాల్సి వచ్చింది. ఇట్లా కొత్తబాటలు వెదుక్కుంటూన్న కొద్దీ అడుగడుక్కీ అశాంతి, బీభత్సమే కాని నిజమైన మనుగడ ఎక్కడ? ఇంకో విషయం జీవితాదర్శం సుఖాన్వేషణే అయితే - అదిఅంతా, ఫలితం లేని అనుభవాల సంపుటేగాని, చివరిదశలో విరాగిని చేసే ఓ సాధనమేగాని "యిదేసుఖం" అని స్థిరంగా జీవించే మహత్తర సత్యం మాత్రం కాదు.

ఎవరు ఎన్ని వివాదాలు చేసినా మనిషి స్వార్థరహితుడిగా, ద్వేషానికీ, అసూయకూ అతీతుడుగాఎప్పుడూ వుండటం లేదు. స్వార్థం లేకుండా వుండాలనటం ఓ స్వార్థం క్రింద పరిణమిస్తోంది. అసూయకి అతీతంగా వుండాలంటే పిరికివాడని పిలవాల్సి వస్తోంది.

అన్యాయం జరుగుతూన్నమాట వాస్తవమే. కాని వివాహం, బంధం, యిదంతా మిథ్య అనటం న్యాయాన్ని స్థాపిస్తాయా?

అతని తల బ్రద్దలై పోయింది. ఇన్ని ప్రశ్నలతో అటు పూర్వాచారాల సాంఘిక నిబంధనల నిరంకుశత్వం ఎంత క్షోభ కలిగిస్తోందో, యిటు యీ సమస్యల విపరీత పరిష్కారాలు కూడా అంతే సంక్షోభాన్ని కలిగిస్తున్నాయి.

ఈ సంఘర్షణతో ఛాందసభావాలుగల యువకుణ్ణి, సంఘం చేత దగా చేయబడిన విప్లవభావాలలో మండిపోతోన్న యువతిని తీసుకుని పరిస్థితుల్ని అల్లుకుంటూ అతను కొత్త నవల రాయసాగాడు.

# 18

మధుబాబు పూర్తిగా ఆరోగ్యవంతుడయ్యాడు. ఇది వరకటికంటే బాగా వళ్ళు వచ్చింది. చూడగానే యితరుల్ని ఆకర్షించేటట్టుగా వున్నాడు. మొదటి ఆరునెలలూ అసలు యింట్లోంచి బయటకు కదలనివ్వలేదు అతన్ని. కాని తర్వాత డాక్టరు సాయంత్రాలు పార్కుకి వెళ్ళటానికి అనుమతి యిచ్చారు. ఆరునెలలు తర్వాత వీధిలోకి వచ్చి రోడ్డుమీద నడుస్తోంటే అతని మనసంతా ఎంతో సంఫుల్లమానంగా వుంది గర్వంగా వుంది. బందర్ రోడ్డుమీదకు వచ్చి అక్కడి నుంచి ఆల్ యిండియా రేడియో వైపు ఉల్లాసంగా నడిచి, అక్కడున్న మైదానంలో పచ్చగడ్డిలో చతికిలపడి, దూరంగా

అనుకుంటూన్న విద్యార్థుల్ని చూడటంలో నిమగ్నమైనాడు.

ఈ మధ్యకాలంలో తనలో ఎంతో మార్పువచ్చింది. మానసికంగా ఎంతో పెరిగాడు కూడా ఓపతిష్టత ఏర్పడింది. ఆత్మవిశ్వాసం కూడా ప్రబలింది.

అతని మొదటి నవల వెలువడింది. సాహితీ సమితి పోటీకి దాన్ని పంపించాడు. పత్రికలన్నీ ఎంతో ప్రశంసించాయి. విమర్శకుడు మాత్రం తన పాతపాట పాడాడు. రెండో నవల కూడా సీరియల్‌గా సమాప్తిచెందింది. పుస్తక రూపాన అచ్చవుతోంది కాని యీ పబ్లిషర్ల ప్రవర్తనపట్ల అతనికి రోత కలిగింది. నిజాయితీ అనేది శూన్యం. మొదట అనుకున్నదానికి యిబ్బడి కాపీలు అచ్చువేసి పారేస్తారు తెలియకుండా. ఆ అనుకున్న ప్రకారమైనా డబ్బు యిస్తారా అంటే అదీలేదు. ఇదిగో అదిగో అని కాలయాపన చేసి, చివరకు యాభయ్యో వందో చేతుల్లో పెట్టి, మిగతాదాన్ని గురించి ఎత్తనుకూడా ఎత్తరు. ఆ యిచ్చేదైనా ధర్మం చేసినట్లు, ఊరికినే యిచ్చినట్లు,జాలి తలిచి యిచ్చినట్లు యిస్తారు. పబ్లిషర్ ఆర్థిక సంబంధమైన యిబ్బందుల్లో వుండి - యివ్వలేనని చెబితే మధుబాబుకు డబ్బు దగ్గర పట్టింపులేదు. కాని తానేమో విపరీతంగా డబ్బులు చేసుకుంటూవుండి- రచయితకు న్యాయంగారావలిసిందాన్ని యివ్వకపోవటానికి కారణమేముందిహా ? ఇదీ అతని కోపం

అసలు పబ్లిషర్ల దుష్కృత్యాలకు కొంతవరకు రచయితలే బాధ్యులు. కాని అది వాళ్ళ తప్పుగాదు. ఎందు

కంటే వాళ్ళల్లో చాలామంది బీదవాళ్ళు. ఎంతో కొంత డబ్బు వాళ్ళకవసరం. ఆ డబ్బుకోసం పబ్లిషర్లు చెప్పిన షరతులకన్నిటికీ ఒప్పుకుని, ఆడుతూన్న నాటకాలన్నిటినీ భరించాల్సి వస్తోంది. ఇలా కొందరు రచయితలు పబ్లిషర్లకు అలుసయి, వాళ్ళను అందలం ఎక్కించేసరికి యిది మిగతా రచయితలకు కూడా దెబ్బ కొట్టింది.

దూరంగా ఆడుకొంటూన్న అబ్బాయిల్ని చూస్తూ మధుబాబు ఆలోచిస్తున్నాడు. తనకు చిన్నప్పుడు ఆటలంటే సరదాయే. ఆడుతూవుండేవాడుకూడా. కాని మనిషి బలహీనంగా వున్నాడని తండ్రి మానిపించేశాడు. మెడికల్ కాలేజీలో ఆమధ్య కొన్నాళ్ళు టెన్నిస్ ప్రాక్టిస్ చేశాడు. కాని యిప్పుడిహ ఆ అవకాశం లేదు. తన ఆరోగ్యం బాగుపడినా దీన్ని పువ్వులా వాడుకోవాలి. మామూలు మనిషిలావిచ్చలవిడిగా వుండటానికి వీలులేదు.

తన మూడోనవలకూడా పూర్తికావస్తోంది. తాను యింతత్వరగా వ్రాయగలుగుతున్నందుకు అతనికి ఆశ్చర్యంగా వుంది. ఉమాపతికూడా యీ మధ్య రెండు మూడు నెలలు నుంచీ రాయటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతవరకూ సగం కూడా పూర్తికాలేదు. జీవితాన్ని గురించీ, సాహిత్యాన్ని గురించీ అతనికి తనకన్న స్పష్టమైన అభిప్రాయాలున్నమాట నిజమే అయినా ఓపిక తక్కువ. ఆత్రుత, మొండిధైర్యం ఎక్కువ. రాసిందాన్ని గురించి పదిసార్లు తర్జనభర్జన చేయటం, రాసింది మళ్ళీ రాయటం తెగచికాకు.

ఈ మధ్య బొత్తిగా కథలు రాయటం మానేశాడు. అదంత మంచిపని కాదు. కాని బొత్తిగా రాయలేకుండా వున్నాడు కథలు. కథకోసం ఆలోచన మొదలుపెడితేనవలా స్వరూపం వస్తోంది. అందులో యీ పబ్లిషర్లుకూడా నవలలు, నవలలు అనిగోల పెడుతున్నారుగాని కథలసంగతి ఒకరూ ఎత్తరు. మనిషి నలుగురిమధ్యకూవచ్చి జీవిస్తూ పలుకుబడి సంపాదించాక, యిదివరకటిలా స్వేచ్ఛగా ప్రవర్తించలేడన్న సత్యం తెలుసుకో సాగాడు మధుబాబు.

ఈ మూడోనవలను ఎందుకోఏపత్రికలకూ సీరియల్ గా యివ్వటానికి మనస్కరించటం లేదు. నవలంతా చర్చలమయం. వ్రాయటానికి చాలా యిబ్బంది పడాల్సి వచ్చింది. చాలా పుస్తకాలు పరిశీలించాల్సి వచ్చింది. మతాన్ని గురించీ, సంఘాన్ని గురించీ, ప్రచారంలోవున్న సిద్ధాంతాలగురించీచాలా విషయాలు తెలుసుకున్నాడు. ఓ విధంగా యిది రాయటం తన విజ్ఞానాభివృద్ధికి దోహదకారి అయింది. అసలు అవసరం అంటూ లేకపోతే మానవుడు విజ్ఞానాసక్తి లేక స్తబ్ధుగా పడి వుండటానికి చాలా అవకాశాలున్నాయేమో... ఈనవల ప్రచురణ ఆరంభమయితే తాను అనేక విమర్శలను గురి కావాలసి వస్తుందేమో!

అసలు రచయితకు యిలాంటి జీవితం చుట్టూ పరివేష్టించి వుంటుందని అతను ముందుగా ఊహించలేకపోయాడు ఎవరన్నా చెప్పినా నమ్మివుండేవాడు కాదు. అంటే తాను మహాప్రపంచాన్ని కదిపి, కుదిపి వేస్తున్నాడని కాదు. ఒకనాడు తాను ఎలాంటి పేరుకోసం ఆశించాడో

ఆపేరు వచ్చింది.ఇప్పటికి కొంతమంది తనని యితెగా అంగీ కరించకపోవచ్చు. కానితాను కొంతమందిచేత ఆరాధించబడు తున్నాడు. ఇది సత్యం తన జీవితం యిట్ల వుంటుందని ఊహా కల్పనలు చేస్తున్నాడు. ఇలా పేరు ప్రఖ్యాతులు పొం దిన అందరికి వుంటుందా? అతనికి తెలియదు. రచయితగా తను అదృష్టవంతుడు. అనుకున్నవన్నీ నెరవేరుతున్నాయి. తృప్తి కలుగుతోంది మెడికల్ కాలేజీలో కొన్ని చిత్రమైన సంఘటనలు జరిగాయి. తనని ఎక్కడకో ఊడ్చుకు పోతు న్నాయి

ఇంకో రెండుమూడు నెలలయిన తర్వాత యిక్కడి నుంచి వెళ్ళిపోవాలి. వెగటుగా వుంది యి ట్లోనిజీవితం. అక్కడకుపోయి చదువుకోవాలి,తను త్వరగా డాక్టరుకావాలి. ఎన్నాళ్ళని యిలా తండ్రిమీద భారంవేసివుంటాడు? చప్పున డాక్టరు కావాలనీ, ప్రాక్టీస్ పెట్టాలనీ, స్వతంత్రంగా జీవిం చాలనీ అతి ఆత్రంగావుంది తనవయసుఎక్కువ లేకపోవచ్చు. కాని మానసికంగా పెరిగిపోతున్నాడు. విద్యార్థి దశనుంచి అప్పుడే విడిపోయినట్లుగా ఫీలౌతున్నాడు. గిట్టగా అనుకుం టేనేగాని తాను ఎమ్. బి. బి. ఎస్. స్టూడెంటునన్నవిషయం స్ఫురించదు. తన మన స్తత్వం ఎవరూ అర్థంచేసుకోరు. భవి ష్యత్ నంతా యిప్పుడే అనుభవిస్తున్నట్లుగా ఏమిటో అను భూతి.

చీకటి పడుతూండగా యింటికి తిరిగి వచ్చాడు మధు బాబు.

ఇవాళ మనసు చాలా ప్రశాంతంగా వుంది. భోజనం

చేసి తనగదిలోకి వెళ్ళి మెల్లిగా కాసేపు బుల్‌బుల్ వాయించు కున్నాడు. ఎవరూ నేర్పకుండానే, స్వయంకృషివల్ల బాగా వాయించ గలుగటం వచ్చింది. కాని ఎవరైనా వస్తే ఆపే స్తాడు. సిగ్గు. తనకోసం, తన ఆనందంకోసం వాయించు కుంటాడు.

బయటికి వెళ్ళి వచ్చినందువల్ల హాయిగా, మరీ ఆరో గ్యంగా వుంది ఇలాగే రోజూ వాహ్యాళికి వెడుతూంటే తాను యింకా ఆరోగ్యంగా తయారు కావచ్చు.

ఆరాత్రి పడుకుని నిద్రపోయేముందు ఎందుకో రజని గుర్తుకు వచ్చింది. ఆమెనిచూడాలి, మాట్లాడాలి అన్న కోరిక కలిగింది. తనపేరు శైలజ అని మార్చుకుంది. కారణ మేమిటో! ఆమెకు మంచిపేరుకూడా వచ్చింది. ఇంకా రెండు మూడు సినిమాల్లో కూడా నటిస్తోంది—యీమధ్య ఏదో పత్రి కలో చూశాడు. తనని గుర్తుపడుతుందో పట్టదో. ఎప్పుడైనా కనిపిస్తే.

అట్లా ఆలోచిస్తూ నిద్ర పోయాడు.

## 19

వేసవి గడిచిపోగానే మధుబాబు విశాఖపట్నం వచ్చేశాడు. జనవరినుంచీ రెండునెలలు కష్టపడి చదివి యీ

మార్చికే అసలు ఎప్పీయర్ అవుదామనుకున్నాను. కాని డాక్టర్ అంగీకరించలేదు. తిరిగి పరీక్షలు నవంబరులో వున్నాయి. అందులో ప్యాస్ అయితే వెంటనే డిసెంబరు నుంచీ మూడోఏడు కంటెన్యూ చేయవచ్చు.

తనతో కలిసి చదివిన వాళ్ళందరూ ఒక్క ఏడాది ముందు వెళ్ళిపోయేసరికి అతనికి పూర్వంవున్న పరిసరాల్లో వుండబుద్ధికాలేదు. మహారాణీపేటలో మరోగదికి మార్చి అక్కడవుంటూ శ్రద్ధగా చదవసాగాడు.

సాహితీ సమితివాళ్ళు తాముయిచ్చిన బహుమతి వివరాలు ఎనౌన్స్ చేశారు. పేపర్లో ఉత్తమ నవలారచయితగా తాను ఎన్నికైనవార్త చూసి స్తబ్ధుడైపోయాడు మధుబాబు. కలా నిజమా అనిపించింది. నిజానికి ఈ మధ్య ఆపోటీ విషయంకూడా మరచిపోయాడు. ఎట్లా వచ్చింది తనకు ప్రైజ్. కేవలం అదృష్టమా? ఆరాత్రి అంతా ఈ సుఖమైన అనుభూతే స్ఫురింపసాగింది.

మరునాడు ప్రాక్టికల్స్‌కని కాలేజీకి పోయేసరికి మిగతా స్టూడెంట్లంతా వచ్చి అతన్ని అభినందించారు. టీ పార్టీ ఎప్పుడని మొదలుపెట్టారు. ఆ సాయంకాలం అతనికి సాహితీసమితినుండి అభినందనలేఖ అందింది. బహుమతి ప్రదానం వివరాలు తరువాత తెలియపరుస్తామని రాశారు.

ఈలోగా అతని మిగతా రెండునవలలుకూడా పుస్తక

రూపాన వెలువడినై. మూడోది కొత్త పబ్లిషర్ కిచ్చాడు. ఈ కొత్త పబ్లిషర్ యువకుడు ఉత్సాహవంతుడు.మర్యాద తెలిసినవాడు. మధుబాబుతో బాగాస్నేహం కలిసిపోయింది. డబ్బువిషయంలో యిద్దరిమధ్యా పేచీలేదు. తనకు కావలసి నంత అడిగి తీసుకున్నాడు మధుబాబు. ఇహమీదట తన పుస్తకాలన్నీ అతనికే యిద్దామని సంకల్పించుకున్నాడు.

మూడోనవలమీద అనుకున్నట్లుగానే విమర్శలు చెల రేగాయి నవలాంతంలో అతను చిత్రించిన విరుద్ధ మనస్తత్వాలు గల రెండుపాత్రలుకూడా తాము జీవితాన్ని అపార్ధం చేసుకున్నాయని ఒప్పుకుంటాయి. ఇరువుర్నీ పశ్చాత్తాపం ఆవహిస్తుంది కొంతమందికి యిది నచ్చలేదు. మధుబాబుని ఛాందసుడనీ, పిరికి అనీ నిందించారు. మరికొందరు చదివి పులకరించి పొగిడ్యారు కొందరు ఏమయినా మొదటి నవలలాగా మధుబాబు రాయలేకపోతున్నాడని ఓ నిశ్చయం ప్రదర్శించారు.సాక్షీగా వున్నది వున్నట్లు పరువకుండా విపరీత మనస్తత్వాలజోలికి పోవటమెందుకని కొంతమంది వాదం. భాషవిషయంలో కథ చెప్పేతీరులో వాస్తవికత లోపించిందని మరికొందరి నమ్మకం. మొత్తంమీద అతని మిగతా నవలల కంటే యిదే తొందరగా అమ్ముడు కాసాగింది. ఏమయినా ప్రత్యేకత లేని నవలని అనటానికి ఎవరూ సాహసించలేదు.

'వాస్తవికత' అనే పదం తరచు వినబడుతూండేసరికి దాన్నిగురించి తీవ్రంగా ఆలోచించి చూశాడు మధుబాబు. వాస్తవికతకు చేరువగా వస్తున్నారేగాని, వున్నది వున్నట్లు

ఎవరూ రాయలేరు రాస్తే చాలా అసహజంగా, అసహ్యంగా కూడా వుండే ప్రమాదం వుంది. అతి వాస్తవికంగా రాశా మనుకున్నవారి రచనల్లో నిండుతనం లోపిస్తోంది. నిర్జీవంగా పేలవంగా వుంటున్నాయి. అనుభూతినియ్యవు పెద్ద రచయితలని పిలవబడేవాళ్ళు, ఆ వాట్టిపేరేకాని, అన్ని వర్గాల వారినీ ఆకర్షించక పోవటానికి ఇదో పెద్ద కారణమని విశ్వసిస్తాడు మధుబాబు

ఓ రచనయొక్క విజయం, దానికి పెట్టేపేరుమీదా, అందులోని పాత్రలకు పెట్టే పేర్లమీదకూడా కొంతవరకూ ఆధారపడి వుంటుంది. నిత్యజీవితంలో పుల్లయ్య అనే పేరు గల ఒకడు ఎమ్. ఎ. నో లేక యూనివర్సిటీలో చదువుతూ వుండవచ్చు. అతడు అనేక ఆకర్షణీయమైన కార్యకలాపాలు చేస్తూంవుండొచ్చు. ఓ రొమాంటిక్ హీరోకావచ్చు. కాని అదే కథలోకి వచ్చేసరికి అలాంటి లక్షణాలుగల కథానాయకుడికి పుల్లయ్య అనో, ఎల్లయ్య అనో పేరుపెడితే చదివేవాళ్ళకి చిరాకేస్తుతుంది. అలాగే ఎంతమంది వెంకట సుబ్బమ్మలు, రంగనాయకమ్మలు లేరు–అందమైన కాలేజీ స్టూడెంట్లుగా? ఓ నవల్లో నాయికను వయ్యారంగా వర్ణిస్తూ అలాంటిపేర్లు పెడితే పాఠకలోకం హర్షిస్తుందా?

మధుబాబు తన రచనల్లోని పాత్రలపేర్ల విషయంలో చాలా శ్రద్ధ తీసుకునేవాడు.

*　*　*

శ్రద్ధగా చదువుతున్నాడు. కాని ఎక్కువగా అలసట చెందవద్దని తండ్రి చేసిన హెచ్చరికలు జ్ఞాపకంవచ్చినప్పుడల్లా తానిహ జీవితాంతం అందరిలాగా స్వేచ్ఛగా వుండలేనా అన్న తలంపు వేధిస్తూవుండేది.

ఒకరోజు యధాలాపంగా ఓ వారపత్రిక చదువుతోండగా ఓ అమ్మాయి రాసిన కథ అతడ్ని ఆకర్షించింది. ఆ అమ్మాయిపేరు పద్మజ. కథ గొప్పగా ఏంలేదు. శైలి కూడా విలక్షణంగా ఏమీలేదు. కాని ఉల్లాసంగా, ఆహ్లాదకరంగా, మధురంగా వుంది. అతనికి హాయనిపించింది. వెంటనే తనని గురించి తనకు స్ఫురించింది అతనికి. తాను ఎంతో గంభీరమైన,జటిలమైన మనస్తత్వ చిత్రణలుచేశాడు. ఒకవేళ ఈ యాతన, గందరగోళం యిదంతా జీవితాన్ని మరింత క్లిష్టం చేయటానికేనేమో! ఇప్పుడీ అమ్మాయి రాసిన కథ చదివితే ఎంతో సంఫుల్లమానంగా వుంది మనసు. తియ్యని ఆలోచనలు కలుగుతున్నాయి. ఎంత నిశ్చింతగా వుంటుంది - యిట్లాంటి రచనలు చేస్తూవుంటే- చికాకులు లేకుండా.

అతనికి వెంటనే ఆ అమ్మాయికి ఉత్తరం రాద్దామనిపించింది. అమ్మాయో, వయసులో పెద్దో ఏమీ తెలియదు. పేరున్న రచయిత్రి కూడా కాదు. తన దగ్గరనుంచి ఉత్తరం వస్తే ఏమనుకుంటుంది? ఇట్లా పాఠకుడిగా ఒకరికి రాయటం యిదే ప్రథమ పర్యాయం. పోనీ మారుపేరుతో రాస్తే? అతనికి మనస్సు ఒప్పుకోలేదు.

వెంటనే ఓ చిన్న ఉత్తరం రాసేశాడు-పద్మజగారికి అని మొదలుపెట్టి.

"బహుశా జీవితంలోని సీరియస్‌నెస్ వల్లనేమో-మీ కథ చాలా నచ్చింది. అసలు మనుషులకి కావలిసింది ఇలాంటి కథలేనేమోనన్న నమ్మకం కలుగుతోంది. చాలా సరదాగా వుంది......వీలుంటే జవాబు రాయండి"

క్రింద సంతకం చేశాడు.

ఆమె ఎడ్రెస్ తెలియదు మరి. తనకొచ్చే ఉత్తరాలన్నీ పత్రికల ఆఫీసునుంచి రీడైరెక్ట్ చేయబడి వస్తాయి. అలాగే ఆ వారపత్రిక కేరాఫ్‌కు పోస్ట్ చేశాడు.

అయిదు రోజుల్లో పద్మజ దగ్గరనుంచి జవాబు వచ్చింది. ఆమెది హైదారాబాద్.

మధుబాబుగారికి,

మీ దగ్గర్నుంచి ఉత్తరం రావటం ఎంతో సంతోషాన్నిచ్చింది. ఒకసంగతి చెప్పనా? మధుబాబు నా అభిమాన రచయిత. వీలయితే ఎప్పుడన్నా కలుసుకోవాలన్న కోరిక కూడా రహస్యంగా నాలో వుంది. నేను మీ రచనలన్నీ చదివాను. ఎంతో యిష్టం నాకు. మీ రచనలముందు నావి సూర్యుడి ముందు దివిటీల లాంటివి. అసలు నేను రెండుమూడు కథలకంటే ఎక్కువ రాయలేను. అనుకుగాని ఈ ఉత్తరంతో ఆపేస్తారా? నాకు వరుసగా రాస్తూ వుంటారా? ఈసారి పాఠకుడిగా కాకుండా రచయితగా, నా అభిమాన రచయితగా రాయగోరుచున్నాను.

ఈసారి అంత చిన్న ఉత్తరం రాస్తే...... ఇహ ఏం లేదు. నాకు కోపం వస్తుంది.

పద్మజ.

ఎంత ఆప్యాయంగా వుంది లేఖ! అతనికి శరీరం పులకరించింది. ఒకసారికాదు. పదిసార్లు చదువుకున్నాడు.

ఈమధ్య అతన్ని ఒంటరితనం మరీ వేధిస్తోంది. ఎందుకనో తనకెవరూ లేరు, తనకెవరూ లేరనిపిస్తోంది. ఎప్పుడూ అర్థంకాని అవ్యక్తాందోళన. తన పక్కన ఓ అందమైన అమ్మాయి వుండాలని, యిద్దరూ ఎక్కడో ఎవరికీ తెలియని ఏకాంతంలో ఒకరికొకరు సమీపంలో అలా పచ్చికలో పడుకుని తానామె కళ్ళలోకి చూస్తూ తన మనసుని విప్పి చెబుతోంటే, ఆమె ఊంకొడుతూ, నిట్టూరుస్తూ ఆలకించాలని... ఇలా తియ్యటి కలలు. తాను ఒట్టి అయోమయం మనిషి. తనకు తోడుకావాలి. ఆ తోడుకోసం మనసు తహతహలాడుతోంది

అనుకోకుండా ఎంతో ఆప్యాయంగా మళ్ళీ జవాబు రాసేశాడు మధుబాబు. ఈసారి కాస్త పెద్దది రాశాడు. ఆమె బొత్తిగా అపరిచిత. తాను ఏంరాస్తే ఏంవొస్తుందో! జాగ్రత్తగానే రాశాడు. స్వంతవిషయాలు లేకుండా, అట్లు బొత్తిగా జనరల్‌గా కాకుండా రాశాడు.

పద్మజ వెంటనే జవాబు రాసింది.

మధుబాబుకి యీ అనుభూతి కొత్తగా వుంది. ఇది

వరలో తన కెందరో రాశారు. ఇప్పటికీ రాస్తున్నారు. తాను వాటికి జవాబులు యిస్తూనే వున్నాడు. కాని అవన్నీ సమస్యలమయం, చర్చలమయం. తాను వాళ్ళను సన్నిహితంగా వచ్చినమాట వాస్తవమేగాని — ఈ ఆకర్షణ, మధునయాతన అక్కడ్కలేదు. ఒకరకంగా చాలా చిన్నపిల్లలా, అభమూ, శుభమూ తెలియని అమ్మాయిలా రాస్తోంది.

"అప్పుడే చెప్పులు తొడుక్కుని బయటకు పోదామనుకుంటున్నాను; ఇంతలో మీ ఉత్తరం వచ్చింది.ఎవరో నామీద బుట్టెడు పువ్వులు చల్లినట్లనిపించింది... ...మీ అక్షరాలు ఎంత అందంగా వుంటాయి? నా దస్తూరి బాగా లేదు కదూ... ..." యిలా సాగింది ఉత్తరం.

మళ్ళీ జవాబు రాశాడు మధుబాబు.

రాసినప్పటినుంచీ ఆమె ప్రత్యుత్తరంకోసం ఎదురు చూడటం ఓ నూతన దినచర్య అయింది. అబ్బ! స్త్రీ ఎంత ఆకర్షణ?

## 20

ఎక్కడి మధుబాబు? ఎక్కడి పద్మజ? ఇద్దరూ ఒకరికొకరు మాస్కోలేదు. బహుశా మధుబాబు ఫొటో

చూసి వుండవచ్చు పద్మజ. కాని ఓ మనిషి ఫొటోనుబట్టి రూపంమీద విశ్వసించటం కష్టం. మొత్తంమీద ఒకరికొకరు సన్నిహితంగా రాసాగారు.

ఆ ఉత్తరాలు చిత్రవిచిత్రంగా వుండేవి.

"పద్మా" అని సంబోధించే వాడామెను మధుబాబు. "పద్మా ! ఇక్కడ నాకేం తోచటంలేదు. ప్రపంచంమీద చిరాకు కలుగుతోంది. మీ కబుర్లు ఎంతసేపయినా వినాలని వుంది. మీరెందుకు అప్పుడప్పుడూ రాయటం ఆలస్యం చేస్తారు ? ఎందుకో యీ సాహిత్య వ్యాసంగంమీద విరక్తి పుడుతోందండీ నాకు. ఎందుకివన్నీ - అర్థం లేకుండా అని పిస్తోంది. మళ్ళీ విషాదంమీద మోజు. ఒక్కోసారి అర్ధరాత్రి లేచి కూర్చుని దేవదాసుల్ని, పార్వతుల్ని ఎడ తెరిపిలేకుండా సృష్టించి ఈ ప్రపంచాన్ని దుఃఖమయం చేయాలనిపిస్తుంది"

♦ ♦ ♦

మధూ !

దేవదాసుల్ని, పార్వతుల్ని సృష్టించటం మీ అభి మతమైతే, అలాంటి యిన్స్పిరేషన్ మీకు యివ్వగలనన్న ధైర్యం నాకుంది. మీ కళ్ళలోకి చూస్తూ మీరు చెప్పే కబుర్లు నాకు వినాలనివుంది. ఎందుకో యివాళ ప్రొద్దున లేచినప్పటినుంచీ మీగురించే ఆలోచిస్తున్నాను. మీ ఉత్త రం చదువుతూ ఏదో ఊహాలోకాల్లో విహరించసాగాను. ఇంతలో ఏదో చప్పుడై యీ లోకంలోకి వచ్చి చూసేసరికి

ఏముంది ? ఎర్రగా పండిన గోరింటాకు చేతిలో తెల్లటి మీ ఉత్తరం !

* * *

చాలా అల్లరి పిల్లకూడాను పద్మజ. ఒక్కోసారి ఎంతో అల్లరిచేసేది. చిలిపిమాటలని కవ్వించేది. అతను ఊరుకునేవాడు కాదు. 'అల్లరిపిల్ల పద్మజకు' అంటూ మొదలు పెట్టేవాడు అనగా అనగా ఓ అబ్బాయికి అంటూ మొదలు పెట్టేది ఆమె.

"మీ ఊరువొస్తే ఏం చేస్తారని" అడిగేది.

"చెవి పట్టుకుని మా ఇంటికి లాక్కువెళ్తా" అన్నాడు.

"యెవర్రో యీ అమ్మాయి ? అని మీ యింట్లో వాళ్ళు అడిగితే మీరు తెల్ల...వొద్దులెండిబాబూ ! మీకు కోపం వస్తుంది"

"మీరు రాయబోయి ఆపేసినట్లు తెల్ల మొహం వెయ్యను. నా చెలికత్తె అని చెబుతాను"

"అన్నీ అబద్ధాలు"

"అదిగో మీరు నమ్మరు"

"మీ మొగవాళ్ళ మాటలు నేను నమ్మను"

"నాకు పరీక్షలు దగ్గర కొస్తున్నాయి బాబూ! నేను చదువుకోవాలి"

"ఎంత పరీక్షలయినా సరే, నాకు రాసి తీరాల్సిందే"

"మరి నా పరీక్షలు గల్లంతయి పోతేనో? యీసారి పోయిందంటే యిహ నేను మీకు కనబడను. ఎవ్వరికీ తెలియని, కనిపించని మారు మూలలకు వెళ్ళిపోతాను."

"వొద్దు, అలా జరగదు. జరిగినా నా పిలుపు అందని దూర తీరాలకు వెళ్ళిపోవద్దు ప్లీజ్"



ఈ అమ్మాయి ఎట్లావుంటుందని ఎప్పుడూ ఆలోచించలేదు. మధుబాబుకి అదే యింకెవరి గురించయినా అయితే అనుకోకుండానే ఓ రూపం కళ్ళముందు మెదుల్తుంది. కాని పద్మజగురించి ఓ స్వరూపం అతనెప్పుడూ సృష్టించుకోలేను. ప్రయత్నించినా విఫలత్వం పొందేవాడు. చేతనయ్యేది కాదు. అతడామెను ఆరాధిస్తున్నాడు. ప్రేమకన్న ఆరాధన గొప్పది. అంత ఆరాధించే వ్యక్తులనుగురించి ఎవ్వరూ రూపకల్పన చేసుకోలేరు. ఇది సత్యం. ఓ రూపంలేని వ్యక్తితో, వొట్టి మనసుతో మాట్లాడుతున్నాడు మధుబాబు. మనిషి ఎట్లావున్నా అతనికి నిమిత్తం లేదు. అతనిఆనందానికి భంగం రాదు. పద్మజకు అర్థమౌతుందా యీ విషయం? అతని హృదయాన్ని చదవ గలుగుతుందా?

* *

ఓరోజు సాయంత్రం అయిదు గంటలైంది, హైదరా

బాద్‌లో పద్మజ అప్పుడే యింటికివచ్చితలంటుపోసుకున్నది. మనసంతా ఎంతో ఉల్లాసంగా వుంది. జుట్టు ఆరబెట్టుకుందామని డాబామీదకు వెళ్ళింది. సాయంకాలపు నీరెండలో దూరంగా మెరుస్తోన్న చిన్ని కొండలూ, యీ కమ్మటిగాలి, నీలాకాశపు నిర్మలసౌందర్యం....ఆమె మనసు సంతోషంతో ఉరకలు వేసింది. ఈపాటికి ఏం చేస్తుంటాడో మధుబాబు ? శ్రద్ధగా పాఠాలు చదువుకుంటూ వుంటాడా? తన గురించి ఆలోచిస్తూ వుంటాడా? అతనికి రాయాలనిపించింది అప్పటి కప్పుడు. గబగబ క్రిందకు వెళ్ళి కాయితం, కలం తెచ్చుకుని, కుర్చీలో కూర్చుని రాయసాగింది

మధూ !

ఎంత ప్రశాంతంగా వుంది యివాళ? ఎన్ని ఊహలు? అతనో మహారాజు. "నాకు అందడు. ఎత్తైన సింహాసనం మీద కూర్చుని వున్నాడు. అతన్ని చేరుకుందామని నేను మెట్లు ఎక్కుతున్నాను. తలవంచుకుని మరో ధ్యాస లేకుండా ఎక్కుతున్నాను. ఆయాసం వస్తోంది. ఎంతకూ అంతు తేలని ఈ ప్రయాణం. ముఖాన స్వేదబిందువులు అలుముకుంటున్నాయి. అతన్నెట్లా చేరుకుంటాను? అతనికి తెలుస్తుందా నా తపన? మధూ, మధూ ! జవాబు చెప్పవేం ? అబ్బ ! మూడ్స్ చెదిరి పోతున్నాయి. ఇహ ఆపేస్తాను !"

పద్మజ కన్నీరు కారుస్తోంది.

♦ ♦

పద్మజకు ఓ చిత్రమైన కోరిక కలిగింది. రాబోయే వారం రాత్రి సరిగ్గా ఎనిమిది గంటలకు యిద్దరూ ఒకర్ని గురించి ఒకరు ఆలోచించుకోవాలని. "మీరు ఆదివారం రాత్రి సరిగ్గా ఎనిమిదిగంటలకు ఉత్తరం రాయండి. అప్పుడు నేను మీగురించి ఆలోచిస్తూ వుంటాను" అని రాసింది.

తీరా ఆదివారం సాయంత్రం అయిదున్నరయేసరికి ఓ స్నేహితురాలు వొచ్చి సినిమాకు వెళ్దాం రమ్మని కూర్చుంది.

"అబ్బ! యివాళ వద్దులేవే. మనసేం బాగాలేదు. రేపెప్పుడన్నా వెడదాం" అని పద్మజ తప్పించుకోచూసింది.

"అయినా ఏమిటీమధ్య అదోరకంగా వుంటున్నావు? మునుపటిలాగా సరదాగా ఉత్సాహంగా వుండటం లేదు. పద పద, రాకపోతే ఎత్తుకు తీసుకువెళ్తాను" అంటూ బలవంతంగా లాక్కెళ్ళి పోయింది స్నేహితురాలు.

*

సరిగ్గా అదేరోజు మధ్యాహ్నం మధుబాబుస్నేహితుడొకడు కలకత్తానుంచి వస్తున్నాడు. అతను విశాఖపట్నంలో దిగటంలేదు గాని-మాటాడవల్సిన విషయాలు చాలావున్నాయనీ, స్టేషన్‌కి వచ్చి కలుసుకొమ్మనీ మధుబాబుకు ముందురోజు ఉత్తరం రాశాడు. ఇద్దరూ యింటర్మీడియట్‌లో క్లాసుమేట్సు, ఎంతో ఆత్మీయులు. మధుబాబు స్టేషన్‌కి వెళ్లాడు.

ఆ మిత్రుడుకూడా సాహిత్య పిపాసి. ఇద్దరూలోకాన్ని

మరిచి కబుర్లలో పడ్డారు. ట్రెయిన్ కదలబోతోంది. మధు బాబుని సంభాషణ మధ్యలో వొదలటం యిష్టంలేక "అరె, కొంతదూరం రైల్లో రారాబాబూ! మరో ట్రెయిన్‌లో తిరిగి రావచ్చులే" అంటూ బలవంతంగా కంపార్టుమెంటు లోకి యెక్కించాడు.

తుని స్టేషను వచ్చేదాకా యిద్దరూ కబుర్లలో మునిగి తేలారు. అప్పటికీ అతణ్ని విడిచి పెట్టాలంటే కష్టమనిపించింది. కాని తప్పదు. సెలవుతీసుకుని అక్కడ దిగిపోయాడు.

అప్పటికి సాయంత్రం అయిదయింది. ప్రొద్దుటినుంచీ భోజనం లేకపోవటంవల్ల బాగా ఆకలిగా వుంది. వెళ్ళి కాఫీ త్రాగి వచ్చాడు. విశాఖపట్నం పోవటానికి మళ్లీ యిప్పు డప్పుడే ట్రెయిన్ లేదు. ఎనిమిది గంటలకల్లా అక్కడకు చేరు కోవాలి. పద్మజకు ఉత్తరం రాయాలి. స్టేషన్ బయటకు వచ్చాడు. ఆలోచిస్తూ దూరంగా ఎక్కడినుంచో తిరిగివస్తూ టాక్సీ ఒకటి కనిపించింది. దాన్ని ఆపి అందులో కూర్చుని "విశాఖపట్నం, త్వరగా" అన్నాడు.

"ఎనిమిదికల్లా చేరుకుంటానా; లేదా?" అని మనసు ఆరాటంలో కొట్టుకుపోతోంది. ఏమీ లేను ఊరికినే పిచ్చి.

సరిగ్గా ఏడూ యాభయి అయిదు నిమిషాలకల్లా గదికి చేరుకున్నాడు. చాలా ఆకలి వేస్తోంది అతనికి. నీరసంగా కూడా వుంది. బల్లమీద ఎవరో స్నేహితుడు పంపించిన పూత రేకులున్నాయి. ఒక చేత్తో అవి తీసుకుని తింటూ ఉత్తరం రాయసాగాడు.

"మీరు హాయిగా భోజనంచేసి, తాంబూలంవేసుకుని, సోఫాలో నన్నుగురించి ఆలోచిస్తూ ఓ చెయ్యి అలా గడ్డంక్రింద ఆనించి వయ్యారంగా పడుకున్నారు కాబోలు. నేనిలా ఆకలితో అమ్మాయిగారికి పూజ ప్రారంభించాను. అయోమయ గాఢాంధకార జీవితంలో వెలుగు రేఖమీరు. అలాంటి మిమ్మల్ని పూజించకుండా ఎలా వుండేది? అబ్బ! మనయిద్దరిమధ్యా యిన్ని వందలమైళ్ళదూరం! ఎలా భరించేది అంతదూరాన మిమ్మల్ని? ఈ సాహిత్యం అబద్ధం. జీవితం, చదువూ, ప్రపంచం అంతా మిథ్య! మీరు ఒక్కరే నిజం. విమానంలో ఎగిరి వచ్చెయ్యనా మీ దగ్గరకు? ఎంత బాధ కలిగిస్తున్నారు—మీరు నాకు?అసలు మీరు చేసేవన్నీ తప్పులే! మీ కేశిక్ష విధించినా పాపంలేదు. మీ చెంపమీద అలా సున్నితంగా కొట్టాలని వుంది. మీరు చేసే నేరాలన్నీ రాసుకుంటున్నాలెండి.కలిపి అన్నిటికీ పెద్ద పనిష్మెంటు... పూతరేకులుతింటూ రాసిన ఈ ఉత్తరం తియ్యగావుందో లేదో రాయండి—మధు (తియ్యని కన్నీళ్ళతో)

*

పద్మజ సినిమా చూస్తోందన్న మాటేగాని ధ్యాస అంతా విశాఖపట్నంలో వుంది. ఆవంకెలజుట్టు అలా నుదుటిమీద పడుతూండగా, ఆ తెల్లటి అబ్బాయి అందంగా కుర్చీలో కూర్చుని తనకు రాస్తూ వుంటాడు. పద్మా, పద్మా అని కలవరిస్తూ వుంటాడు. అతని కంఠం, రూపం అన్నీ యెంత మనోహరం! అబ్బ! యెంత మంచివాడు!ఎంత అందగాడు!

"ఒసేవ్! సినిమా చూస్తున్నావా లేదా?" అంటూ స్నేహితురాలు నెత్తిమీద ఒక్కటిచ్చుకుంది.

♦

"నే నెవర్ని మీకు?"

"నా బంగారు తల్లివి"

"మీ రెవరు?"

"వెలుగుని వెదుక్కునే బాటసారిని"

"ఎక్కడకు ప్రయాణం?

"కాంతి కిరణం కడకు"

"చేరుకుంటున్నారా?"

"అది యెప్పుడూ అందని,దూరంగా పోని అందమైన ఆశారేఖ."

"నే నెవర్ని?"

"నా కంటి పాపవు"

"మీ రెవరు?"

"అడవి మనిషిని"

"వొట్టి..."

"అవును. వొట్టి అడవి మనిషిని"

"మీ కేం కావాలి?"

"తెలీదు. తెలీదు"

"మీరు ఎక్కడ వున్నారు?"

"చీకట్లో..."

"భయం వెయ్యదూ?"

"అబ్బ! చాలా చాలా. ఒంటరిగా పడుకోవటం యెంత భయం?"

"నాకు నవ్వొస్తోంది"

"నా మంచితనం చూశా? నేను చాలా మంచివాడ్ని తెలుసా?"

"నే నెవర్ని?"

"వొట్టి మొద్దువి."

"ఏయ్! నాకు కోపం వస్తుంది చెబుతున్నా"

"శిక్ష విధిస్తారా?"

"ఊఁ"

"ఏమిటి?"

"గుంజిళ్ళు"

"మీ రెవరు?"

"భవదీయుడ్ని"

"అంటే?"

"యెవరినన్నా అడగండి"

... ... ... ...

... ... .... ...

"అర్థం తెలుసుకున్నా 'భవదీయ' అంటే. నేను మాత్రం మదీయే బాబూ!"

"కాదని నాకు తెలుసు"

"అలాగా? ఎన్నట్నుంచండీ ఈ అహంభావం?"

# 21

అతని పరీక్షలు జరిగాయి ఒకవైపు పద్మజని గురించి హృదయం నింపుకుంటూనే ఓపిక చేసుకుని చదివాడు మధుబాబు. పేపర్లన్నీ బాగా రాశాడు.

అతను పరీక్ష ప్యాసయ్యాడు.

ఓ పదిరోజులు సెలవులు వచ్చాయి. ఇంటికి వెళ్లాడు. మళ్ళీ చిక్కిపోయాడని తల్లి గోలచేసింది. అక్కడున్నన్నాళ్ళూ మంచిఆహారం తీసుకోమ్మని తండ్రి ఆదేశించాడు.

అతనికి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి.

కోడల్ని తెచ్చుకోవాలని కోరిగ్గా వుంది సుందరమ్మగారికి. ఈ విషయాన్ని మధుబాబు ముందు ఎత్తింది. 'అప్పుడే నాకు పెళ్ళేమిటమ్మా?' అని అతను చికాకుపడ్డాడు. 'నాకు మాత్రం కోడల్ని చూసుకోవాలని లేదుట్రా. మీ అబ్బాయికి పెళ్ళి చేస్తారా? అని ఎంతమందో వచ్చి తిరిగి పోతున్నారు. అట్లా మనదగ్గరకు వస్తుంటే నిర్మొహమాటంగా చెప్పటం కూడా కష్టం. అయినా యిప్పుడు పెళ్ళిచేసుకుంటే నష్టమేముంది? కాపురానికి తీసుకురావాలని నిబంధన ఏమన్నా వుందా? పండగలకూ వాటికీ చక్కగా నువ్వొస్తారింటికి వెళ్ళటం, ఆ పిల్ల యిక్కడకు వచ్చి యిల్లంతా కలయ తిరగటం ఎంచక్కా వుంటుంది' అంది ఆవిడ ఆ దృశ్యాలని ఊహిస్తూ.

"ఈసారి వేసవి సెలవులకి వచ్చినప్పుడు చూద్దాం లేమ్మా! ఇప్పుడు సెలవులు కూడా తక్కువ" అంటూ మధు బాబు తప్పించుకున్నాడు.

... ... ...

విశాఖపట్నం వచ్చి మూడో ఏడులో చేరాడు. హాస్పటల్‌కి దగ్గరగా మరో గది తీసుకున్నాడు. హాస్పటల్‌లో పేషెంట్సు, నర్సులు, తమ కాలేజీ అమ్మాయిలు ... యీ జీవితం కొంత కొత్తగా వుంది. యిదివరకటి మాదిరిగాక యిప్పుడు అమ్మాయిలకు మరింత చేరువగా సంచరించే అవ సరం, అవకాశం రెండూ వున్నాయి. కాలేజిలో అమ్మా యిల్లో అందమైన వాళ్ళుగూడా వున్నారు. కాని చూడని వాటిమీద మోజో, యెదుట నున్న వారిమీద నిర్లక్ష్యమో అతన్నెప్పుడూ వీళ్ళని గురించి మరోరకంగా ఆలోచించ నియ్యకుండా చేసేది పద్మజ, పద్మజ! రూపం తెలియని పద్మజ! ఆమె గురించే నిరంతరం అతని తపన.

మొన్న తల్లి తన పెళ్ళి విషయం యెత్తింది. తాను మరొకర్ని ఎలా పెళ్ళి చేసుకుంటాడు? ఒకప్పుడు రాజ్య లక్ష్మిని ఈ ప్రపంచంలో అందర్నీ ధిక్కరించి పెళ్ళి చేసు కోవటానికి సిద్ధపడ్డాడు తన త్యాగం భరించలేక ఆమె ఈ లోకాన్ని త్యజించి వెళ్ళిపోయింది. ఆ పాపం తనదేనేమో. అది యెన్నటికీ ఆరనిమంట పద్మజ పరిచయంలో, ఆ అను రక్తిలో శీతలవాయువులు వీస్తున్నాయి. ఆమెని విడిచి తాను యెలా వుండగలడు? ఆమె తనకి కావాలి! పద్మజ లాంటి

వ్యక్తులు కోటికి ఒకరుకూడా వుండరు. తాను ఆమెనే వివాహం చేసుకోవాలి.

ఆమె యెవరో, కుటుంబం ఏమిటో, ఏం చదువుతోందో, ఏం చేస్తోందో తెలియదు. అయినా ఆమె తనకు కావాలి. ఆమె లేని జీవితాన్ని ఊహించలేడు. తను పద్మజ కోసం. ఈ విషయం ఆమెకెలా చెప్పటం? యెన్నో విషయాలు రాసుకుంటారు. పెళ్ళివిషయం మెత్తబోయేసరికి సంకోచం అడ్డువస్తోంది తనని అపార్థం చేసుకుంటుందేమో! తప్పేముంది యిందులో? అతను వాయిదాలు వేసుకుంటూ పోసాగాడు.

... ... ...

పద్మజ పరిగెత్తుతోంది. "ఆగవే నీలాగా లేడిపిల్లలాగా మేము ఛంగుఛంగున గంతులు వెయ్యలేం" అని స్నేహితురాళ్ళు గొడవ పెట్టసాగారు.

ఆ తోటల్లో, వెలుగునీడల్లో, పచ్చికమీద చేరగిలబడి పోయింది—ఆలోచిస్తూ.

"ఎవర్ని గురించి ఆలోచన?" అందో స్నేహితురాలు ప్రక్కకువచ్చి కూర్చుని.

"ప్రేమ గురించి"

"అబ్బో! ప్రేమ.పద్మా నాకు ప్రేమించాలని వుందే. యెలాగో చెప్పవూ?"

"ఛా, పో"

"అబ్బ! చెప్పవే"

"అయితే వుండు" అని పద్మజ లేచి చేతిలో సంచి తీసుకుని చెట్లచాటుగా వెళ్ళింది. అయిదు నిమిషాలు గడిచాయి. చాటునుంచి ఓ యువకుడు బయటకు వచ్చాడు.

స్నేహితురాలు లేచి నిలబడింది.

"ఇలారా. నన్ను కావిలించుకో."

"వసేయి పద్మా! ఈ ప్యాంటూ, చొక్కా నీ కెక్కడివి?"

"హూంఫ్! ఇప్పుడు నేను నీవెంట బడతానన్నమాట. పోజుకొడ్తూ వుంటాను ఇదిగో యిలా కొడ్తాను. మొట్టమొదట నీకు ఆగ్రహం కలగాలి. కొంచం తిట్టు. ఫరవాలేదు. తరువాత నీ వెనకాలనే పడి ఓ పాట అందుకుంటాను. సరిగ్గా సగంవరకూ అయినాక మూతీ, ముక్కూ విరుచుకుంటూనే నువ్వూ పాడెయ్యి కోపంగా. అటు తిరిగి మురుకుకు, నేను చూడకుండా చిరునవ్వులు నవ్వుకో. చివరకు చొరవగా నీ చెయ్యి పట్టుకుంటాను. నన్ను చెంపమీద కొట్టటానికి చేయెత్తి, అలాగే నిర్ఘాంతపోయి. నా కళ్ళలోకి చూస్తూ నిల్చిపో. అప్పుడు నేను మరోపోజు కొట్టేసి యిలా నవ్వేస్తాను. అదే లవ్వు! ఊఁ త్వరగా కానియ్యి...ఇదిగో వెంట పడ్తున్నాను...ఊఁ ఇక నువ్వు పాడెయ్యి...ఆఁ చెయ్యి పట్టుకుంటున్నా. ఇంకా కొట్టటానికి చెయ్యి ఎత్తు. అదీ అలాగ ఆఁ యిప్పుడు పోజు కొడ్తున్నాను కాచుకో!"

వెనకనుంచి చప్పట్లు వినిపించాయి. వెనువెంటనే కిలకిలమని నవ్వులు. కెమేరా క్లిక్ మంది.

"ఛీ, క్రిములొచ్చి అంతా పాడుచేశాయి" అంటూ పద్మజ విసుగు నటిస్తూ దూరంగా వెళ్ళిపోయింది. ఓ సన్న జాజి పువ్వుల చెట్టు దగ్గర కెళ్ళి కూర్చుంది. సన్నజాజిపువ్వులు ఎంత యిష్టం తనకు!

మధు ప్రక్కనవుంటే ఎంత బాగుండును? ఇలాగే అల్లరి చేసేదా? ఇంకా యింకా చేసేది. అతన్ని పట్టుకోమని చెప్పి అందకుండా ఛంగుఛంగున పరుగెత్తేది తనని అందుకో లేక అతను ఆయాసంతో అవస్థ పడుతూవుంటే ఉడికించి, దగ్గరకువచ్చి చెవులు పట్టుకుని ఊపిఊపి ఆడించేది అతన్ని నీళ్ళలోకి తోసి యీదలేక అవస్థ పడుతోంటే కిలకిలమని నవ్వి గేలి చేసేది. అతడి వళ్ళో తలపెట్టుకుని, జీవితాన్ని గురించి, ప్రపంచాన్ని గురించి చిత్ర విచిత్రమైన కబుర్లు చెపుతోంటే ఊఁ కొడుతూ ఆలోచించేది. అతని జుట్టుని చిందర వందర చేసేసి పక్కుమని నవ్వేది. ఆకాశంలో చంద మామని తెచ్చిపెట్టమని మారాం చేసేది. అబ్బ! యెంత కలుసుకుంటుంది అతన్ని? యెలా కలుసుకుంటుంది?

భయంగా వుంది పద్మజకు. అక్కడినుంచి లేచి తూలుకుంటూ స్నేహితురాళ్ళ దగ్గరకు వెళ్ళిపోయింది.

o o o

కాలేజీలో స్టూడెంట్సందరూ క్రికెట్ ఆడుతున్నారు ఊరి బయటి మైదానంలో. మధుబాబుకి కూడా ఆడదామని సరదా పుట్టింది. బ్యాట్ తీసుకున్నాడు. బౌలరు విసరినబంతి విసురుగా మీదకు వస్తోంది. బలమంతా ఉపయోగించి

కొట్టాడు. బంతి నివ్వున వెళ్ళి-దూరంగావున్న పెద్ద చెత్త కుండీలో పడింది. మధుబాబు బ్యాట్ క్రిందపడేసి బంతి కోసం పరిగెత్తాడు. అంత పెద్ద చెత్తకుండీ అక్కడ ఎందుకు వుందో తెలీదు. చెత్తా చెదారం విపరీతంగా పేరుకుపోయి వుంది "అరెరే, ఆమూల బంతి" వెనుకనుంచి ఎవరో అరుస్తున్నారు. అతనికి వినబడలేదు. బంతికోసం గబుక్కున లోపలకు దూకాడు.

మరుక్షణంలో అతనికి అర్థమయింది. అది యెవరూ ఉపయోగించకుండా వొదిలేసిన బావి. పైన చెత్త, అడుగున నీళ్ళు. క్షణకాలంలో అతను ఆ బురదలో, ఊబిలో దిగిపోసాగాడు. తాను చచ్చిపోతున్నాడు. "పద్మా!" అనుకున్నాడు. కన్నుమూసి తెరిచే వ్యవధిలో కంఠంవరకూ వెళ్ళిపోయాడు. చివరి ప్రయత్నంగా చేతులు రెండూ ఎత్తి ఏమయినా ఆధారం దొరుకుతుందేమోనని తడిమాడు ఏదో తగిలింది గోడలోంచి పాకిన ఏదో మొక్క. గట్టిగా పట్టుకున్నాడు. చేతులు వణుకుతున్నాయి కళ్ళు మూసుకుపోతున్నాయి. "పద్మా! పద్మా!"

పైనుంచి కుర్రాళ్ళు అరుస్తున్నారు. కంగారుతో కేకలు పెడుతున్నారు. ఒకడెవడో ముందుకు వంగి బ్యాట్ అందిచ్చాడు అతన్ని వెనకనుంచి మరోయిద్దరు గట్టిగా పట్టుకున్నారు. మధుబాబు చేయెత్తి శక్తినంతా ఉపయోగించి దాన్ని పట్టుకున్నాడు. రెండు మూడు నిమిషాలు యమయాతనమీద అతన్ని పైకి లాగేశారు.

వళ్ళంతా బురదా, మురికీ, ఎలా వున్నాడో అలా వున్నాడు అతను.

గదికి వెళ్ళాక శుభ్రంగా తలంటు పోసుకుని, బట్ట లేసుకుని కుర్చీలో కూర్చున్నాడు.

'దూరంగా వుండకు పద్మా! ఉండలేను నిన్ను విడిచి. ఇలా బ్రతకలేను.'

○ ○ ○

రాత్రి పదకొండు దాటింది. పద్మజ తన యింట్లో ఓ గదిలో కూర్చుని రాసుకుంటోంది. బయట ప్రళయంగా వర్షం పడుతోంది.

"...మీరు ఎక్కడకూ వెళ్ళలేరు మధుబాబూ! నేను వున్నన్నాళ్లూ అది మీకు చేతకాదు...ఇలా ఓ రాత్రి వేళ-యింట్లో అంతా నిద్రపోతోంటే - బయట జోరున వాన పడుతూండగా -ఈ గదిలో లైటు వేసుకుని కూర్చుని మీకోయువతి, మధ్యమధ్య ఆలోచిస్తూ, ఫాలాభాగాన కలం ఆనిస్తూ ధ్యాన ముద్రలో పడిపోయి-యిలా ఉత్తరం రాస్తోందంటే అదెంత అదృష్టం? మీ అదృష్టానికి అసూయగా వుంది——

మధూ! మధూ! మీరు నాకెప్పుడు కన్పిస్తారు?అసలు కన్పించరా?

వచ్చెయ్యండిమధూ!అక్కడో క్షణంకూడా వుండద్దు వచ్చెయ్యి వచ్చెయ్యి! నీకోసం ఎదురు చూస్తూంటాను వెయ్యి కళ్ళతో. ఎప్పుడు వస్తావో రాయి. సరాసరి స్టేషన్ కి

వచ్చేస్తారు లేకపోతే ఎక్కడన్నా దిగి ఫలానాచోట దిగానని కబురుచెయ్యి. పరుగెత్తుకు వచ్చేస్తాను. ఏం మధూ! మాట్లాడవ్? ఎప్పుడు వస్తావు? రా... రా... రా..."

## 22

పద్మజ దగ్గరకె వెళ్ళిపోవాలనిపించింది మధుబాబుకు. నిజంగా అలా ఆదరిస్తుందా తనను ? తనతో ఎక్కడికైనా వచ్చేస్తుందా? అంత ధైర్యం, స్వాతంత్రం వున్నాయా ఆమెకు? ఇల్లూ, నిబంధనలూ యిఛేమీ లేవా?

"మీతో రెండు నిముషాలైన ఏకాంతంగా గడపాలి. నన్నెక్కడికైనా తీసుకుపోండి. అలాంటి అవకాశం లభిస్తుందా నాకు?" అంటుంది పద్మజ.

ఎందుకంత భయం ఆమెకు? అలాంటి అవకాశం ఎందుకు లభించదు?

అసలు తమ యిద్దరి బంధాన్ని గురించి ఏమని తలపోస్తూ వుంటుంది పద్మజ? దీనికి పర్యవసానం ఆమె కవసరం లేదా? శాశ్వతంగా ఇదే వాంఛిస్తోందా?

వెళ్ళిపోవాలని వుంది ఆమె దగ్గరకు. నిజంగా వెళ్ళిపోయేవాడే కాని యింతలో ఆమె దగ్గర్నుంచి వచ్చిన మరో

వుత్తరం అతని గుండెల్ని చీల్చింది. అతన్లో దారుణ సంక్షోభాన్ని లేపింది.

◆ ◆ ◆

"ఎందుకిలా అయింది? నేనేమిటి ఊహిస్తున్నాను?" అని పద్మజ విసుక్కుంది.

అతన్తో పరిచయం అయినప్పట్నుంచీ అతన్ని గురించి– అతని రూపాన్ని గురించి గొప్పగా ఊహిస్తోంది. అట్లా ఊహించకూడదు అని చాలాసార్లు అనుకుంది. తనుగా తను తనని వెదుక్కుంటూ వచ్చాడు. లేకపోతే అసలు యిన్ని ఆలోచన్లు, అనుభూతులు చెలరేగేవి కావేమో! అతని ఉత్తరాలు తనని మరింత ఊహాలోకంలో విసిరేశాయి. అతని పేరు గుర్తుకు రాగానే, అతని మాటలు చదువుతోంటే ఓ మధుర మనోహర రూపం మనోపథంలో సాక్షాత్కరించింది. ఎంత వద్దనుకున్నా, ఎంత తిరస్కరిస్తున్నా ఎప్పుడూ అదే సుందరరూపం, ఆ వంకెలజుత్తూ, సుందర తరళనయనాలు, తెల్లటి దేహకాంతి, ఉన్నతమైన అతని సుకుమార మూర్తి, ఆ చిలిపి చేష్టలూ, చొరవా ముఖవర్చస్సూ...

"నే ననుకున్నట్లు అతను ఎట్లా వుంటాడు?... ఇది అన్యాయం" అనుకుంది.

"అట్లా వుండకపోతే? ఒకవేళ అతను అట్లా వుండకపోతే...?"

భరించగలదా తను ? తన ఊహాస్వప్నం చెదిరి పోతుంది. గాజులా గలగల పగిలిపోతుంది.

ఎంత మంచివాడు అతను? అతనిమనస్సు ఎంత సున్నితము? అలాంటి మనస్సు చాలదా? ఎందుకు రూపంగోడవ? ఏం చేసుకుంటుంది దాంతో తను ?

మనస్సు అంగీకరించడం లేదు.

అతను వచ్చేస్తే, తాను ఆశాభంగం పొందితే, తాను దురపిల్లుతోంటే ఎవరు ఓదారుస్తారు తనని ? అబ్బ ! ఎట్లా యీ అవస్థ భరించటం? అతను వచ్చేస్తాడేమో. రాకపోతే తను వుండగలదా? వస్తే... "హా! ఏమిటి భగవాన్! నన్నింత ఊహావాసిగా ఎందుకు జన్మింప చేశావు?"

అతనికి అబద్ధం రాయాలనిపించలేదు. రాసేసింది తన మనః కల్లోలం.

♦ ♦ ♦

మధుబాబు అద్దంలోకి చూసుకున్నాడు.

"తాను అందంగా వుంటాడా ?"

జీవితంలో మొట్ట మొదటిసారిగా యీ ప్రశ్న అతి సీరియస్‌గా వేసుకున్నాడు.

జుట్టు... వంకెలూ, ఉంగరాలూ తిరగలేదు. తాను తెల్లగానే వుంటాడు. తన కళ్లు కొంచం చిన్నవి. సన్నగా, పొడుగ్గా వుంటాడు. కాస్త బలహీనంగా వుంటాడు. తన రూపాన్ని గురించి అసంతృప్తి ఏమీ లేదు. క్లాసు అమ్మాయిలందరూ తనతో మాట్లాడటానికి ఉత్సాహం ప్రదర్శిస్తారు. "నేను సెలావుండీ, సి పొజిషన్‌లో వుంటే యీ అమ్మాయి

లందర్నీ అరిచేతిలో వుంచుకునే వాణ్ని" అంటూండే వాడో మిత్రుడు. అది ప్రగల్భం కావచ్చు. తనలో ఆకర్షణ వుందా ఏమయినా? రాజ్యలక్ష్మి తనని ఏంచూసి ప్రేమించింది? అత నికి చాలామంది ప్రేమగాథలు తెలుసు. వాళ్ళందరూ బొత్తిగా చెప్పుకోదగిన వాళ్ళుకాదు వాళ్ళకు సంప్రాప్తం కాని సమస్య తనకే ఎందుకు కలిగింది? తాను ఎప్పటికీ దుర దృష్టవంతుడేనా ?

పద్మజ రాసిన ఉత్తరం అతన్ని చిత్రవధ చేస్తోంది. తనని అతీతంగా ఊహించి, ఆమె ఆరాధిస్తోంది. ఆమె ఆరా ధించేది తనని కాదు అసలావ్యక్తి భూమ్మీద లేడు. తాను వొట్టి నిమిత్త మాత్రుడు. కలలను కలిగించటానికీ, మళ్ళీ పగల గొట్టటానికి జన్మించిన దౌర్భాగ్యుడు. ఆమె తనసాహి త్యాన్ని ప్రేమించటం లేదు తనని మధురాబుగా ప్రేమించ టంలేదు ఎందుకట్లా అయింది యీ పరిస్థితి. తన ఉత్తరాలే అట్లా చేశాయా? అంత గొప్పగారాయలేదే తను. ఇంకా, ఎట్లా ఎన్ని గుండెలతో కలుసుకుంటాడామెను? తనని చూస్తే ఆమె ద్వేషిస్తుంది. అబ్బ! "యితనికా యిన్ని ఉత్తరాలు యింత యిన్స్పిరేషన్‌తో రాశాను!" అని వెలవెలపోతుంది. తనకిహ ఆత్మహత్యే శరణ్యం. ఎన్నడూ అనుకోని సమస్య. తనని అల్లుడిగా చేసుకోవాలని ఎంతోమంది తలితండ్రుల్ని తనాతహ పడేటట్లు చేసిన ఓ అబ్బాయి ఎదుర్కొంటూన్న సమస్య.

ఇంక పద్మజకు ఏ స్వేచ్ఛతో రాయగలడు తను ?

*　　*　　*

"ఈ అగ్నిపరీక్ష భరించలేను పద్మా. ఈ మంట భరించలేను"

ఆమె మళ్ళీ ఉత్తరం రాసింది. అతను జవాబివ్వలేదు. రాద్దామని ఎంతో కోరిక కలిగింది. కాని ఎట్లా...? ఎన్ని గుండెలతో.

పద్మజ మరో ఉత్తరం రాసింది.

అతను నిగ్రహించుకున్నాడు.

పద్మజకు కోపం వచ్చింది. "ఎంత అహం! అసలు మీ జాతి రక్తంలోనే వుంది యిదంతా"

ఎట్లా అర్థమవుతుంది ఆమెకు—యిట్లా గుండెలని చీల్చే వ్యక్తికి?

♦　　♦　　♦

క్లాస్‌లో అతను పరధ్యానంగా కూర్చున్నాడు. ప్రొఫెసర్ పాఠం చెబుతున్నాడు. కాసేపటికి మధుబాబు పాఠం వినటంలేదని గ్రహించాడు—అతనివంక చూసి, "మిస్టర్ మధుబాబూ" అని పిలిచాడు.

క్లాసంతా అతనివంక చూశారుగాని, అతను మాత్రం యీ లోకంలో లేడు.

"మిస్టర్ మధుబాబూ!"

ప్రక్కనున్న స్టూడెంటు అతన్ని గట్టిగా గిచ్చాడు. ఎక్కడో లీలగా వినబడినట్లయింది ప్రొఫెసర్ కంఠస్వరం.

"యస్ సర్" అన్నాడు తొట్రుపాటుతో లేచినిల్చొని.

అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. గొంతు వొణుకు తోంది.

"ఆర్ యు లిజనింగ్ టు ది లెసన్?"

మధుబాబు తలవంచుకుని "సారీ సర్"

ఆయన ఆగ్రహించ లేదు "సిట్ డౌన్. బి యటెన్టివ్?"

మరునాడు మధ్యాహ్నం మధుబాబు ఎవ్వరూ లేని చిన్నగదిలో కూర్చుని, ముందున్న బల్లమీద తల ఆనించి, ఆలోచిస్తున్నాడు... వెనక అడుగులు చప్పుడయ్యాయి.

అతనికి వినబడలేదు—అలాగే వున్నాడు.

"మధుబాబూ"

అతను ఉలిక్కిపడి లేచి నిల్చుని "యస్ సర్" అన్నాడు భయంగా.

ప్రొఫెసర్ అక్కడున్న కుర్చీలో కూర్చుని "అలా వుంటున్నావేం? హెల్త్ బాగా లేదా?" అనడిగాడు ఆదరంగా.

"అంత బాగా లేదు సార్" అన్నాడతను వినయంగా.

"ఏం?"

ఏం జవాబు చెప్పాలో తోచలేదు. తడబడుతూ "ఊరికినే నండీ..."

"మనసుకూడా బాగుండటం లేదా?"

మధుబాబు ప్రతిభుడయ్యాడు.

"గరల్ ఫ్రెండ్ ఎవరన్నా..."

ఈ క్షణాన మధుబాబు ఓ రచయిత కాదు. ఓ మానసిక పరిణతి చెందిన వ్యక్తి కాదు. ఓ పిల్లవాడు... చిన్నపిల్ల

వాడు అయిపోయాడు. ఆ ప్రొఫెసర్ వంక జాలిగా చూశాడు నీళ్ళు కార్చటానికి సిద్ధంగా వున్న కళ్ళతో.

"చెప్పు మధుబాబూ. వీలయితే ఏదయినా సలహా యిస్తాను. ఐ యామ్ యువర్ టీచర్. ట్రీట్ మి జస్ట్ లైక్ యువర్ ఫాదర్" అన్నాడాయన అభిమానం వుట్టిపడే కంఠంతో.

మధుబాబు కరిగిపోయాడు ఉద్రేకంగా, అమాయకంగా అంతా చెప్పేశాడు—ఒక్క ఊహాస్వప్నం విషయం మినహాయించి. ఆ విషయం వెల్లడి చేయటానికి—ఓ విధమైన వ్యక్తిత్వం ఆతన్ని వారించింది.

అంతా విని—ఆయన ఓ నిమిషం ఆలోచించి "ఆమెని ఎందుకు పెళ్ళిచేసుకోవు మధుబాబూ?" అని అడిగాడు.

"నాకు తెలియటల్లేదు సార్ ఏ విషయం సరిగ్గా. అది మంచిపనే ఔతుందంటారా ?"

"అంతకన్నా మంచిపని యింకేముంటుంది ? ఈసారి సెలవులకు వెళ్ళి ఆమెని కలుసుకో. ఎట్లాంటిపరిస్థితి వచ్చినా నిస్పృహ చెందకు. పట్టుదలగా మేరేజ్ చేసుకో?"

ఈ సలహాతో మధుబాబుకు కొండంత ధైర్యం వచ్చింది. ఓ విధమైన ఆత్మవిశ్వాసం కలిగింది. పద్మజ తనని గురించి ఎంతయినా ఊహించుకోనియ్యిగాక. తాను వెళ్ళి ఒక్కసారి కలుసుకుంటే, ఆమెను తనవైపు తిప్పుకో వచ్చుననే మొండి ధైర్యం కలిగింది. ఆ రోజంతా ఉత్సాహంగా

వున్నాడు. ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది. చిత్రవధ తగ్గింది.

♦ ♦ ♦

ఎక్కడకు పోతుంది పద్మజ తనకు గాకుండా? కాని సూటిగా "మనం పెళ్ళి చేసుకుందామా?" అని అడగటానికి అతని మనస్సు ఒప్పలేదు. ఉత్తరాలు రాయటం ఆపేసి, కొన్ని నెలలయాక హఠాత్తుగా వెళ్ళి ఆమెని కలుసుకుని, ఆనందంతో ఉక్కిరి బిక్కిరిచేసి, తమ వివాహ ప్రశంస తమా షాగా, కథలోని దృశ్యంలాజరగాలి. అందులో ఓ ప్రత్యే కత వుండాలి సొగసుండాలి.

"నేను మీకు యిహ ఉత్తరాలు రాయను. వాటివల్ల మీకు చాలాకష్టం, అశాంతి కలుగచేస్తున్నట్లు నానమ్మకం. మీ జీవితం నుంచి తొలగి పోదలచాను. ఎప్పటికైనాటాకే దైనా...జరిగితే నాకు తప్పకుండా శుభలేఖ పంపేస్తారు కదూ."

తమ బంధం చిత్రమైనది. ఒకసారి నువ్వనుకుంటారు; ఒక్కొకసారి మీ రనుకుంటారు.

పోస్ట్ చేసి నిట్టూర్పు విడిచాడు.

* * *

"మీ చివరి ఉత్తరం అందింది. అయితే శాశ్వతంగా సెలవు పుచ్చుకో దలిచారన్నమాట. ఈ ప్రపంచం మీద నాకు నమ్మకం నశిస్తోంది. ఎంత అల్పులు మనుష్యులు. ఇంత

సులభంగా బంధాలు తొలగించుకోవటానికి...ఎంత కఠిన త్వం ! ఇన్నాళ్ళ పరిచయం, స్నేహం...అంతా ఒక్క క్షణంలో సఫా. మరోమారు చెబుతున్నాను. మీ ఉత్తరాల వల్ల నాకు అశాంతీ, యిబ్బందీ ఏమీ లేవు. అదంతా మీ భ్రమ. సరే కథ ముగింపు వచ్చింది. కారణం లేని ముగింపు. నాకు యీ భూమ్మీద ఒక జత, లోకానికి అర్థం కాని ఒక ఉజ్జీ వున్నాడనుకున్నాను. అతనుకూడా అందరితో పాటే అయి పోయినాడు. ఎప్పుడయినా సన్నజాజి పువ్వులు కనిపిస్తే నైనా నేను జ్ఞాపకం వస్తానా? మీకు గులాబీలు యిష్టం కదూ! రోజూ నిద్ర లేవగానే కిటికీలోంచి మా తోటలోని గులాబీ మొక్క కేసి చూడటం నా అలవాటు. దానికి రోజూ ఓ పువ్వు పూస్తోంది. అలాగే ఎంతోసేపు దాన్ని తిలకిస్తూ వుండి పోతున్నాను. ఎవర్నీ కోయ నియ్యటం లేదు. మీరు నాకు రాసినా, రాయక పోయినా నా పుట్టినరోజుకు మీ ఆశీస్సులు అందాలి. ఇహ సెలవా? ఎట్లా సెలవు తీసుకోవటం? బై బై చెప్పటమా...? టాటా...అని చేతిరుమాలు ఊపటమా? లేక మన హిందూ పద్ధతిలో మోకాళ్ళమీద వొంగి-సాష్టాంగ...ఏం?

అవును గాని నా శుభలేఖ మీకు అందదు. ఎందుకంటే అది అచ్చయి అప్పుడే మూడేళ్ళయి పోయింది-అంటే నా పదిహేనేళ్ళ వయస్సులో. అర్థమవుతోందా? నేను పెళ్ళ యినదాన్ని.

మరి...యింతే"

♦ ♦ ♦

ప్రపంచం పెళపెళమని విరిగి పడింది. వెయ్యికంఠాలు వెక్కిరించాయి. చీకటి నల్లగా నోరు తెరిచి నవ్వింది. భూమి బ్రద్దలైంది.

అతని గుండె పగిలిపోయింది.

ఆ రాత్రి... గదిలో అటూయిటూ తిరుగుతున్నాడు... పిచ్చెక్కినట్లు

రెండోసారి తన జీవితం చిరిగి పోయింది నిర్దయగా. ఎన్ని ఆశలు ! ఎన్ని కలలు !!

ఎటుచూస్తే అటు చీకటి.

"ఎంతపని చేశావు పద్మా ! ఎంతపని చేశావు ? ఇన్నాళ్లూ యీవిషయం ఎందుకు నాకు చెప్పలేదు? ఇంత అన్యాయం ఎందుకు చేశావు? నీకు కావలిసింది వేరు, నాకు కావల్సింది వేరు. చెప్పు పద్మా ఇదంతా అబద్ధమనీ, వాట్టి తమాషాకనీ, అంతా గమ్మత్ అనీ చెప్పు. లేదు పద్మా నువ్వలా చెప్పవు. అంతా నిజం. నాకు తెలుసు... ఈ ఉత్తరంతో యింత విషం పంపించకపోయావా? పద్మా! పద్మా! పద్మా!!!

## 23



వేసవి సెలవులు యిచ్చారు. మధుబాబు యింటికి వచ్చాడు. అతని తల అంతా ప్రస్తుతం శూన్యంగా వుంది. అభిప్రాయాలూ లేవు, అభిరుచులూ లేవు బయటకు కూడా కదలటం మానేశాడు ఉమాపతి తరుచు వచ్చిపోతున్నాడు. అతనీమధ్య నవలొకటి రాశాడు–పొదుపు అనేదాన్ని ప్రాథమిక ఉద్యమంగా తీసుకున్నాడు. మధ్యతరగతి వాళ్ళ బాధలకూ, కష్టాలకూ కారణం–ఎక్కువ వాళ్ళ దుబారానే అని, అర్థంలేని వంశానుగత ఆడంబరాలేనని విమర్శించుకుంటూ వచ్చాడు. పండుగలూ, పెళ్ళిళ్ళూ, సమర్తలూ వీటిలో ఎంత డబ్బు వృధాగా, అవివేకంగా ఖర్చు పెడతారో సహేతుకంగా నిరూపించసాగాడు. సీరియల్‌గా వస్తోన్న అతని నవలకు మంచి ప్రచారం వచ్చింది. వంటింట్లోంచి బయటకు రాని స్త్రీ శిరోమణులని కూడా ఆకర్షించసాగింది.

ఉమాపతి యింగ్లీషులోనూ, తెలుగులోనూ కూడా బహుముఖంగా చదవలేదు. కాని తనకు అవసరమైనంత వరకూ క్షుణ్ణంగా చదువుతాడు. తెలియని సంగతి గురించి అసలు రాయడు. దాని జోలికిపోడు. స్వతహాగా కొన్ని అభిప్రాయాలు వున్నాయి జీవితాన్నిచూసి కొన్ని ఏర్పరుచుకున్నాడు. నిశితంగా, చురుగ్గా ఆలోచించగలడు.

మధుబాబు ఏమీ రాసే స్థితిలో లేడు. ఒకప్పుడు రాశాడా ఇలా? అన్న సంశయం వచ్చేటంతగా శూన్యస్థితికి వచ్చాడు. రాద్దామన్న ఉత్సాహం, ఏమీ యిన్స్పిరేషన్ లేవు. పత్రికలవాళ్ళూ, పబ్లిషర్లూ అడుగుతూనే వున్నారు. అతను మౌనంగా ఊరుకున్నాడు

పద్మజ పుట్టినరోజు అతనికి జ్ఞాపకం వుంది. ఆ రోజు ఆమెకు అందంగా గ్రీటింగ్స్ పంపించాడు, అచ్చు వేయబడిన గులాబీ పువ్వులు. కాని ఆమెకు సకాలంలో అందినట్లు లేదు. విశాఖపట్నం ఎడ్రెస్కు ఉత్తరం రాసింది. అది బెజవాడకు రిడైరెక్ట్ చేయబడి వొచ్చింది.

“...రాత్రి తొమ్మిది గంటలైంది. వచ్చిన అతిథు లందరూ వెళ్ళిపోయారు. కొత్తబట్టలతో, నేను ఒక్కదాన్ని కుర్చీలో ఒంటరిగా అలిసిపోయిన శరీరంతో మిగిలిపోయాను. ఈరోజు నీదగ్గర్నుంచి ఉత్తరంవస్తుందని ఎంతో ఆశించాను. కాని నువ్వెంత కఠినుడివి? బుద్ధదేవుడికి వారసుడిలా, నాప రాయిలా వుండిపోయావు. నన్ను వెదుక్కుంటూ వచ్చిందీ నువ్వే. దూరంగా పోయిందీ నువ్వే. ఎంత స్వార్థం నీకు? నాకు పెళ్ళయినంత మాత్రంచేత నన్ను దూరం చేసుకోవా లని వుందా? అయితే నన్నుగురించి మరో విధంగా ఆశించా వన్నమాట. అంతేనా? మరేమీ లేదా? ఎంతకోపం వస్తోంది నీ మీద? ప్రపంచానికి అతీతులమై, ఒకరిపట్ల ఆసక్తిలేని ఆకర్షణ... యివన్నీ నీలో లేవన్నమాట. నేను నీనుంచి ఏమీ

కోరలేను. నువ్వూ అంతే ననుకున్నాను. అసలు యిది మీ రక్తంలోనే వుంది..."

మధుబాబు వికల మనస్కుడయాడు. దీనికతను సరియైన సమాధానం యివ్వగలడు. ఒకే కోణంనుంచి ఆలోచిస్తోంది పద్మజ. కాని ఎందుచేతో ఆమె ఎన్నిమాటలన్నా అతనికి కోపం రావటంలేదు. అందుకని సరికిసరి ప్రత్యుత్తరం చెప్పి ఆమె అన్యాయాన్ని ఆమెకు తెలిసేటట్లు చెప్పలేక పోతున్నాడు. తన జీవితంలో ఎటువంటి గండి ఏర్పరిచిందో ముఖాన అనెయ్యలేకుండా వున్నాడు. ఇది తనలోపంగా, తను చేసేవన్నీ అన్యాయాలుగా భావిస్తుందేమో పద్మజ. తాను ఆమెని గురించి మరోవిధంగా ఆశించాడా? అట్లా ఆశించేపక్షంలో రూపం తెలియని ఆమెను, వందలమైళ్ళ దూరంలోవున్న ఆమెనే ఎన్నుకోవాలా? తనకు యిక్కడ అవకాశాలు లేవా? తనకు చేతకాదా? తను పిరికివాడా? ఎట్లా తెలుస్తుంది యీ సత్యం పద్మజకు? తన సర్వస్వం తెలిసి, తన లోపాలూ, గుణాలూ అన్నీ తెలిసి తనకోసం ఆరాటపడే జీవులందరు యిక్కడ వుండగా, ఆమెపెట్టే చిత్రవధను సహిస్తూ, చివరకు ఆమెని కలుసుకోవటానికే భయపడి, ఆమె దయమీంద ఆధారపడే స్థితికి వచ్చాడే తాను. ఇదంతా అర్థం చేసుకుంటుందా పద్మజ? "నిన్ను అట్లా ఊహించాను. ఇట్లా ఊహించాను" అని ప్రతిసారీ దాన్ని గురించే నోక్కి నోక్కి రాసి, తాను ఆ ఊహించుకున్న రూపాన్నే ఆరాధిస్తున్నానని రాస్తే భరించగలదా పద్మజ?

బ్రతగ్గలదా? ఆమె రూపాన్ని గురించి ఆలోచనకు తావియ్య కుండా, యిప్పుడే కాదు, ఎప్పుడూ — చచ్చిపోయేదాకా కూడా ఆమెని ఆరాధిస్తూ వుంటాడని ఆమె ఎలా తెలుసు కుంటుంది?

ఇవన్నీ ఆమెకు చెప్పటం యిష్టంలేదు అతనికి. జవాబు యివ్వకుండా ఊరుకున్నాడు.

అతని నవలకు వచ్చిన బహుమానాన్ని సాహితీసమితి వాళ్ళు హైదరాబాద్‌లో యివ్వటానికి నిర్ణయించి తేదీ, పెద్ద ఎత్తున జరిగే ఆ సభ వివరాలూ తెలియజేశారు. హైదరా బాద్‌లో జరుగుతుందా? అయితే తాను వెళ్ళడు అక్కడికి. వెళ్ళలేడు.

తండ్రి వెళ్ళమని బలవంతం చేశాడు. అసలు వెళ్ళ ననటానికి కారణం ఆయనకు బోధపడలేదు. "నాకు వెళ్ళా లని లేదండీ" అని ముభావంగా ఊరుకున్నాడు మధుబాబు. విశ్వనాథంగారు యింకేమీ అనలేకపోయారు. ఫంక్షన్ సరిగా రెండురోజు లుందనగా తనకు జ్వరంగా వుందని రాలేక పోతున్నానని వైర్ యిచ్చాడు మధుబాబు తనమీద తనే కసి తీర్చుకున్నట్లు అతనికి తృప్తిగా వుంది.

ఒకరోజు తల్లి మళ్ళీ పెళ్ళిమాట ఎత్తింది.

పెళ్ళి గురించి సీరియస్‌గా ఆలోచించే అవసరం మళ్ళీ వచ్చింది మధుబాబుకు. పెళ్ళి అనేది జీవితానికి అందం, సంపూర్ణత్వం, సుఖం యివ్వటానికా? లేక ఓ మామూలా?

పెళ్ళి చేసుకోనివాడి జీవితం అస్పష్టంగా, ఓ గురి లేకుండా వుండేమాట వాస్తవమే, కాని చేసుకుని యీలక్ష్యం సాధించగలరా? ఈ భూమ్మీద చాలామంది ఆలోచన, లక్ష్యం లేకుండా బ్రతుకుతుంటారు. వయసురాగానే పెళ్ళి చేసుకోవటం, సంసారాన్ని యీదటం, పిల్లల్ని కనటం, అవస్థల పాలవటం-యిదంతా వాళ్ళకు చిత్రమనిపించదు. ఒకవిధంగా ఆలోచించటం చేతకాని వాడిజీవితం సుఖపూరితంగా వుండవచ్చు. అది వాడి అదృష్టం. కాని అన్నీ వుండికూడా దురదృష్టవంతులైన వారుంటారు, మధుబాబులాంటివాళ్ళు. ఇన్ని ఆలోచన్లు, యింత మృదుత్వం అతనికి ప్రసాదించబడటం లోపమే కావచ్చు. కాని దానికి యింత పెద్దశిక్షా? ఎంతో నుంచి అమ్మాయిల్ని, స్కూళ్ళలో, కాలేజీల్లో, యిళ్ళలో, రోడ్లమీద అతను చూస్తూనే వున్నాడు. వీళ్ళలో ఎవరూ అతని హృదయాన్ని కదపలేదు. తల్లిపోరు పడలేక కొన్ని సంబంధాలు చూశాడు. పెళ్ళిచూపులతతంగం అతనికి నవ్వు వచ్చింది. ఏమిటీ పిల్లలు? ఎట్లా వీళ్ళనుంచి ఒకర్ని ఎన్నుకోవటం? అది పెళ్ళి అనబడుతుందా? అసలు లోకంలో యింతకంటే వున్నతమైన వాళ్ళులేరా? వీళ్ళని భార్యగా ఊహించటమే కష్టంగా వుంది. తను గొప్పవాడని కాదు. తనని కదిలించే మనిషి అవతలివైపు లేనప్పుడు, తన పరిధుల్ని ఎంతకుంచించుకున్నా, కుదించుకున్నా, దానికి తులతూగనప్పుడు ఎట్లా ఒకర్ని తనతో తెచ్చుకోవటం. తన స్నేహితు లందరికి వివాహాలు జరుగుతున్నాయి. వాళ్ళలో

కొందరికి మంచి భార్యలే దొరికారు. ఇది ఎట్లాసంభవమైంది? వాళ్ళు ఎక్కడినుంచి వచ్చారు? ఒకవేళ పద్మజని దృష్టిలో పెట్టుకుని తాను యిలాంటి విపరీతపు ఊహాలు చేస్తున్నాడా? అలాంటివాళ్ళు కోటికి ఒక్కరుకూడా వుండనిమాట నిజమే. కాని ఆమె పెనిమిటికి ఆమె ఎలా లభించింది? అతనూయిట్లా పెళ్ళిచూపులుచూసి పిల్లను ఎన్నుకున్నవాడేగా... చక్కా ఓ చిన్న పిల్లను తెచ్చి ఆపిల్ల; బుల్లిబుల్లిపాదాల్తో, పసుపు పారాణితో అటూయిటూ యింట్లో చూడాలని ఒక్లి ముచ్చట. అతనికి నవ్వు వస్తోంది. తాను మానసికంగా ఎంత ఎదిగాడో, అట్లావికసించని భావాలుగల పిల్లని, యీపరిణతి చెందిన దశలో భరించటం ఎంతకష్టమో ఆమెకు ఎట్లానచ్చ జెప్పగలడు?

అసలతనికి పెళ్ళాడాలని లేదు అది ఓ మధురబంధం కాక, వొట్టి నిబంధన అయితేఅసలు భరించలేడు. తప్పించు కోవటమెలాగు? అన్నీ తిరస్కరిస్తున్నాడు. డాంబికంగా కాదు—నిజంగా నచ్చకే. అబ్బా! పద్మజ తనని యిన్ని బాధలు పడమని ఎందుకు శాసించింది?

## 24

వేసవి సెలవులు గడిపి మధుబాబు మళ్ళీ విశాఖ పట్నం వొచ్చేశాడు. ఈ మనుషుల మధ్య గడపటం చాలా దుస్సహంగా వుంది. మనం అనుకున్నట్లు మనల్ని ఏమాత్రం బ్రతకనియ్యరు యీ మనుషులు. వొంటరిగా వుందామని పిస్తుంది. ఎవడో వస్తాడు, ఏదో మాట్లాడతాడు. ముభావంగా వున్నా అర్థం చేసుకోడు. ఎంతకీ పోడు. మనం ఏమీ అన లేం. సభ్యత అడ్డొస్తుంది. ఒక్కోసారి ఏడుపుకూడా వస్తుంది— విసుగు, కోపం భరించలేక.

అసలు సున్నితత్వం మనిషికి ఎక్కువగా వుండకూ డదు. అడుగడుక్కీ సమస్యలు ఎదురౌతూంటాయి. గట్టిగా నవ్వితే భయం, ఎక్కువగా మాట్లాడితే భయం. నిద్రలేచి నప్పటినుంచీ మళ్ళీ నిద్రపోయేదాకా అన్నీ యిబ్బందులే. ప్రతిదాన్ని గురించీ సంఘర్షణ. తర్జన భర్జన. హోటల్లో భోజనం చేస్తూంటే ముద్ద నోట్లోకిపోదు. ప్రక్కన తింటున్న వాడు నోటితో అసహ్యంగా చప్పుడు చేస్తుంటే—అదో చికాకు. మరి వీటికి అలవాటు పడాలేడు; భరించనూ లేడు.

అతనికి భోజనం చేశాక కిళ్ళీ వేసుకునే అలవాటుంది. అతని ముఖం చాలా సుకుమారంగా, లేతగా వుంటుంది. నాలికా, పెదాలు యిట్టే పండుతాయి. అట్లా వుండటం అత

నికి చాలా యిష్టం. కిళ్లీకొట్టు వాడితో అతనికి బాగా పరిచయం ఏర్పడింది.

"అట్లా వుంటున్నారేం బాబూ యీమధ్య?" అవడిగాడు కిళ్ళీకొట్టు రాఘవులు ఓ ఉదయం.

"వంట్లో అంత బాగుండటం లేదు... రాఘవులూ— ఓ పని చేసిపెడతావా?"

"చెప్పండి"

"నాకు యీ గదుల్లో, యిళ్ళలో వుండాలని లేదు. సౌకర్యంగా కూడా లేదు. హాస్టల్లోకూడా వుండలేను. ప్రశాంతంగా వుండాలనిపిస్తోంది. ఎక్కడన్నా మంచి పాక వేసుకుని వుందా మనిపిస్తోందోయి."

"తమరు పాకలో వుంటారా బాబూ?" అని రాఘవులు ఆశ్చర్యపడ్డాడు.

"తప్పేముంది? నాకది చాలా యిష్టం. తప్పకుండా ఎక్కడన్నా చూడు రాఘవులూ"

కిళ్ళీ దుకాణంవాడు "ఈ పేట తిన్నగా యిట్లాపోతే వూరి బయటగా నాకో నాలుగొందల గజాల స్థలం వుంది బాబూ. గజం రూపాయి కాడికొస్తే ఆమధ్యతీసుకున్నాను. లేబరోళ్లు, అళ్లూ ఆ చుట్టుప్రక్కల వున్నారుగాని మరీ దగ్గరగా ఏంలేరు. సందడి ఏమీావుండదుకూడా. అక్కడ పాకేసుకుంటే బాగుంటుంది బాబూ" అన్నాడు కొంచం ఆగి.

'అయితే ఆ స్థలం ఎప్పుడు చూద్దాం?" అన్నాడు మధుబాబు ఆత్రంగా.

'రేపు ఆదివారం కదు బాబూ! రేప్రొద్దున దుకాణాని కొచ్చేముందు మీ రూమ్‌కాడి కొస్తాను. అక్కడినుంచి ఇద్దరం కలిసెల్దాం'

'మరి నీకేమీ అవసరంలేదా స్థలం?'

'అక్కర్లేదు బాబూ. యెప్పుడన్నా పనికొస్తదని కొన్నాను. యిప్పుడు నేనుంటున్న ఇల్లుచాలు నాకు'

మరునాడు మధుబాబు అతన్తోకూడా వెళ్లి ఆ ప్రదేశం చూశాడు. చుట్టుప్రక్కల ఎక్కడా ఇళ్ళులేవు. అక్కడక్కడ చెట్లు, దూరంగా కనిపించే కొండలూ, కనిపించీ కనిపించనట్లున్న సముద్రం... ఈ ఏకాంత ప్రదేశం చూసి అతను పరవశుడయ్యాడు.

'తప్పకుండా ఇక్కడే వుంటాను రాఘవులూ' అన్నాడు ఉత్సాహంగా.

'మీ యిష్టం బాబూ'

'ఓ మంచి, అందమైన పాక వేసుకోటానికి యెంతవుతుందంటావు?'

రాఘవులు ఆలోచించాడు. 'మట్టిగోడలైతే మీరుండలేరు బాబూ! ఇటుకతోనే కట్టించాలి. అబ్బాయిగారికి చుట్టూ వరండాలు చెక్క దడి కడితేనేగాని బాగుండదు. మరి మొత్తం రెండుగదులైనా వుండాలా? మట్టినేలయితే మీ

కనహ్యంగా వుంటుంది. రాళ్ళు పరిపించాలి. బాగా వుండా లంటే - మొత్తం అంతా కలిసి ఏడానిమిది వందలు అవు తుంది బాబూ'

పుస్తకాలు రాయగా వచ్చినదాంట్లో వెయ్యి రూపా యలదాకా వున్నాయి మధుబాబు దగ్గర. 'అయితే మునిసి పాలిటీ దగ్గర పర్మిషన్ తీసుకుని, రెండు మూడు రోజుల్లోనే పని ప్రారంభించుదాం రాఘవులూ. ఇవాళంతా ఆలోచించి ఎలా వేస్తే బాగుంటుందీ, ఏమిటీ అదంతా నే చెబుతాను. దగ్గరవుండి పని చేయించాల్సిన వాడివి నీవు. ఈ సరంజామా కొనటం, పనివాళ్ళూ అదంతా నాకేం తెలియదు. నువ్వే చూసుకోవాలి కావల్సిన డబ్బు నేనిస్తూంటాను. ఏం ?' అన్నాడు ఉత్సాహంతో ఊగిపోతూ.

'స్వంతపనిలా చేయిస్తాను బాబూ!'

ఆ రాత్రంతా మధుబాబు తన కొత్తయింటినిగురించి ఆలోచించాడు. తమ వూళ్ళో ఐ. ఎల్ టి. డి కంపెనీవాళ్ళు వేసుకున్న ఇళ్ళు గుర్తుకు వచ్చినై చుట్టూ తోటకు స్థలం వుంచి మధ్యలో చిన్న పాక...అది తాటాకులతో గ కుండా రెల్లుతో కప్పిస్తే యింకా అందంగా వుంటుంది. ప్రహారీకి బదులుగా వెదురుకర్రలు ఓ డిజైన్‌లో వొంచి,ఓ క్రమంలో కట్టించాలి. రెండు గదులు చాలు. ఓ ఆశ్రమంలాగానూ వుండాలి; ముద్దుగా ముచ్చటగానూ వుండాలి. యిలా కలలు కంటూ నిద్రపోయాడు.

♦ ♦

రోజూ సాయంత్రం అయేసరికి హాస్పిటల్ నుంచి సరాసరి తన కొత్తయింటి దగ్గరకు పోయేవాడు మధుబాబు. రాఘవులు కిల్లీకొట్లో తన కొడుకుని కూర్చోబెట్టి దగ్గరుండి శ్రద్ధగా పని చేయిస్తున్నాడు. ఊహించిన ప్రకారం, కోరిక ప్రకారం ఈ చిన్నిపాకను అందంగా మలుచు కుంటున్నాడు మధుబాబు. కోయంబత్తూర్‌లో ఓ సినిమా ప్రొడ్యూసర్ అద్భుతమైన ఓపాక అతి సౌకర్యంగా అమర్చుకున్నాడని ఆ మధ్య బెజవాడలో కలిసిన ఓ సినీ రచయిత మాటల సందర్భంలో చెప్పాడు. ఆవర్ణన దృష్టిలో వుంచుకుని పాకను తయారు చేసుకుంటున్నాడు మధుబాబు క్లుప్తంలో. రాఘవులు చాలా జాగ్రత్తయిన మనిషి. డబ్బు దుబారాగాకుండా చూస్తున్నాడు.

నెలరోజులు పూర్తిగా గడవకుండానే పాక పూర్తయింది మొత్తం ఖర్చు వెయ్యిరూపాయలదాకా అయింది. కాని అతను అనుకున్నట్లు తయారవటంవల్ల చాలా తృప్తిగా వుంది. రాఘవులుకు స్థలానికి ఆ సంవత్సరపు అద్దెక్రింద కొంత డబ్బు ఇచ్చాడు. ఓ సాయంత్రం తన సామాన్లు తీసుకుని అందులోకి వొచ్చేశాడు. ఈ విషయం యింటో తెలియనివ్వలేదు. తెలిస్తే తప్పకుండా బాధా, గాబరా పడతారు. కొత్తగా ఇంకో ఇంటోకి మారానని ఎడ్రెస్ ఇచ్చాడు.

కొత్తగా, వికాసంగా వుంది ఇక్కడ. సాయంత్రం ఆరున్నర, ఏడు అయేసరికి మనుషుల సందడి పూర్తిగాసన్నగిలిపోతుంది. మళ్ళీ బొత్తిగా నిర్జనమైన ప్రదేశమూ కాదు.

ఏకాంతంగా చదువుకోవటానికి కావలసినంత అవకాశం వొచ్చింది. గోపకు బుద్ధుడు వివేకానంద, పరమహంస ఫొటోలు తెచ్చి తగిలించాడు. ఈవేడు చదువంత కష్టంకాదు. కోర్సు కంతటికీ కలిపి ఇదే శాస్త్ర సుఖవిశ్రాంతులు లభించే సంవత్సరం కాబట్టి, ప్రొఫెసర్లుకూడా స్టూడెంట్లను అంత ఒత్తిడి చెయ్యరు.

రకరకాల పూలమొక్కలు తెప్పించి తనకు నచ్చిన క్రమంలో నాటాడు ఓ సన్నజాజి మొక్క నాటాడు దానికి పద్మ అని పేరు పెట్టుకున్నాడు. ప్రక్కనే మరో గులాబీ మొక్క.

♦ ♦ ♦

జీవించటంకోసం మనుషులు పడే తహతహను అర్థం చేసుకుంటున్నాడు మధుబాబు. అందంగా బ్రతకాలని నిరంతరం తపించేవాళ్ళ జీవితాలు కృత్రిమంగా గడుస్తున్నాయి. 'అలా బ్రతకాలి' అని తాపత్రయ పడటంలోనే తెల్లారి పోతోంది వాళ్ళబ్రతుకు. అతీతంగా జీవిస్తున్నామన్న భ్రమ తప్ప సహజమైన సుఖశాంతులు వుండవు. అంతా అయి పోయాక, జరావస్థలో సామాన్య మానవుడ్ని చూసి అసూయ పడటం ప్రారంభిస్తారు. తమకు దక్కని నిజజీవిత సంఘటనల్ని చూసి ఖేదంలో మునిగిపోతారు... అదీగాక ప్రతివాడిలోనూ ఓ ప్రత్యేకత చూడగలుగుతున్నాడు మధుబాబు. లారీడ్రైవర్లో, కాలేజి ఎటెండర్లో, రిక్షాలాగే వాడిలో వివిధ

ఆత్మవిశ్వాసాలు, చెక్కుచెదరని వ్యక్తిత్వాలు కనిపిస్తు న్నాయి. ఓ సహజగుణం, ఆకర్షణ చూస్తున్నాడు. అదీకాక ఓమనిషిని పూర్తిగా అర్థం చేసుకున్నామను కోవటం ఒట్టి భ్రమ అన్న నిశ్చయానికి వచ్చాడు. ప్రపంచంలో ఏ జీవి, మరో జీవికి — ఎంత ప్రాణస్నేహితుడు, అంతకుమించిన వాడైనాసరే తనని తాను బహిర్గత పరుచుకోడు. పూర్తిగా భూమిన్నారవున్న ప్రతివాడికీ యితరులకు చెప్పలేనివీ, చెప్ప కూడనివీ కొన్ని వుంటాయి ఆ కాస్త దాచి మిగతాదంతా మనస్ఫూర్తిగా చెప్పేస్తాడు. ఆ కాస్త రహస్యంగా వుంచు కోని మనిషంటూ సృష్టిలో లేడు. రాత్రిళ్ళు వంటరిగా అలా చాలాదూరంవరకూ పోయి నడిచి వస్తూండేవాడు మధుబాబు. ఉదయం నాలుగున్నరా, అయిదుకల్లా లేచి వాహ్యాళికి పోవటం అలవాటు చేసుకున్నాడు. ఇంతవరకూ దేశంలో చాలామంది సోమరిపోతులున్నారన్న నమ్మకం వుండేది. ఇప్పుడా నమ్మకం సడలిపోసాగింది. చేతినిండా పని వుండి, చేసుకోవటానికి తాపత్రయపడే వాళ్ళని చూసి'ఇంత సిన్సియర్‌గా పనిచేసే వాళ్ళున్నారా ?' అని నివ్వెర పోతూండేవాడు. ఎంత రాత్రప్పుడు వీధిలోకి వెళ్ళినా తలు పులు మూసుకుని బట్టలు కుడుతోన్న టైలరో, యిస్త్రీ చేసుకుంటూన్న లాండ్రీవాడో, కమ్మరివాడో కనిపిస్తూ వుండేవాళ్ళు. జీవితంలో స్థిరపడ్డ ప్రతివాడూ డాక్టరుగానో, యింజనీరుగానో, ప్లీడరుగానో, వ్యాపారస్థుడుగానో తనపనికి లోపం చెయ్యకుండా ప్రయత్నిస్తున్నాడు. సోమరిపోతు లెవ

నైనా వుంటే, సోమరితనం వుంటే అది విద్యార్థి దశలోనే అని గ్రహించాడు మధుబాబు.

♦ ♦ ♦

ఒక సినిమా కంపెనివాళ్ళు అతను రాసిన నవలనొకదాన్ని సినిమా తీయటానికినిశ్చయించుకున్నామనీ, హక్కులు కొనదలిచామనీ రాశారు యిలాంటి సంఘటనలు చూసి ఆశ్చర్యపడే స్థితిలో లేడు మధుబాబు. తను రాసిన కథ తెరమీద కెక్కితే సంతోషమే. కాని అతను ఎందుచేతనో వ్యామోహితుడు కాలేదు. ఈ అవకాశంకోసం చాలా మంది అర్రులుచాస్తూ వుంటారని అతనికి తెలుసు. తాను ఆ ఫీలింగ్‌కి అతీతుడైనట్లు భావించ లేదుగాని - భుజం లెగురెయ్యలేదు. వాళ్ళు టరెమ్స్ అడిగారు. తనకు తోచింది అడుగుతూ అతను జవాబు వ్రాశాడు. గట్టిగా స్థిరపరుచుకున్నాక, మళ్ళీ రాస్తామనీ, యీలోగా ఎవరికీ మాటఇవ్వవద్దనీ రాశారు వాళ్లు.

కొత్తగా ఏమయినా రాయాలని పిస్తోంది మధుబాబుకు. మళ్లీ కథ లే! కథలు రాయబుద్ధి కావటం లేదు. ఒకే ఒక వ్యక్తిని వివిధకోణాలలో, జీవితం విసిరేసిన వివిధ దశలలో చిత్రించాలని ఉబలాట పడసాగాడు. అతను కాలేజీలో వేసిన నాటకం ఒకసారి జ్ఞాపకం చేసుకున్నాడు. అది అచ్చుకాలేదు. ఆ ప్రయత్నం కూడా చేయలేదు తను. ఆ ప్లాట్‌తో, కొత్త పోతులతో మరో నవల రాయటానికి పూనుకున్నాడు.

# 25

కొన్ని నెలలు గడిచి పోయాయి. ఒకరోజు మధు బాబుకు చిత్రమైన ఉత్తరం వచ్చింది మద్రాసునుంచి.

చినబాబూ !

నే నెవర్నని ఆశ్చర్యపడుతూ వుంటావు. నీ చిన్నతనాన అక్కయ్యతో కలిసి బడికిపోతూంటే దారిలో పెంకుటింటోంచి ఓ స్త్రీ మిమ్మల్ని పిలిచి, కబుర్లుచెబుతూ ఉండేది గుర్తుందా? ఆ రజనిని నేను. సినిమా లోకంలో ప్రవేశించాక శైలజగా మారిపోయాను. నువ్వు సినిమాలు చూస్తుంటావా? నన్నెప్పుడైనా గుర్తుపట్టావా? ఇందులోకి వచ్చేముందు తప్పనిసరిగా నేను చదువు నేర్చుకోవల్సి వచ్చింది. ఎప్పుడయినా కాలక్షేపానికి పుస్తకాలు చదువుతూంటాను. ఈ మధ్య మా సినిమా వ్యక్తుల్లో ఒకరిదగ్గర నీ నవల చూశాను. వొట్టి పేరునిబట్టి అయితే గుర్తుపట్టలేక పోయేదాన్నిగాని, వెనక నీ ఫొటో వేశారు. ఎవరబ్బా అని చాలాసేపు ఆలోచించాను. నువ్వు మనసులో మెదిలావు. ఆ రాత్రికి రాత్రి నీ పుస్తకం చదివేశాను. యెంత బాగుందనుకున్నావు? అవును గాని యిన్ని విషయాలు యీలేత వయస్సులో యెలా తెలుసుకున్నావు? నువ్వు నాకంటే వయస్సులో మూడు నాలుగేళ్లు చిన్న. మానసికంగా ఎంత ఎదిగిపోయావు? నీ మిగతా పుస్తకాలుకూడా చదవాలనిపించి, అన్నీ తెప్పించి

చదివాను. గొప్పగా వున్నాయి. కొంతమంది సినిమా తీద్దా మనుకుంటున్నట్లు వినికిడి. అవునుగాని నిన్నెందుకో చూడా లనిపిస్తోంది. కారణం తెలియదు. కాని తప్పకుండా కలుసు కోవాలి. నేను అక్కడికి రాలేనుకదా. ఏమీ అనుకోకపోతే నువ్వు యిక్కడకు ఒకసారి రావూ? త్వరగా రావాలి. సమ యానికి నీదగ్గర డబ్బు వుంటుందో, వుండదోఅని మూడొం దల రూపాయలకు డ్రాఫ్టు పంపిస్తున్నాను. అన్యథా భావిం చకు సుమీ. నీకు యిష్టం లేకపోతే తిరిగి తీసుకుంటాను. ప్లేన్‌లో వచ్చెయ్యి. ఎప్పుడువస్తున్నావో రాస్తే కారు తీసు కుని ఏరోడ్రోమ్‌కు వస్తాను. ఎదురుచూస్తూ వుంటాను

శైలజ

అతను విస్మితుడయ్యాడు. రజని తనని యింతకాలం ఎలా గుర్తుపెట్టుకుంది? ఇలాంటి ఉత్తరం ఆమె దగ్గర్నుంచి వస్తుందని కలలోకూడా అనుకోలేదు. గతరెండు సంవత్సరాల నుంచీ చాలా సినిమాలలో నటించింది రజని. ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించుకుంది కూడా. ప్రజలంతా బ్రహ్మరథం పడుతున్నారు.

"వెళ్ళటమా? మానటమా?" అని ఆలోచించాడు. వెళ్ళకపోవటానికి కారణం ఏమీ కనబడలేదు. నాలుగయిదు రోజుల క్రిందటే థర్డియర్ పరీక్షలుకూడా అయిపోయినై. ఇవాళో రేపో యింటికి పోదామనుకుంటున్నాడు. మొదట ఆమె దగ్గరకు వెళ్ళవచ్చు. కాని వెడితే ఏం మాట్లాడ తాడు...? చివరకు ఏమయినా వెళ్ళటానికే నిశ్చయించు

కున్నాడు. ఈ డ్రాఫ్టు స్వీకరించటమా? మానటమా; ప్రస్తు తం చేతిలో డబ్బేమీ లేదు. ప్లేన్‌లో వెడితే చాలా ఖర్చవు తుంది.

ఆ రోజు శుక్రవారం. ఆదివారం బయల్దేరి ప్లేన్‌లో వస్తున్నానని శైలజకు ఉత్తరం రాశాడు. బ్యాంక్‌కు వెళ్ళి డ్రాఫ్టు మార్చి డబ్బు తెచ్చుకున్నాడు.

* * *

మద్రాస్ ఏరోడ్రోమ్‌లో మధుబాబు దిగాడు. ఫుల్ సూట్‌లో వున్న అతని వున్నతమైన మూర్తి శైలజకోసం అటూయిటూ అన్వేషిస్తూన్న నేత్రాలతో చూడసాగింది.

సూర్యరశ్మిలో జిగజిగ మెరిసిపోతున్న దుస్తుల్లో, కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుని, చిరునవ్వుతో శైలజ ఎదురుగా వచ్చింది. ఆమెని గుర్తుపట్టి అతను చిన్నగా నవ్వాడు. అత నికి కొంచం సిగ్గు వేసింది.

"మై గాడ్. ఎంతఎదిగావు నువ్వు? సినిమా హీరోలా వున్నావు. ఇంకా కొంచం వళ్ళువస్తే సిపర్సనాలిటీ ముందు ఎవరూ పనికిరారు" అంది ఆమె.

"విలన్‌గా బాగా పనికివస్తానుకదూ" అన్నాడు మధు బాబు నవ్వుతూ.

"భారీగా వున్నవాళ్ళంతా విలన్లు కావాలేమిటి"?

"సినిమాలోకంలోఅంతేగా! ఎలకపిల్లల్లాగా, చిన్నగా, ఆడపోలికలతో వున్నవాళ్లే హీరోలుగా చలామణీ అయి పోతున్నారు."

"ఏమిటిబాబూ–దిగుతూనే మాహీరోలను దుయ్యబడు

తున్నావు. వాళ్ళలో నేనింకా ఎన్నో పిక్చర్సులో యాక్ట్ చేయాల్సి వుంది. నా యింప్రెషన్స్ పాడుచెయ్యకు. పద పోదాం."

బయటకు వచ్చాక శైలజ కారుఎక్కి స్టీరింగ్ ముందు కూర్చుంది. అతనామె ప్రక్క కూర్చున్నాడు.

అతనామెవైపు పరీక్షగా చూశాడు. అప్పటికన్న అందంగా, ఆకర్షణీయంగా వుందిఆమె. తనకన్నవయసులో మూడు నాలుగేళ్లు పెద్దయినా-యిరవై పేళ్ళకన్న ఎక్కువ వుంటాయని ఎవరూ అనుకోరు. శరీరానికి వింతకాంతి వచ్చింది.

"నాన్నగారూ, అమ్మా అంతా కులాసాగా వున్నారా?" అనడిగింది శైలజ కారు స్టార్ట్ చేస్తూ.

మధుబాబు తల ఊపాడు.

"అక్కయ్య?"

"ఇప్పుడు బొంబాయిలో వుంటోంది- భర్తతో."

"నేను రమ్మని రాయగానే వచ్చేశావు. థ్యాంక్స్" అన్నది శైలజ.

"బెజవాడ పోదామను కుంటూండగా మీ ఉత్తరం వొచ్చింది. రాకుండావుండలేక పోయాను. సరేగా నన్నెందుకు రమ్మన్నారు?"

"కారణం తెలియదని రాశానుగా. నీ పుస్తకాలు చదివాను. నిన్ను గుర్తుపట్టాను. ఆ పాతరోజులన్నీ గుర్తుకు వచ్చాయి. ఈ ప్రపంచంలో నువ్వొక్కడివే మిత్రుడి వనిపించింది."

"అదేం? ఇక్కడ మీకు స్నేహితులు లేరా?"

"స్నేహాం చట్టుబండలు. లైఫ్‌బలేగా వుందిలే. నేను నటించిన సినిమా లేమయినా చూశావా?"

"చూశాను."

"నన్ను గుర్తుపట్టావా?"

"పట్టాను"

"నా నటన నీకు నచ్చిందా?"

"నటనని గురించి అంతగా నాకు తెలీదు. కాని ప్రయత్నం లేకుండా, సునాయాసంగా మీరు నటిస్తారని చెప్పగలను. సినిమాల్లో మీరు నటించే పాత్రకన్న, ఆ పాత్రను డామినేట్ చేసిన మీరుకనిపిస్తారు. మిమ్మల్ని గొప్ప నటిగా లోకంఅంగీకరించింది. నేనెంత?"

"మరి నన్ను గుర్తుపట్టి, నా నటననచ్చి నాకెప్పుడూ ఉత్తరం రాయలేదేం? అహాంభావమా?"

"కారణం సరిగ్గా చెప్పలేను. కొంచం అలాంటిదే అయివుంటుంది"

"అమ్మో. గడుసుతనంకూడా నేర్చావే."

అతనికేం జవాబు చెప్పాలో తోచలేదు. ముభావంగా ఊరుకున్నాడు.

"నన్ను మీరు మీకు అంటావేం నువ్వు?"

"ఇదివరకు కూడా అలాగే పిలుస్తూ వుండినట్లు గుర్తు. పాత అలవాటు కదా."

"అవునుగాని నువ్విక్కడికి రావటం ఏమీ సుఖం

అనిపించటం లేదా యిప్పుడు? పశ్చాత్తాప పడటం లేదు గదా."

"ఉహు లేదు. చాలా సరదాగాకూడావుంది."

శైలజ ఓ పెద్ద భవనంముందు కారు స్లో చేసింది. ఘూర్ఖావాడు గేటు తెరిచాడు. కారుని లోపలికి పోనిచ్చి పోర్టికోలో ఆపింది. ఇద్దరూ బయటకు దిగారు.

"ఇదేమాయిల్లు. సంవత్సరంక్రితంకట్టించాను. బాగుందా?" అని ప్రశ్నించింది శైలజ కుతూహలంగా. మధుబాబు తలయెత్తిపరిశీలనగాచూశాడు. "చాలాబాగుంది" అన్నాడు.

"లోపలకు పోదాం రా" అంటూ ఆమె మెట్లు ఎక్క దారితీసింది. పనివాడు వచ్చి మధుబాబు సూట్ కేసునిలోపల పెట్టాడు.

మేడమీదకువెళ్ళాక డ్రాయింగ్ రూమ్‌లోని సోఫాల్లో యిద్దరు ఎదురెదురుగా కూర్చున్నారు. బట్లర్‌ని కేకేసి శైలజ యిద్దరకూ ఫలహారం, కాఫీతీసుకు రమ్మనిపురమాయించింది.

"ఇంతపెద్దయింట్లోనూ నేనూ, మా ఆయనా వుంటున్నాం అంతే. ఎవరోచాలామంది స్నేహితులూ, చుట్టాలూ అంటూవచ్చి పోతుంటారనుకో. పెర్మనెంట్‌గా వుండేది మట్టుకు యిద్దరమే" అన్నది.

"ఆయనా?"

"అవును. అంత ఆశ్చర్యపడతావేం? నేను పెళ్ళి చేసుకున్నాను. ఆయనకూడా ఓ సినిమా ప్రొడ్యూసర్. ఇంతవరకూ రెండు సినిమాలుతీశాడు. రెండింట్లోనూ హీరో

యిలాని నేనే. నే నిందులోకి ఎంటర్ గావటానికి కూడా ఒక రకంగా ఆయనే కారణం"

అతనేం మాట్లాడలేదు.

అయిదు నిమిషాలు గడిచాక కాఫీ ఫలహారాలు వచ్చాయి. అతను వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్ళి చేతులు కడుక్కువచ్చాడు.

"ప్రక్కన టవల్ వుంది. చేతులు తుడుచుకో"

"ఊహు, చేతులు కడుక్కున్నాక మళ్ళీ టవల్‌తో తుడుచుకోవటం శుభ్రత కాదు."

"అబ్బో! డాక్టర్ చదువుతున్నావుగా! ఎన్నోఏడు?"

"ఇది నాలుగోది."

"ఇది గాకుండా యింకో ఏడాదిలో కోర్సు పూర్తయిపోతుందన్నమాట. బెజవాడలోనే ప్రాక్టిస్ పెడతావుగా."

"అంతేగా మరి."

"మరి నా కెప్పుడయినా జబ్బుచేసి నీ దగ్గరకు వస్తే మందిస్తావా?"

"మీ మద్రాస్‌లో డాక్టర్లు తక్కువైనారా?"

"నాకు నీ దగ్గరే ట్రీట్‌మెంటు తీసుకోవాలని వుంది చినబాబూ!"

ఈ కంఠస్వరం కొత్తగా వినిపించి చకితుడై అతను తలఎత్తి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె చప్పున కళ్ళు ప్రక్కకి త్రిప్పుకుంది.

"అంత అవసరంవస్తే... అవశ్యం అలాగే" అన్నాడతను నెమ్మదిగా.

*

శైలజ భర్త ఊళ్లో లేడు. హిందీలో ఓ చిత్రం నిర్మించాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఆ పనిమీద బొంబాయి వెళ్ళాడు.

"షూటింగ్ ఏమయినా చూస్తావా?" అనడిగింది శైలజ ఆ మధ్యాహ్నం.

"ఇంటరెస్ట్ ఏమీ లేదు. మీకేమనా వుంటే చెప్పండి. వస్తాను."

"ఇవాళ నాకు కాల్ షీట్ ఏమీ లేదు. రేపువుంది. అయినా యివాళ యీ షూటింగూ, పాడూ ఏమీ వద్దులే. ప్రశాంతంగా వుండాలని నిన్ను పిలిచాను. నువ్వెందుకో నా డియరెస్ట్ ఫ్రెండ్ వనిపిస్తోంది. మహాబలిపురం పోదామా?"

"మీ యిష్టం"

"పద పోదాం" ఒక్కక్షణం యింట్లో వుందామన్నా భయం వేస్తుంది. ఈబిజీగావుండటం, యిదంతా విసుక్కని వంటరిగా వుండాలని కోరుకుంటామేగాని-అదీ భయంకరంగానే వుంటుంది."

ఇద్దరూ మెట్లుదిగి క్రిందకు వచ్చారు. శైలజ ఫ్రంట్ డోరు తెరవబోతూ "నీకు డ్రైవింగ్ వచ్చునా?" అనడిగింది.

"నాకు కాదు వుందిగా మరి."

"అయితే నువ్వే చెయ్యి. నేను నీ ప్రక్కన కూర్చుంటాను ఇదివరకెప్పుడయినా మెద్రాస్ వచ్చావా? దారులన్నీ బాగా తెలుసా?" అంటూ అటు తిరిగివెళ్ళి తలుపు తెరిచి ముందువైపు కూర్చుంది.

మధుబాబు స్టీరింగ్ ముందు కూర్చుని "నా చిన్న నానవచ్చి కొన్ని రోజులు వున్నాను. దార్లు తెలీవు. మీరు డైరెక్టర్ చేస్తూ వుండండి" అంటూ స్టార్ట్ చేశాడు.

"పెళ్ళి చేసుకున్నావా?" అనడిగింది శైలజ దారిలో.

"లేదు"

"ఎందుకని...?"

"భార్యగా వుండటానికి ఏదో ఓ మిషన్ని తెచ్చి యింట్లో ఫ్యాక్టరీ పెట్టటం యిష్టంలేదు. అందుకని..."

శైలజ కిలకిలమని నవ్వింది. "అచ్చం రచయితలాగే మాట్లాడుతున్నావే."

అతనేం జవాబు చెప్పలేదు. నవ్వి ఊరుకున్నాడు.

కొంచం ఆగి శైలజ "నీకు ఫ్యాన్ లెటర్సు వస్తాం టాయా?" అనడిగింది.

"ఏవో కొద్దిగా."

ఆమె నిట్టూర్చి "నాకు చాలా వస్తుంటాయి. రక రకాల ప్రేమలేఖలు, బూతులు, అభినందనలు..." అంది.

మధుబాబు వీధి మలుపు త్రిప్పుతూ "మీకొచ్చే లెటర్సుకి, మాకు వచ్చేవాటికీ చాలా వ్యత్యాసం వుంది. ఏమాత్రం లైకింగ్ వున్నా, లేక కాలక్షేపానికి, లేక గ్లామరుతో రాస్తారు మీకు. తమ జీవితాల్లో ఏదో ఒకఅంశాన్ని స్పృశిస్తేనేగాని మాకు రాయాలని వాళ్ళకు స్ఫురించదు. అందుకే మా కొచ్చేవి ఆషామాషీగా కాక సన్నిహితంగా లోతుగా వుంటాయి. ఇవా మీకు వందలకొద్దీ ఎందుకు

వస్తాయంటారా ? పాఠకుల సంఖ్యకంటే ప్రేక్షకుల సంఖ్య ఎంతో తక్కువ కాబట్టి" అన్నాడు.

"అమ్మాయిలు కూడా రాస్తూంటారా?" అనడిగింది శైలజ కుతూహలంగా.

"ఆఁ ఏం?"

"ఏం లేదు. అప్పుడు నీకేమనిపిస్తుంది?"

"ఆశ్చర్యంగా వుంటుంది. మనకు తెలియని ప్రపంచం యింకా ఎంత వుందో అనిపిస్తుంది మన చుట్టుపక్కల యిలాంటి గండిపడ్డ జీవులు, విపరీత విషాద మనస్కులు మనకు అంతగా కనబడరు. ఉదాహరణకు మా కాలేజి లేడీ స్టూడెంట్సునే తీసుకుందాం. మెకానికల్‌గా చదువుకోవటం, పరిస్థితుల్ని బట్టి అబ్బాయిలకి దగ్గరగా రావటం, అప్పుడప్పుడు మితిమీరటం, వాట్టి ఏబ్రాసితనం తప్పితే ఉత్సాహం, ఆరాటం, జిజ్ఞాస, లోతు ఏమీ కనబడవు కాని మరి అలాంటి వాళ్ళు మనకి కనిపించకుండా చాలామంది వుంటూనే వున్నారు. ఎట్లాగో కదిలించబడి సన్నిహితంగా వస్తూనే వున్నారు. అదే ఆశ్చర్యం."

శైలజ నిట్టూర్చి "నేనూ నీకు సిన్సియర్ ఫ్యాన్‌నే. అబ్బ! ఆ పుస్తకాలు ఎట్లా కదిలించాయి నన్ను?" అంది.

అతను చకితుడైనాడు ఓ క్షణం వూరుకుని "కాని అవి నేను తప్ప యింకెవరైనా రాసివుంటే మీరు ఉత్తరం రాసివుండే వాళ్ళు గాదు. నేను పరిచయస్థుడ్ని కావటం చేత

మీ మనస్సు, పొజిషన్ అభ్యంతరం చెప్పలేకపోయినా'' అన్నాడు.

శైలజ ఆశ్చర్యంగా "నిజమే. అలాంటి అహంభావం నాకువుంది" అని ఒప్పుకుంది.

* * *

ఆ రాత్రి భోజనాలు అయినాక తనకోసం ఏర్పాటు చేసిన గదిలోకిపోతూ వుండగా ప్రక్కనఓబల్లమీద సితార్ కనిపించింది. దానిమీద అతనీమధ్య సాధనం చేశాడు. ఒక వాద్యం బాగా వొచ్చిన వాడికి మిగతావన్నీ తేలిగ్గావస్తాయి. వ్రేళ్ళు, ఆ తీగెలను, గతులను తేలిగ్గా అలవాటు పడి పోతాయి. అనుకోకుండా తెలలో ఓ సంపర్కం తెలుస్తూ వుంటుంది అతనికి సితార్ మీద వాయించటం బాగానే వచ్చింది. దాన్ని జాగ్రత్తగా పట్టుకుని గదిలోకి తీసుకు వెళ్ళాడు.

ఈమధ్య విడుదల అయిన సినిమాలో శైలజ పాడిన పాట వాయించసాగాడు సోఫాలో కూర్చుని.

శైలజ తన గదిలోంచి బయటకు వస్తూ యీ మధుర మంజులగానం ఆలకించింది. నిమ్మదిగా, చప్పుడు చేయకుండా వెళ్ళి గుమ్మం యివతల నిలబడింది.

కొన్ని నిమిషాలయినాక పాట ముగిసింది.

మధుబాబు ఏదో అనుమానం తోచి, ఆమెని చూసి లజ్జితుడై "మీరా? ఎంతసేపయింది వచ్చి? వొట్టి పిచ్చి నాదు" అన్నాడు

శైలజ లోపలకు వచ్చి మరో కుర్చీలో కూర్చుని "నీకు రానివిద్య అంటూ లేదా చినబాబూ? ఏదీ మరొకటి వాయించు, చాలా ఆసక్తిగా వుంది" అని అడిగింది ఎంతో కుతూహలంగా.

"క్షమించాలి. ఇవి నా ఆనందంకోసం నేను నేర్చుకున్నవి. ఎందుకూ పనికిరానివి. గట్టిగా ఎవరైనా అడిగితే చెయ్యి కదలదు."

"బ్రతిమాలినా అంతేనా?"

"బ్రతిమలాడవద్దని నేనూ బ్రతిమలాడాల్సివస్తుంది."

శైలజ నవ్వింది. "నీకు మృదుత్వం, పెంకితనం రెండూ వున్నాయి చినబాబూ" అంది.

మధుబాబు ఆలోచించ సాగాడు. ఆమెలో ఏదో వేదన వున్నట్లు అతనికి పొడగట్టింది. అందుకనే తన సాన్నిహిత్యం కోరిందేమో. బహుశా అది బయటకు చెప్పలేక పోవచ్చు.

"చినబాబూ!" అంది శైలజ కంపితస్వరంతో అతని కళ్ళలోకి చూస్తూ.

అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఆ పుస్తకాలు ఎందుకలా రాశావు?"

"ఎలా?"

"అలా"

"ఎలా?"

"అవి చదువుతున్నంతసేపూ నేనేడుస్తూనేవున్నాను. నా జీవితంలో ఏదో సంఘటనతో అవి పోలాయని కాదు.

కాని అజ్ఞాతంగా వున్న నాలోని అసంతృప్తికి అవిరూపాన్ని చ్చాయి. ఎన్ని తిరుగుళ్లు, ఎత్తుపల్లాలు, మలుపులు, అస హ్యాం నా జీవితం ఆ యినిస్పెక్టర్ల లోనే నిన్ను రమ్మని ఉత్తరం రాశాను......అవునుగాని నేనిందులోకి ఎటా వచ్చానని అడగవేం ?"

"కుతూహలం లేదు."

"ఎందుకని?" అనడిగింది ఆమె కొంచం గాయపడి.

"కొత్త ఏమీ వుండదు. పేర్ల మార్పుతో, సంఘట నల తేడాతో మీ అందరికథలూ యించుమించు ఒకలాగే వుంటాయి. గుండ్రంగా తిరిగే జీవిత చరిత్రలు."

"నువ్వు కఠినుడివి" అంది శైలజ.

"శాంతస్వముందే మృదువైన వాడినన్నారు. అతిమృదు త్వంకూడా ఒక్కోసారి కఠినంగా కనబడుతుంది. అది అంద రికీ అర్థమయ్యే సంగతి కాదులెండి." అని మధుబాబు ముఖం ప్రక్కకి తిప్పుకున్నాడు.

శైలజ తెల్లబోయి చూసింది. భయంతో, నిజాయితీ లోని వ్యధతో ఆమె ముఖం పాలిపోయింది. "నాకు మన శ్శాంతి లేదు" అంది హీడిగా.

మధుబాబు సితార్‌ని అవతల వుంచాడు. "ఉండదు ఒక్కోరకం మనుషులకి. ఆ మనశ్శాంతికోసం అన్వేషణలోనే జీవితమంతా సరిపోతుంది. ఈ స్థితి ఎక్కడ వున్నా తప్పదు. మీను రాజయ్యగారి ప్రాపకంలోనే, ఆ పెంకుటింట్లోనే వున్నా యీ మనశ్శాంతి లేకే బాధ పడేవారు. ఈ సినిమా లోకంలోకి రాకుంటే ఎక్కడికైనా వెళ్ళి మరోరకంగా

జీవించినా అదే అవస్థ. ఇప్పుడూ అంతే. అది మనుషుల్లోని దుర్బలత, రూపంలేని తృష్ణ అంతే."

శైలజ ఓ క్షణంపాటు అతని నిర్మల, అమాయక వదనంకేసి పరీక్షగా చూసింది. "నీకువుందా మనశ్శాంతి?"

"లేదు" జవాబు సూటిగా వచ్చింది.

"ఎందుచేత?"

మధుబాబు ఆమెకేసి భావశూన్యంగా చూశాడు. "దీనికి జవాబు చెప్పటం చాలాకష్టం."

"అంతరంగికమా?"

"కొంచం అలాంటిదే."

"నువ్వు ఏ స్త్రీనైనా ప్రేమించావా?"

"ప్రేమించాను"

"ఆమె ఎలాంటిది?"

"అంటే?"

"ఆమెని గురించి నీ యింప్రెషన్."

"చాలా గొప్పది. ఈ భూమ్మీద అలాంటి వ్యక్తులు అరుదుగా వుంటారు."

"మరి ఎందుకు పెళ్ళిచేసుకో లేదు?"

"కర్మ. ఆమెకు అంతకు ముందే పెళ్ళయిపోయింది"

శైలజ నిట్టూర్పు విడిచింది. "అందుకనే నీరచనలంత మధురంగా వున్నాయి" అంది.

"అందుకనేనా... కాబోలు" అన్నాడు మధుబాబు అన్యమనస్కంగా.

"నీకు చాలా చెప్పాలని వుంది. ఏమీ చెప్పలేక పోతున్నాను" అంది శైలజ.

"నాకు తెలుసు."

"కారణ మేమిటంటావు?"

మధుబాబు అనుకోకుండా చిన్నమందహాసం చేశాడు. "మనం ప్రతిదానికీ కారణం చెప్పలేం శైలజా. కారణం తెలియకుండానే నన్నిక్కడకు రమ్మన్నారు. కారణం తెలీకుండానే నేనిక్కడకు వచ్చాను. ఇద్దరిమధ్యా తెలియని ఆందోళన వుంది. మళ్ళీ నేను వెళ్ళిపోయాక మీరూ బాధ పడ్తారు, నేను పడతాను. ఏదయితే యిక్కడ గుప్తంగా వున్నదో అదే సత్యం" అన్నాడు.

శైలజ ఆలోచిస్తూ కూర్చుంది. ఇద్దరూ చాలా సేపటి దాకా మౌనంగా ఊరుకున్నారు. హఠాత్తుగా ఆమె ముఖం ఎత్తి డగ్గుత్తికతో "ఈ జీవితం బరువు మొయ్యలేకుండా వున్నాను. నేను కొద్దిరోజుల్లో ఏమయినా అయిపోవచ్చు. గతమూ, ప్రస్తుతమూ, భవిష్యత్తూ కూడా అసహ్యంగా అస్తవ్యస్తంగా కన్పిస్తోంది. కాని వీటన్నిటినుంచి తప్పించుకునే ధైర్యం, త్యాగం లేవు... ఒకవేళ ఎప్పటికైనా ఆపదలో నీ దగ్గరకువస్తే సహాయం చేస్తావా?" అంది జాలిగా.

మధుబాబు అప్రతిభుడై పోయాడు. "తప్పకుండా" అన్నాడు వ్యతీతమైన కంఠంతో.

శైలజ లేచి నిలబడి "ఇహ పడుకుని నిద్రపో. నా గురించి అట్టే ఆలోచించకు. వస్తా" అంటూ అక్కణ్నుంచి గబగబా వెళ్ళిపోయింది.

ఆమె గొంతులోని వ్యధను గమనించి అతను విచలితుడయ్యాడు. లేచి కిటికీ దగ్గరకువచ్చి నిల్చున్నాడు. క్రింది తోటలోంచి రకరకాల పువ్వుల పరిమళం, హాయిహాయిగా ఎగజిమ్ముతోంది. ఈ డబ్బు, సౌఖ్యం, యవ్వనం, కీర్తి అన్నీవుండి...ఏమిటో !

అతను తలఎత్తి ఆకాశంలోకి చూశాడు. జాబిలి మబ్బుచాటుకు జరుగుతున్నాడు

♦ ♦ ♦

మరునాడు కూడా అక్కడే గడిపి, ఆ మరుసటి రోజు అక్కడ్నుంచి వచ్చేశాడు మధుబాబు. పోస్ట్‌మేన్‌తో చెప్పటంవల్ల పాత ఎడ్రెస్‌కి వచ్చిన ఉత్తరాలు కూడా యిక్కడే యిచ్చి పోతున్నాడు. తలుపుతీసి యింట్లోకి ప్రవేశించగానే నేలమీద తనకోకటి పడివుంది. దస్తూరి గుర్తుపట్టి అతనిగుండె గబగబ కొట్టుకుంది.

'ఒట్టి అడవి మనిషికి,

ఈమధ్య నీ కొత్తపుస్తకం చదివాను. నాకేమీ బాగాలేదు. వింటున్నావా? ఏమీ బాగాలేదు. అబ్బ ! అయినా రానురానూ అంత విషాద జీవిగా తయారౌతున్నావేమిటి? ఎప్పటికైనా సరే యీ ప్రపంచంమీద మితిలేని అసహ్యం కలిగినప్పుడు నా దగ్గరకు వచ్చెయ్యి. ఏం.

పద్మజ'

అతని గుండెలో ఏదో కెలికినట్లయింది. దిగాలుపడి కూర్చున్నాడు.

# 26

ఒక దశలో మానవుడు మానసికంగా పెరగటం, ఆగిపోతాడు. ఎవ్వరూ ఎల్లకాలం పెరుగుతూపోరు. ఎక్కడో నిలిచిపోయి శూన్యంలోకి చూస్తూ వూరుకుంటారు. అయితే యిది స్థిరత్వం కాదు. జడత్వం అంతకంటే కాదు. తాత్కాలికమైన తపస్సా అంటే అదీ చెప్పలేం. మళ్ళీ భావిలో జీవితం కొత్త చిగుళ్ళు తొడగవచ్చు. మానసిక పరిణామం రావచ్చు. కాని యీ స్తబ్ధమైన దశ అనుభవించకుండా మాత్రం ఎవ్వరూ ముందుకు పోలేరు.

మధుబాబు ప్రస్తుతం యీ దశలో వున్నాడు. ఫైనల్ యియర్‌లోకి వచ్చాడు. యాంత్రికంగా హాస్పిటల్‌కి పోయి వస్తున్నాడు. పాఠాలు శ్రద్ధగా చదువుతున్నాడు. సాహిత్య ఉత్పత్తి ఏమీ చెయ్యలేదు మత్తుగా, మౌనంగా వున్నాడు.

కాని ఆ వయస్సుకి అతను రాసిన రచనలు ఎక్కువే. అసూయాపరులు ద్వేషాన్ని వెళ్ళగక్కే స్థితిని అతడెన్నడో చేరుకున్నాడు పాఠకుల్లో పేరు పెరిగిన కొద్దీ విమర్శకులు మరీ తప్పులెంచ సాగారు. ఎంతపైకి వచ్చినా "పర్వాలేదు. పైకి వస్తాడనే" స్లోగన్ పత్రికలవాళ్ళు వొదలటల్లేదు

అతి వాదాలంటే అతనికి మధ్య మరీ చికాకు హెచ్చింది. ఈ మానసికమైన చిత్రవధను అతనింకా అనుభవించ దల్చుకోలేదు. ఈ మధ్య రైల్లో పోతూంటే ఓ రచ

యిత్రి కనిపించింది. విప్లవ వనితలా గోచరించింది. ప్రేమ వేరు వివాహం వేరు అన్నది. నిజమే. అంగీకరించవచ్చు. కాని ప్రేమకూ, వివాహానికీ బొత్తిగా సంబంధం వుండనక్కర్లే దంది. స్త్రీ హృదయం పుష్పక విమానమంది. ఎంతమంది కైనా అందులో చోటు వుంటుందని ఆమె వాదం. నిజమే కావచ్చు ననుకున్నాడు మధుబాబు. ఒకరిలో కొన్ని గుణాలు చూసి యిద్దర్నీ సమానంగా ప్రేమించటానికి అవకాశా లున్నాయి. ఇది సత్యమే కాని యీ వాద ప్రచారం తప్పని సరి. ప్రేమలు ఎక్కువవటానికీ, ప్రతిదాన్నీ ప్రేమ అని పిలవ సాహసించటానికీ యింకా అవకాశాలున్నాయి... ఈమధ్య ప్రతివాడూ 'ఉద్ధరింపు' అనేమాట విరివిగా ప్రయోగించటం ప్యాషన్ అయిపోయింది. ఉద్ధరింపుకు విపరీత అర్థాలూ తీయటం జరుగుతోంది. జీవితంలో అనుభవ శూన్యులూ, ఏవో కొద్ది దారుణ సంఘటనలు చూసి అవే ప్రపంచ సత్యాలని అపోహ పడినవాళ్ళూ, ఏదో ఓకోణంలో వ్యక్తిగత కారణాలచేత దగాపడినవాళ్లూ అవే విశ్వజనీనంచేసి తాత్కాలిక ఉద్రేకంతో పొలికేకలు వేయటంవల్ల ఉద్ధరింపు జరగదు. మనలో లేని సంస్కారాన్ని ప్రజలకు పంచి పెడుతున్నాం. మనలోని బలహీనతల్ని ప్రజలమీద రుద్ది మన క్షేమంకోసం విశ్వవ్యాప్తం చేస్తున్నాము మన వ్యక్తిగత జీవితమంతా బూజు, వొట్టి ఆర్భాటం, పిరికితనం. కొన్ని సుఖాలకు కరువాచిపోయి, వాడితీంక అతివాదాలు లేవదీస్తున్నాం. ఇట్లా తరుచుకుంటూ పోతే నిజాయితీ ఎక్కడ ?

'స్త్రీని' ఎంతో మందికన్న ఎక్కువగానే సానుభూతిగా చూశాడు మధుబాబు. ఆ అసహ్యం, ఆవివేకం, కానిసత్వం (యిప్పటికి), అత్యాచారాలు, అమానుషాలు తలుచుకుని కన్నీరు కార్చాడు. ఆవేశపడ్డాడు నిజమే. మనసంఘం కుళ్ళి కుళ్ళి దరిద్రంగా, ముదనష్టంగా తయారౌతోంది. కాని యీ ఆకంఠశోషలూ, తీవ్రవాదాలూ వివి సంస్కారానికిసరైన నిర్వచనం చెప్పుకుంటున్న దెంతమంది? అతను నిత్యం కాలేజీలో అంతమంది అమ్మాయిల్ని చూస్తున్నాడు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం; ఎమ్.బి.బి.ఎస్. చదువూ, అన్నీ పొంది సంస్కారం అంటే అర్థం తెలీక ప్రేమశూన్యాలై, అసహ్యపు ముద్దలా తయారౌతున్న వీళ్ళని చూస్తూంటే అతనికి మతి పోతోంది. స్వేచ్ఛపొంది వీళ్ళు నిర్వర్తిస్తున్న దేమిటి? ఊరగాయల గూళ్ళలోంచి, కూరల, పచ్చళ్ళలోకాభి రామాయణం నుంచి బయటకు వచ్చిన నవీనస్త్రీ-సినిమాకబుర్లూ, మిత్రుల శీలాన్ని గురించీ మాట్లాడుతోందని, ఆదర్శంకోసం అలమటించిన మహావ్యక్తులే నిరాశ చెందుతున్నారు. స్వేచ్ఛకు అర్థం చెప్పుకోలేని వ్యక్తులు భూమ్మీద గుంపులు గుంపులుగా పోట్లాడుతూంటే ఆదర్శానికి అనకట్ట లెందుకు? అది పిచ్చెక్కినట్లు పొంగి ప్రవహించేది. ఎక్కడ పల్లంవుంటే అటు కేసి జరజర పోతుంది. చివరకు మిగిలేది! అరిచి, అరిచి జీవితాన్ని అంకితం చేసుకున్న మహాసియుల పిసిపించీ వినిపించని వ్యర్థ ఘోషలు..

* * *

ఒకరోజు సాయంత్రం ఓ స్నేహితుడితో కలిసి బజారు వెంట నడుస్తున్నాడు మధుబాబు. ఆ స్నేహితుడు కాలేజి గొడవలేవో చెబుతున్నాడు. అతడు వింటున్నాడు.

ఇంతలో యిద్దరు యువతులు వాళ్ళ కెదురుగా వచ్చారు మధుబాబు వంక యథాలాపంగా చూసిన ఓ అమ్మాయి, చప్పున చకితురాలై, స్నేహితురాల్ని మోచేతి మీద పొడిచి "అతడూడు అతడూడు" అన్నది ఆత్రంగా.

"ఏమిటే?" అంది స్నేహితురాలు.

"అతన్నెక్కడో చూసినట్లుగా వుంది... ఆఁ, నవలలు రాసే మధుబాబు. అవునతనే" అంది మొదటి అమ్మాయి ఉత్సాహంగా.

"అయితే అడుగుతులే; ఏమిటా గాథరా?"

మధుబాబుకి యీమాటలు లీలగా వినిపించాయి. పులకితుడయ్యాడు. నవ్వుకుంటూ ముందుకు నడిచాడు.

స్నేహితుడు కాఫీ త్రాగుదామన్నాడు. ఇద్దరూ కలసి ప్రక్కనున్న కాఫీ హోటల్ కి వెళ్ళారు.

"అతనికేడే ఎమ్. బి. బి. ఎస్. చదువుతూన్నట్లు పుస్తకాల వెనక చూశాను. అతని రచనలంటే నాకెంతో యిష్టం. కలుసుకుంటే బాగుండేది" అంది మొదటిఅమ్మాయి విచారంగా

"మరి అతన్ని నిలబెట్టి మాట్లాడక పోయావా?" అన్నది రెండో అమ్మాయి ఎగతాళిగా.

"అమ్మబాబోయి, నడ్డుమీదనా? అందులోనూ

నేనా? మొగవాళ్ళతో మాట్లాడాలంటే నాకు చచ్చేభయం బాబూ''

"అయితే యిహ దిగులెందుకు? పోదాం పద" అని రెండో అమ్మాయి ఆమె చెయ్యిపట్టుకు లాగింది.

"ఉండు ఉండు. కాసిని పువ్వులు కొనుక్కుపోదాం. ఎంత బాగున్నాయో చూడు ఆ తెల్లని మల్లెలు తెల్లని మల్లెలన్నా, చల్లని వెన్నెలన్నా ఎంతో యిష్టం నాకు!''ఇద్దరూ రోడ్డు ప్రక్కనున్న పూల అంగడికి వెళ్ళారు.

పువ్వులు బేరం చేస్తున్నారుగాని – స్నేహితురాలి చూపు లన్నీ హోటలు గుమ్మంమీద కనిపెట్టింది రెండో అమ్మాయి. లోలోపల నవ్వుకుంది స్నేహితురాలి సాహిత్యపు పిచ్చి ఆమెకు తెలుసు. మరో పది నిమిషాల వరకూ యిద్దరూ పువ్వులు కొంటూనేవున్నారు మధుబాబు స్నేహితుడితో కలిసి బయటకు వచ్చాడు. రెండో అమ్మాయి, హఠాత్తుగా స్నేహితురాలి చెయ్యిపట్టుకుని గబగబ వాళ్ళకు ఎదురుగా వెళ్ళి "నమస్కారమండీ. మీరు ప్రఖ్యాత రచయిత మధుబాబుగారు కదూ'' అన్నది చొరవగా. మొదటి అమ్మాయి గుండె గబగబ కొట్టుకుంది. నేస్తురాలు చేసిన పనికి కోపం తెచ్చుకుంది. ఏమంటాడోనని ఎదురుచూస్తోంది.

''కాదే'' అన్నాడు మధుబాబు.

''కాకపోవటమేమిటి, మీ మొహం చెప్పటల్లా? ఏమండీ మీరు చెప్పండి ఆయన పేరదే.. కదూ'' అన్నది ప్రక్కవాడికేసి తిరిగి తొణక్కుండా, బెణక్కుండా.

స్నేహితుడు కాస్త మాటకారే "మీరన్న ప్రఖ్యాతుడూ, యీయనా ఒకటి అవునో కాదోగాని - యీయన పేరు మధుబాబే. రచయిత అయినమాట వాస్తవమే" అన్నాడు.

ఆమె చప్పున స్నేహితురాల్ని ముందుకు లాగుతూ "ఈ రాణీగారిపేరు ఇందిర. మీ పుస్తకాలంటే పడి చస్తుందిట. కలుసుకోవాలని ఊరికినే తహతహ లాడ్తోంది. ఊఁ మాట్లాడవే" అంది దబాయిస్తూ.

ఇందిరకు వల్లమాలిన కోపం, సిగ్గూ రెండూ కలిగాయి. ఉడుకుమోత్తనం కూడా వచ్చింది. కాని ఏం చేస్తుంది? వణుకుతూన్న చేతుల్తో నమస్కారం పెట్టి, రెప్పలు క్రిందకువాల్చి, నేలచూపులు చూస్తూ ఊరుకుంది.

మధుబాబు కూడా చేతులు జోడించి నమస్కారం చేశాడు.

"ఇంకేం మాటల్లేవా? అయిపోయిందన్నమాటఁ న పద. వస్తామండీ. ఇది వట్టి మూగది.మాటలురావు" అంటూ ఇందిర చెయ్యి పుచ్చుకుని కదిలింది ఆ అమ్మాయి.

"మరి మీపేరు చెప్పారు కాదేం?" అన్నాడు మధుబాబు స్నేహితుడు కొంటెగా.

"నా పేరా?మనిషిలాగే కొంచం ఘాటుగా వుంటుందని..." అంటూ ఆమె వెళ్ళిపోయింది.

* * *

ఆదివారం మధ్యాహ్నం పనిమనిషి తెచ్చిన క్యారియర్‌తో భోజనం చేసి క్లాస్ పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాడు మధుబాబు ఇట్లా ఒంటరిగా కూర్చుని భోజనం చెయ్యటం దారుణమైన సన్నివేశం. ఎవరో చాటునుంచి పొంచి చూస్తున్నట్లూ, సానుభూతి ప్రదర్శిస్తున్నట్లూ వుంటుంది. నోట్లోకి ముద్దపోదు. ఒంటరితనం చాలాకాలం వృథా ఆలోచనలతో వ్యర్థం అయిపోతూంటూంది. అర్థం లేని జాలి మనసుమీద ముసుగు.

మెల్లగా మూడయింది. కాసేపు నిద్రపోదా మనిపించింది మధుబాబుకు. ఈ మధ్యాహ్నం నిద్రకన్న విషాదకరమైన సంఘటన లేదు. పట్టీపట్టనిస్థితి, ఉలికిపడి లేచి కూర్చుండటం, తీరా టైముచూస్తే ఎక్కువ గడవక పోవటం.

బయట అడుగుల చప్పుడయింది. ఈ సమయంలో ఎవరూ రారే సాధారణంగా. తలుపు కొడతారేమోనని ఎదురు చూస్తున్నాడు. ఏదో కంఠస్వరం "మధుబాబుగారూ" అతను ఉలికిపడ్డాడు. స్త్రీ కంఠం.

మధుబాబు అప్పుడు పైజమా, లాల్చీ వేసుకుని వున్నాడు. లేచి వెళ్ళి తలుపు తీశాడు.

ఆనాడు బజారులో కనిపించిన అమ్మాయిలు.

తడబడుతూ "లోపలకు రండి" అన్నాడు.

ఇందిర పాపం లజ్జాతురాలై సంకోచిస్తోంది. "పదవే, ఇక్కడదాకా వచ్చాక సిగ్గుపడతా వెందుకే" అని ప్రక్క అమ్మాయి బలవంతంగా లోపలకు తీసుకొచ్చింది.

గదిలో రెండే కుర్చీలున్నాయి. వాటిమీద వాళ్ళని కూర్చమని చెప్పి తాను మంచంమీద కూర్చున్నాడు. ఓ నిమిషం ఏం మాట్లాడాలో తోచక ముగ్గురూ మౌనంగా ఊరుకున్నారు. మధుబాబుకు యిద్దరి ఆడవాళ్ళ మధ్య తన స్థితి—కొంచం యిబ్బందిగా వుంది.

"ఇల్లు ఎలా తెలిసింది?" అనడిగాడు ఏదో అనాలని.

"ఇంత మహా రచయిత చిరునామా తెలియక నే పోతుందా? మా యింటిదగ్గర మీ హాస్పటల్ నర్స్ వుంది. ఆమెని ఎంక్వయిరీ చేశాము" అందా అమ్మాయి నవ్వి. ఇందిర ముసిముసిగా నవ్వి మరింత తలవంచుకు కూర్చుంది.

మధుబాబుకు సిగ్గు వేసింది. ఓ క్షణం ఆగి "పాపం శ్రమపడి యింతదూరం యీ పూరిల్లు వెతుక్కుంటూ వచ్చారు ఈబీదవాడిమీద ఎంత దయా?" అన్నాడు.

"ఇదిగో దయా అదంతా యీ సంగనాచిలా కూర్చుండే యీ దొరసానిది. ఇక్కడకు వచ్చేదాకా ప్రాణం తోడేసింది. ఇప్పుడేమో తెలియని దానిలా పోజు వేసి కూర్చుంటుంది. కొత్తవారు కాబట్టి మీముందు ముంగిలా కూర్చుందిగాని—అమ్మా—బయట దీని ప్రతాపం చూడాలి. మాట్లాడవే"

ఇందిర స్నేహితురాలిని మోచేత్తో పొడిచి "ఊరుకోవే రత్నా! నీ పుణ్యముంటుంది" అంది మందలింపుగా అతి సన్నని స్వరంతో.

కాని యీమాటలు మధుబాబు చెవిని పడినై. "అయితే ఘాటైన మీపేరు రత్న అన్నమాట" అన్నాడు.

"రత్నకుమారి"

"ఇక్కడ కాలేజీలో చదువుతున్నారా?" అని ప్రశ్నించాడు.

"అవునండీ బి. ఏ. మొదటి ఏడు చదువుతున్నాం. ఇద్దరం క్లాసుమేట్సుము" అంది రత్నకుమారి.

అతను ఇందిరవైపు అనాలోచితంగా చూశాడు. పది హేడు, పద్ధెనిమిదేళ్ళకంటే ఎక్కువ వుండవు. చామన ఛాయగా వుంది. నిండుగా, సుకుమారంగా, సహజ సుంద రంగా వుంది. అతను తనవైపు చూడటం కనిపెట్టి తన పెద్ద పెద్ద కళ్ళని క్రిందకు వాల్చుకుని నేల చూపులు చూడ సాగింది.

"అంత సిగ్గుపడేవారుయిక్కడకుఎందుకువచ్చారు?" అన్నాడు మధుబాబు

"అట్లా అడగండి" అన్నది రత్నకుమారి.

నిజానికి యిద్దరు ఆడపిల్లలు ఓ యువకుడ్ని-కారణం ఏమయినా కాని, వెతుక్కుంటూ అతని యింటికి రావటం కొంచం సాహసంతో కూడినపనే. మనసులో గాఢమైన సం చలనం వుంటేనేకాని సాధారణంగా యిట్లా జరగదు.

రత్నకుమారి వాళ్ళది అసలు విశాఖపట్నమే. ఇందిర తండ్రి యింజనీరు. క్రితం ఏడాదే యిక్కడకు ట్రాన్స్‌ఫరై వచ్చాడు. క్లాసుమేట్సు అయినాక యిద్దరకూ బాగా మైత్రి కలిసి పోయింది. ఈవిషయాలు చెప్పింది రత్నకుమారి.

"అబ్బ! ఊరికి దూరంగా, యీ ఆశ్రమ వాతావర

ణంలో ఎట్లా వుంటున్నారండీ? విసుగ్గా వుండదూ? భయం వెయ్యదూ?" అంది.

మధుబాబు ఏదో జవాబు చెప్పబోతున్నాడు ఇంతలో ఇందిర అడ్డుకోకుండా కల్పించుకుని "నాకైతే యిట్లాగే బాగుంటుంది. ఎంత ఏకాంతం-ఏమీ గొడవలు లేకుండా" అనేసింది. తరువాత నాలిక కొరుక్కుంది.

రత్నకుమారి కిలకిలమని నవ్వి "మా ఫ్లాట్ డేసిందిది ఇందిర. మీ పుస్తకాలు బాగా వంటబట్టె నాయండీ దీనికి. ఎప్పుడూ ఏకాంతం, పెసిమిజం, సెన్సిటివ్ నెస్ యివే గొడవలు. ఏ సరోవర తీరాల్లోనో, ప్రకృతి సీనుల్లోనో వంటరిగా తిరుగుతూ గడపక ఈ చదువూ, సమస్యలూ యివన్నీ ఎందుకంటుంది. ఏమోనబ్బా! నాకయితే ఈ విపరీత ప్రకృతులు నచ్చవు. హాయిగా తినటం, చదువుకోవటం, సినిమాలు చూడటం, నిద్రపోవటం..."

"పెళ్ళి చేసుకోవటం..." అన్నాడు మధుబాబు అర్థోక్తిలో.

"పిల్లల్ని కనటం" అని పూర్తిచేసింది ఇందిర.

రత్నకుమారి కోపం వచ్చినట్లు ముఖం పెట్టి "అదిగో-అప్పుడే రచయితగారూ, పాఠకురాలూ ఏకమైపోయారు. అలా అయితే నేను వెళ్ళిపోతాను" అంటూ లేవబోయింది.

ఇందిర ఆమె చెయ్యి పట్టుకుని విడిచిపెట్టకుండా "పిల్లల్ని కనవద్దులే. వెళ్ళకు" అంది.

మధుబాబుకి నవ్వువచ్చి పకపకమని నవ్వాడు. ఇందిర సిగ్గుపడింది.

అతిధులకు ఏమయినా అల్పాహారం యివ్వాలని తోచి అతను బయటకు వెళ్ళి పనిమనిషి ఎక్కడయినా కని పిస్తుందేమోనని చూశాడు. ఎక్కడా జాడలేదు. లోపలకు వచ్చి "యిప్పుడే వస్తాన"ని చెప్పి లోపల గదిలోకి వెళ్లాడు. ఫ్లాస్కులో పాలు వున్నాయి. రోజూ అతను స్టవ్‌మీద కాఫీ స్వంతంగా కాచుకుని తాగుతున్నాడు. ఓ గిన్నెలో నీళ్ళు పోసి స్టవ్‌మీద పెట్టాడు.

"ఏమిటండోయ్ లోపల గిన్నెలూ అవీ చప్పుడు చేస్తున్నారు. కాఫీ ప్రయత్నమూ ఏమిటి?" అంది బయటి నుంచి రత్నకుమారి.

"మరి కాఫీ వేళయింది కదా" అని మధుబాబు సమాధానం చెప్పాడు.

"అదేమో నిజమే. కాని మరి మాకోసం మీరిలా శ్రమపడటం అదోరకంగా వుంటుందండీ మాకు"

"ఉండనివ్వండి పర్వాలేదు. ఏమీ లేకుండా వూరు కుంటే నాకూ అదోరకంగా వుంటుంది"

ఇందిర తనలో తాను నవ్వుకుంటూ గదంతా శ్రద్ధగా కలయ జూసింది. గదైతే అందంగా వున్నదిగాని, అందులో వున్న సామగ్రి మాత్రం నిర్లిప్త్యంగా, కలగా పులగంగా వదిలివేయబడి వుంది గోడకు ఓ వైపు పెద్ద రేఖనిండా పుస్తకాలు వున్నాయి. ఇంగ్లీషువీ, తెలుగువీ, క్లాస్ పుస్త

కాలూ అన్నీ కలగూర గంపలా వున్నాయి. ఆమె లేచివెళ్లి ఆ పుస్తకాలనిూద ఒక్కొక్క దానిపేరు చూస్తూ తనకు తోచినట్లు ఓ క్రమంలో వుంచసాగింది. రత్నకుమారి ఆమె చేసేపనిని ఆసక్తితో చూస్తూ మౌనంగా ఊరుకుంది. ఇంతలో మధుబాబు యేదో వెదుక్కుంటూ గదిలోకి వచ్చాడు. ఇందిర కొంచం జంకి యివతలకు జరిగింది. అతను అన్వేషిస్తూన్న నేత్రాలతో అటూ యిటూ చూడసాగాడు. "ఏమిటంది" రత్నకుమారి. "ప్యాన్" అన్నాడతను కొంచెం సిగ్గుపడుతూ మంచం పరుపుక్రిందా, దిండుక్రిందా చూశాడు. మళ్ళీ ఆ పుస్తకాలన్నీ కలగా పులగం చేశాడు. "ఏమ యింది? యిందాక యిక్కడే ఎక్కడో పెట్టానే" అని గొణు క్కున్నాడు. రత్నకుమారిని ఓసారి కుర్చీలోంచి లేవమని ఆ కుర్చీ అంతా వెదికాడు. మళ్ళీ ఓసారి పుస్తకాలు అటు నుంచి యిటూ ఇటునుంచి అటూ గజిబిజి చేశాడు. "అదే మిటక్కడ తెల్లగా మెరుస్తోంది?" అంది రత్నకుమారితలుపు మూల చూపిస్తూ. మధుబాబు అటు తీక్షణంగాచూసి "యస్. ఇక్కడవుంది" అంటూ తీసుకుని లోపలకు పోయాడు. ఇందిర ఆ పుస్తకాలన్నీ మళ్ళీ చచ్చీచెడి సర్ద సాగింది. ఓ ఘడియపోయాక మధుబాబు మళ్ళీ యివతలకు వచ్చాడు.చూపులతో ఏదో వెదుకుతున్నాడు. "ఏమిటంది" రత్నకుమారి "కాఫీ పౌడర్ డబ్బా" అంటూ మళ్ళీ పుస్త కాల దగ్గరకు పోతున్నాడు. ఇందిర ఉస్సురని నిట్టూర్చి దూరంగా జరిగి నిలుచుంది.ఇంతలోనే అతనికి ఏదో స్ఫురించి "ఈ మంచం క్రింద వుండాలే" అంటూ దానిక్రిందకు వంగి

లోపలకు వ్రాశి ఓ డబ్బాను బయటకు తీసుకొచ్చాడు. వాళ్ళవంక ఓసారి చూసి 'కాఫీపొడి' అంటూ నవ్వి లోప లకు పోయాడు. స్నేహితు రాల్లిద్దరూ ఒకరి మొహంవంక ఒకరు తెల్లబోయి చూసుకుని గప్‌చుప్‌గా ఊరుకున్నారు. మళ్ళీ ఇందిర మిగిలిన పుస్తకాలు సర్దటంలో నిమగ్నురా లయింది.

పది నిమిషాల్లో కాఫీ తయారయింది. కప్పుల్లో పోసి యిద్దరకూ తెచ్చి యిచ్చాడు మధుబాబు. తనూ ఓ కప్‌లో తెచ్చుకున్నాడు.

కాఫీ చాలా బాగా కుదిరింది. ఆడపిల్లలిద్దరూ కూడా అదేమాట అన్నారు.

ఇందిరకు యిప్పుడు కాస్త ధైర్యం వచ్చింది. కాఫీ కప్ క్రిందపెడుతూ - "యిప్పుడు ఏమీ రాయటం లేదా?" అనడిగింది అతనివంక గాక, ప్రక్కకి ఎటో చూస్తూ.

"ఆ గోడ ఏం సమాధానం చెబుతుంది? నన్నడిగితే చెబుతాను" అన్నాడు మధుబాబు పరిహాసంగా.

"పోనీ మీరే చెప్పండి" అంది ఇందిర సన్నని స్వరంతో.

"రాయటల్లేదు"

"ఎందుకని...?"

"రాయబుద్ధి కావటల్లేదు"

"ఎందుకని...?"

"ఎందుకనంటే ఏం చెప్పేది? నాలోంచి ఏమీ ఇన్స్పిరేషన్ రావటంలేదు. నిస్సారంగా, స్తబ్ధగా, మత్తుగా వుంది మనసు... అదీగాక—"

ఆడపిల్లలిద్దరూ చెప్పమన్నట్లు చూశారు.

"నాలో ఏమీ టాలెంట్ లేదు. నేను ఎందుకు రాశానో యిప్పుడు స్పష్టంగా చెప్పలేకుండా వున్నాను. ఈ రాయటం ఎందుకు, ఏమిటికి ఈ తపనంతా అనిపిస్తోంది. చివరకు విరక్తి మిగులుతోంది"

"ఈ చిన్న వయస్సులో మీా కెందుకండీ విరక్తి?" అనడిగింది రత్నకుమారి.

అతను మందహాసంచేసి ఊరుకున్నాడు. జవాబు చెప్పలేదు.

ఇందిరకు కొంచం ఉక్రోషం వచ్చింది. "చెప్పనును రత్నా, నవ్వకుండా. ఎందుకేమిటి విరక్తి?" అన్నది.

"చెప్పలేను జవాబు. నాకూ సరిగ్గా తెలీదు. చాలా పుస్తకాలు రాసిన మీాదట ప్రతివాడికీ ఈదశ తప్పదేమో. ఇప్పుడు నాలో తృష్ణ చల్లారిపోయింది రచనలు విరివిగా చెయ్యాలనుకున్నాను, చేశాను. నా వయస్సులో ఎవరూ సాధించనిది సాధించాలనుకున్నాను, సాధించాను. పేరు కావాలనుకున్నాను, నా తృప్తి మేరకు వచ్చింది నన్నారాధించే వ్యక్తులుండాలనుకున్నాను, అదీ జరిగింది. ఒక జీవితం అయిపోయినట్లుగా వుంది. ఏ పొంగూ, ఉద్రేకం లేవు

అంతా నీరసం, శూన్యం, నిశ్చింత మట్టుకు లేదు. ఉండ దేమోకూడా. జీవితంలో సెటిల్ కావటముంచే ఓ రకమైన అనుభూతిని పూర్తిగా పొందేశాను. నేనూ మామూలుగా మిగిలిపోయాను. నన్నెవరైనా కదిలించనిదే, కవ్వించనిదే కేవలం డాక్టరుగానే, రోగాలకు మందులిచ్చుకుంటూ గడ పాల్సి వస్తుంది"

ఇందిర గగుర్పాటు చెందింది. అతని ముఖంకేసి దీర్ఘంగా చూసింది ఎంత అమాయకంగా, కసిగా, నిష్కల్మ షంగా వుంది! ఎందుకో ఆమె నేత్రాంచలాలలో నీళ్ళు నిలి చాయి.

"ఇంత గొప్ప రచయిత మీరు — ఇలా అంటారేం ? ఎంత తపనగావుంది నాకు? అబ్బ! ఎంత దుస్సహంగా వుంది" అని వాపోయింది లోలోపల — అతన్నలాగే చూస్తూ.

## 27

ఇందిర మధుబాబుని తరుచు కలుసుకుంటోంది. ఇప్పుడు సిగ్గూ, సంకోచం చాలావరకూ తీరిపోయాయి కాని అతన్ని తను యింటికి ఆహ్వానించే ధైర్యం లేదామెకు. ఓ పరపురుషుడితో మాట్లాడేటంతటి స్వేచ్ఛ ఆమెకు లేదు యింట్లో. మొదటో రత్నకుమారీ, ఆమె కలిసి వచ్చేవారు.

తరువాత రత్నకుమారి అప్పుడప్పుడూ వస్తూండేది. ఇంటికి ఒంటరిగానే రావటం నేర్చుకుంది.

మధుబాబు జీవితంలో ఏదో చిత్రం వుంది. అతని గిరిలోకి వచ్చేవాళ్ళు అతి త్వరలో ఎంతో సన్నిహితంగా నైనా అయిపోతారు; లేక పట్టించుకోకుండా దూరంగానైనా జరిగిపోతారు. కాని మధ్యస్తంగా, కేవలం పరిచితులుగా ఎప్పుడూ మిగిలిపోరు.

ఇందిరతోటి స్నేహం అతనికి ముదావహంగానే వుంది. ఆమె దగ్గర వున్నంతసేపూ అతను విశ్రాంతిఫీలౌతున్నాడు. నిశ్చింతగా, హాయిగా వుండేది.

కాని ఇందిర యింకా లోకంలోకి సరిగ్గా అడుగు పెట్టని యువతి. అన్నలూ, చెల్లెళ్లూ, తల్లీ, తండ్రీ—యీ బాధ్యతలు, బంధాలు తప్ప అన్యం ఆలోచించటానికి ఇంకా అలవాటు పడని అమ్మాయి. మధుబాబు పుస్తకాలు చదివాక జీవితాన్ని గురించి కొంచం ఆలోచించ సాగింది. మొదట అతను చాలా పెద్దవాడనీ, కనీసం నలభయి ఏళ్ళయినా వుంటాయనీ, చాలా ప్రాంతాలు తిరిగి అనుభవం, విజ్ఞానం సంపాదించిన వ్యక్తిఅనీ అనుకుంది. కాని ఓసారి అతని ఫొటో చూశాక "యింత చిన్నవాడా?" అని విస్మయం చెంది, అతని రచనల్ని మరింత అభిమానిస్తూ వచ్చింది. ఇంతలో ఆమె తండ్రికి విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ అయింది. అప్పట్నుంచీ అతన్ని కలుసుకోవాలని ఉవ్విళ్లూరుతూనే వుంది. కాని తనంతట తను పోయి ఓ యువకుడ్ని యెలా

కలుసుకుంటుంది? ఆమె సిగ్గుపడింది. రత్నకుమారి చొరవ వల్ల చివరకు అతనికి సూటిగా వచ్చివేసింది.

ఇందిరకు యిదివరకెన్నడూ మనశ్శాంతి లేకపోవటం లేదు. జీవితంలో కష్టాలూ, యిబ్బందీ వుంటాయని తెలీదు. మధుబాబుతో సన్నిహితంగా వస్తున్నాక, అతని మాటలు వింటున్నాక ఆమెకికూడా జీవితమంటే భయం వెయ్య సాగింది ఓ రకం అశాంతి వేధించసాగింది. ఇదివరకులేని సమస్యలు యిప్పుడు ఉత్పన్న మౌతున్నాయి.

"ఏమిటల్లా వున్నారు?" అనడిగాడు ఒకరోజు మధు బాబు.

"ఎలా వున్నాను?" అని ఆమె ఎదురు ప్రశ్న వేసింది.

"దిగాలుగా, అన్యమనస్కంగా కనిపిస్తున్నారు"

"లేదే" అని ఆమె తప్పించుకో జూచింది.

"చెప్పండి పర్వాలేదు. నాకు చేతనైతే సముదా యిస్తాను. నేను యితరుల్ని ఓదార్చటానికే పుట్టాను, తెలుసా?"

"నేను మాత్రం యితరులచేత వోదార్చబడటానికి పుట్టలేదండి" అని సమాధానం చెప్పింది ఇందిర.

మధుబాబుకి చిన్న దెబ్బ తగిలింది. అతనామె ముఖం చూడలేకపోయాడు.

"కోపం వచ్చిందా?" అనడిగింది ఇందిర.

"కొంచం" అన్నాడతను బలవంతాన నవ్వి.

"అయితే శిక్ష విధించండి"

"ఏం శిక్ష?"

"మీ యిష్టం. పది గుంజిళ్ళు"

అతని మనసంతా కలికినట్లయింది. అక్కడ్నుంచి లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి బయటకు చూడసాగాడు. పద్మజ జ్ఞాపకం వచ్చింది.

"ఏమయినా బాధ కలిగించానా?" అనడిగింది ఇందిర వెనకనుంచి భయంగా.

అతను ఆమెకేసి తిరిగి "అబ్బే లేదండీ. బాధ! మీరు నాకు ఎందుకు కలిగిస్తారు?" అన్నాడు గాద్గదికంగా.

"మీకంటే చిన్నదాన్ని నన్ను 'మీరు మీరు' అన వచ్చా?"

"నేనట్లాగే అనగలనండీ. నువ్వంటే ఎలాగో వుంటుంది."

"ఇహ ఎప్పుడూ కూడా యింతేనా?"

"భవిష్యత్‌ని గురించి నేను జోశ్యం చెప్పలేను."

♦ ♦ ♦

తమ యిద్దరిమధ్యా సంభాషణ యిలాగే అంతరంగికంగా వుండటం గమనించాడు మధుబాబు. తెనలోని రచయితని చూసి ఆమె తన దగ్గరకు వచ్చినా చివరకు జనరల్ టాపిక్స్ లేకుండా పోయినాయి యిద్దరిమధ్యా. మాట్లాడలేకుండా వున్నారు. ఆ పుస్తకం రాయటంలో ఉద్దేశం ఏమిటని, యీపుస్తకం రాయటంలో ఉద్దేశంఏమిటని మొదట్లో అడుగుతూండేది. చెప్పాలంటే అతనికి భావోద్రేకం కలిగేది కాదు. మెల్లిగా విషయం తప్పించేవాడు.

"పెళ్ళిని గురించి మీ ఉద్దేశం ఏమిటి?" అనడిగింది ఒకరోజు

"నాకు దాన్ని గురించి ఉద్దేశం నశించిపోయింది. అట్టే యిష్టమూ లేదు."

ఇందిర ఆశ్చర్యంగా చూసింది.

"మరి మీ ఉద్దేశం?"

ఇందిర సిగ్గుపడింది. "అబ్బ! నాకు తెలీదు"

మధుబాబు బలవంతం చేస్తూ "పర్వాలేదు చెప్పండి. చెప్పాల్సిందే మరి" అన్నాడు

ఇందిర కనులుమూసుకుని "పెళ్ళి ఓ మధురబంధం" అంది ఎర్రబడ్డ ముఖంతో.

అతనట్లాగే చూస్తున్నాడు.

"మనిషికి నిండుతనం, సుఖం ప్రసాదించే ఆనంద దాయకమైన ఘట్టం, వరప్రసాదం."

ఆ తర్వాత చాలా సేపటిదాకా కనులు తెరవనే లేదు.

## 28

ఇందిరకూ తనకూ మధ్య తెలియన్ది ఏమయినా జరుగుతోందా? అన్న సంశయం మధుబాబుని వేధించ సాగింది. మనుషులు ప్రేమ ప్రేమ అంటారుగాని— "ఒకర్ని ప్రేమిం చాను" అన్న స్థిరమైన సత్యం స్పష్టంగా తెలుసుకోవ టం చాలా కష్టం. ఎప్పటికప్పుడు అర్థంగాకుండా, అందీ అందనగా, అందని అపూర్వంలా వుంటుంది. పొరపాటునన్నా ఆ వ్యక్తిని గురించి 'భ్రమేమో' అన్న శంక రాకుండా, తియ్య

దనానికీ, నిరంతరాలోచనకూ అంతరాయం లేకుండా వున్న స్థితే నిజమైన ప్రేమ

ఒకర్ని ప్రేమించినా ప్రేమించక పోయినా ఏ స్త్రీ అయినా ఒక పురుషుడి సాన్నిహిత్యంలో తరుచు వున్నదంటే ఆమె తప్పకుండా అతడ్ని కలవరపరుస్తుంది. మా యిద్దరి మధ్యా ఏం లేదు 'వొట్టి స్నేహహం' అని ధైర్యంగా చెప్పకోవటం బుకాయింపు. తరువాత అది స్నేహంగానే మిగిలిపోవచ్చు. సోదర సోదరీ ప్రేమక్రింద పరిణమించ వచ్చు—చంచలతను తప్పించుకోవటం మాత్రం దుస్సాధ్యం. ఓ స్త్రీ అంటే బొత్తిగా గౌరవం లేక; లేకపోతే అసహ్యం వుండి ఆమెతో ఎన్నిగంటలు. రోజులు గడిపినా వికారం కలగ లేదంటే అది వేరేవిషయం కారాణాలు స్పష్టంగా కని పిస్తూనే వున్నాయి.

ఓసారి ఇందిరకు జ్వరం వచ్చింది. రత్నకుమారి ద్వారా యీ విషయం మధుబాబుకు తెలిసి దివెళ్ళి చూడాలని ఆరాట పడ్డాడు కాని వాళ్ళయింటికి ఎట్లా వెళతాడు? ఊరుకున్నాడు.

కొన్నాళ్ళు పోయాక ఇందిర చిక్కిపోయి, కళా కాంతులు నశించిన ముఖంతో మధుబాబు దగ్గరకు వచ్చి "నాకు చచ్చిపోవాలని వుందండీ" అన్నది.

"అదేమిటి?" అన్నాడతను విస్మితుడై.

"ఎందుకూ యీ ఆరోగ్యంలేని బ్రతుకు? అస హ్యంగావుంది నాకు బ్రతకాలని లేదు. బ్రతకాలని లేదు" అని ఇందిర కన్నీళ్ళు కార్చింది.

తాను కాస్త నలుపని మరో దిగులు ఆమెకు.

*

ఇందిర ఆలోచిస్తోంది కుర్చీలో కూర్చుని. తనకు పెళ్ళి చెయ్యాలని చూస్తున్నారు తల్లిదండ్రులు. తండ్రి చేస్తోన్న ఉద్యోగం తప్ప, అక్కడెక్కడో పల్లెటూళ్ళో ఓ యిల్లూ, అయిదెకరాల పొలంతప్ప వేరే ఆస్తిలేదు తమకు. తమ కులంలో ఆడపిల్లలకు పెళ్ళి కావాలంటే కనీసం ముప్పయి నలభయి వేలయినా కట్నం యివ్వాలి. ఎక్కడుంది తమ దగ్గర అంత డబ్బు? అప్పుచేయాలి. అప్పుచేస్తే తమకుటుంబ పరిస్థితి తల్లక్రిందు లౌతుంది. అన్నల చదువు, తమ్ముళ్ళభవిష్యత్ అంతా గాలికి కొట్టుకుపోతుంది. తాను పెళ్ళిచేసుకోకుండా చదువుకుని ఉద్యోగం చేస్తానని తల్లితో అన్నది. ఆమె నవ్వి "నీ మొహంలే" అని తనమాటను కొట్టిపార వేసింది. ఈ పెద్దవాళ్ళు యింతే, తమ మూర్ఖత్వం వొదలరు. వాళ్ళ కర్థం కాదు తనగోడవ.

మధుబాబుతో పరిచయం గమ్మత్ గా అయింది. ఒక సారి అతన్తో "యింట్లో ఏమీతోచటంలేదు" అంటే "నన్ను గురించి ఆలోచిస్తూ ఉండండి—మంచికాలక్షేపం" అన్నాడు. "ఏముంది? మిమ్మల్ని గురించి ఆలోచించటానికి?" అని తానప్పుడు దబాయించింది. కానియిప్పుడతని తలపు రాకుండా ఒక్క నిముషం కూడా గడవటంలేదు. అతనుకూడా తనని గురించి ఆలోచిస్తూవుంటాడా? ఏమో! తనకీమధ్య బొత్తిగా పాఠాలమీద ధ్యాస వుండటంలేదు. జీవితమొక సురభిళ

నూనం కాదంటాడు మధుబాబు. తనకట్లా అనిపిస్తోంది. మళ్లీ అంతలో పెనుగులాట.

తాను అతన్ని ప్రేమిస్తున్నదా? అతణ్ని చూడటం చాలా యిష్టం. అతన్తో మాట్లాడటం, గడపటం, చాలా యిష్టం. రాత్రిళ్ళు చాలాసేపటివరకూ మేలుకుని అతన్ని గురించి ఆలోచిస్తూ వుంటుంది. అతని తలపులతో బ్రతుకుతోంది. మరి దీన్నేమిటంటారు. అతన్తో ఎన్నో చెప్పాలని వుంటుంది. అతని ముఖం, అమాయకంగా చూసే ఆ చిన్న కళ్ళూ చూస్తూ ఏమీ చెప్పలేకపోతుంది. దీన్నేమిటంటారు?

అనవసరంగా తానతని జీవితంలో ప్రవేశిస్తున్నదేమో. అతన్ని బాధిస్తున్నదేమో.

ఇందిర ఆలోచనల్తో అలసి పోతోంది. *

"నేనే ఆ పొజిషన్లో వుంటే పరిస్థితుల్ని మరో రకంగా ఉపయోగించుకుందును" అన్నాడు స్నేహితుడు.

"ఎట్లా?" అనడిగాడు మధుబాబు.

"ఆడపిల్లల్తో అందంగా మాట్లాడుతూ, కలలుగంటూ ఏమి చేయకుండా విడిచి పెడతావెందుకు? అట్లా చూడటం గొప్పఅని నువ్వనుకోవచ్చుగాని – అది వాట్టి అసమర్థత. మనం యీ భూమ్మీద కొచ్చింది దిగులుపడుతూ, రాత్రుళ్ళు మేలుకుని కుములుతూ, కోరికల్ని చంపుకుంటూ నిర్జీవంగా బ్రతకటానికి కాదు ఎంజాయ్ ఎండ్ లీవ్; టేక్ ఎవ్విరిథింగ్ యీజీ ప్రిన్సిపల్. యవ్వనమంతా వృథా అనుభూతులతో నింపుకుంటూ, అనుభవాన్ని వొదులుకుని ఎందుకీ చిత్రవధ?"

"అలా ఎంతమందిని ఎన్‌జాయ్ చేసి, విడిచిపెడుతూ పోతూంటాం?"

"విసుగు పుట్టేంతవరకూ. అవకాశం చేతికొస్తూంటే జారవిడుచుకుని, దానికి బంగారు మెరుగులు దిద్దటం ఫూలిష్‌నెస్. నిత్యసమరం."

"ఆ స్త్రీ అంటే యిష్టం లేకపోతే?"

"ఇష్టం, అయిష్టం సుఖానికేమీ అడ్డురాదు బ్రదర్!"

మధుబాబు ఆలోచిస్తూ కూర్చున్నాడు. యిష్టం లేకుండా సుఖం ఎలా సాధ్యం? అంత యాంత్రికంగా జీవించగలడా మనిషి? చూస్తూ చూస్తూ మనకు యిష్టంలేని కూరని బలవంతంగానైనా మింగలేమే. ఇది ఎలా సాధ్యపడుతుంది? నిజమే! తనకెన్నో అవకాశాలున్నాయి, వచ్చాయి. కాని ప్రేమించని మనిషితో యీ అసహ్యాన్ని ఎలా భరించగలడు. వ్యభిచారుల్ని చూస్తే అందుకే అతనికి కోపం, రోత ఏం బావుకుంటున్నారని? ఆత్మవంచన, అనుభూతి లేని అనుభవం, వొట్టి భ్రమ.

*

రత్నకుమారి ఊళ్లోలేదు. మరో స్నేహితురాలు సులోచన వచ్చి ఇందిరను వాళ్ళ యింటికి తీసుకెళ్ళింది. వాళ్ళది చాలా పెద్దమేడ. సులోచన బలవంతంమీద తాను అప్పుడప్పుడూ వాళ్ళ యింటికి వెడుతూవుంటుంది. ఈ సులోచనకు అన్నయ్య ఒకడున్నాడు, భాస్కరరావు. తనతో ఏదో ఒక రూపంలో మాటలు పొడిగిస్తూ వుంటాడు. తనకు అతనంటే అయిష్టం ఏమీ లేదుగాని—ఏముంటాయిమాటలు అతన్తో?

"ఇవేళ కార్‌లో భీమ్లీ వెళ్దాం" అన్నాడు భాస్కరరావు ప్రపోజ్ చేస్తూ.

"అవునన్నయ్యా. చాలా కాలమైంది వెళ్ళి. ఇక్కడే భోంచేసెయ్యవే ఇందూ. ముగ్గురం కలిసి వెళ్దాం" అంది సులోచన ఉత్సాహంగా.

"నేను రాను" అంది ఇందిర.

భాస్కరరావు ముఖం వివర్ణమైంది. ప్రక్కకి తిప్పుకున్నాడు ఏమీ గమనించనట్లుగా.

"ఎందుకు రావు?" అనడిగింది సులోచన నవ్వు తెచ్చుకుంటూ.

"రానంతే"

అన్నా చెల్లెళ్ళిద్దరూ తెల తెలబోతూ ఊరుకున్నారు.

ఇందిర వెళ్ళిపోయాక "మొండిఘటం" అంది సులోచన అన్నతో. ఆమె కంఠంలో కసి, యీర్ష్య ఏమీ లేవు.

ఇందిర యింటికి వస్తూ "అతనికేం మొగవాడు? ఎంత మంది ఆడపిల్లలోనైనా తిరగవచ్చు. కాని నాగతి ఏమవుతుంది?" అనుకుంది.

o o o

ప్రొద్దున నిద్ర లేచి నప్పట్నుంచీ అదోగ ంగా వుంది మధుబాబుకు. వంట్లో సలతగా వున్నట్టుంది. కాలేజీకి పోబుద్ధి అనిపించ లేదు. మానేశాడు. మధ్యాహ్నానికి జ్వరం వచ్చింది ఎక్కడికూ కదల్లేక పోయాడు. పనిమనిషి వస్తే బజారునుంచి కాఫీ తెప్పించుకుని తాగాడు. సాయంత్రానికి మరీ నీరసంగా

వుంది. స్నేహితులు కూడా ఎవరూ రాలేదు. రాత్రంతా బాధా, ఆలోచన్లు.

రెండు రోజులు అలాగే జ్వరంతో బాధపడ్డాడు. మూడో నాడు కాస్త నిమ్మదించింది. కొంచం ప్రశాంతంగా వుంది. సాయంత్రం అయిదవుతోంది. మంచంమీదనే పడుకుని ఆరోజు పేపరు చదువుతున్నాడు.

దగ్గరగా వేసివున్న తలుపుల్ని తీసుకుని లోపలకు వచ్చింది ఇందిర. అతను తలత్రిప్పి చూశాడు.

ఆమె ముఖం వెంటనే కళావిహీనమైంది. "ఇలా వున్నారేం?" అంది ఆతృతగా దగ్గరకు వస్తూ.

"ఆ కుర్చీ లాక్కుని కూర్చోండి... కొంచం ఫీవర్ వస్తోంది" అన్నాడు మధుబాబు నెమ్మదిగా.

ఇందిర కుర్చీని అతని మంచానికి చేరువగా లాగుకుని కూర్చుని "మరి నాకెందుకు కబురు చెయ్యలేదూ?" అంది ఖేదంగా.

"ఎవరితో?" అన్నాడతను చిరునవ్వుతో.

ఆమె ఉలికిపడింది. అతని ముఖంకేసి దీర్ఘంగా చూస్తూ కూర్చుంది. అందమైన, సుకుమారమైన అతని ముహం చిక్కిపోయి కళాహీనమైవుంది. అలా చూస్తున్నాయి ఆ కళ్ళు. ఆమె దుఃఖం ఆపుకోలేక పోయింది. ఉద్రేకంతో, ఉద్వేగంతో "మధుబాబూ! మధుబాబూ" అంటూ అతని మంచంమీదకు వెళ్ళి కూర్చుని అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి "మీరెంత కఠినులు? ఎంత పెంకెవారు?" అన్నది కళ్ళలోకి చూస్తూ.

"ఎంత దయ మీకు నామీద?" అన్నాడు మధు బాబు తన సహజ శాంత స్వరంతో.

రెండు నిముషాలు మౌనంగా గడిచాయి. ఇద్దరూ అలాగే ఒకరివంక ఒకరు చూసుకుంటూ గడిపారు

"నువ్వెవరివి ఇందిరా నాకు?" అనడిగాడు మధు బాబు

"ఎవర్ని?" అని ప్రశ్నించుకుంది ఆమె ఆలోచన వణికింది. ఏదో చెప్పబోయింది పెదవి కంపించింది.

ఎవర్ని ? నేనెవర్ని ?

"చెప్పు ఇందిరా?

"నేను మీ ప్రియబాంధవిని కానా?" అనేసిందిఇందిర ఆవేశంతో వణుకుతూన్న కంఠంతో.

అతను అప్రతిభుడయ్యాడు. శరీరం గజగజ వణికింది. నిరుత్తరుడైనాడు.

"చెప్పండి. కానా ? కానా ?" అంటోంది ఇందిర ఆదుర్దాగా.

"ఏమని జవాబు చెప్పను?" అని ఆలోచిస్తున్నాడు మధుబాబు హఠాత్తుగా కనులు మూసుకుని.

*

దీపావళి ఎంత వింత కాంతులు ! మధుబాబు రోడ్డు మీద ఒంటరిగా నడుస్తున్నాడు. ఎటుచూస్తే అటు వెలుగు

కళకళ అందమైన అమ్మాయిలూ, అన్నాచెల్లెళ్ళూ, తల్లీ కూతుళ్ళూ, భార్యాభర్తలు దీపాలమధ్య చిరునవ్వులో నిలబడి రంగులు వెదజల్లుతున్నారు.

ఎంత సంతోషంగా వుంది ప్రపంచం?

ఒకరి కొకరు ఎంత తోడునీడ !!

అతనికి ఇందిర జ్ఞాపకంవచ్చింది ఏంచేస్తూవుంటుంది. ఆనాడు వెళ్ళిపోయి మళ్ళీ యింతవరకూ కనబడ లేదు. కోపం వచ్చిందేమో! అంత హఠాత్తుగా వేసిన ప్రశ్నకు జవాబు చెప్పలేక పోయినాడు. నిశ్చేష్టురాలై, నిశ్శబ్దంగా వెళ్ళిపోయిందామె. తనని అపార్థం చేసుకుందేమో!

తోడు కావాలి తనకు. ఆ తోడు...

"ఇందిర ! ఇందిర !!"

అతను లోలోన వెర్రికేక వేశాడు. అడుగులు తడబడుతున్నాయి.

పద్మజ రూపంలో తనకు లభించని తోడు, ఇందిర రూపంలో లభిస్తోంది. ఎందుకానాడు తన పెదవులు మూతలు పడ్డాయి. "ఇందిరా నువ్వు నా ప్రియ బాంధవివే. నువ్వు నాకు కావాలి. నువ్వు లేందే నేను బ్రతుకలేను." అని ఎందుకు చెప్పలేక పోయాడు?

ఎక్కడ కనిపిస్తుంది యిప్పుడామె? ఆమె కలిసేటంతటి వరకూ ఎట్లా యీ ఉద్వేగాన్ని భరించటం?

"ఎంత కష్టాన్నైనా, ఎంత మందినైనా ఎదిరించి ఆమెని తనదాన్ని చేసుకుంటానని" అయ్యో-ఎట్లా యిప్పుడు చెప్పటం ఆమెతో? ఎంతకాలం వేచి వుండాలి?

*

"ఏమి చేస్తున్నాడో యిప్పుడు మధుబాబు?"

బయట పిల్లలు ఉత్సాహంగా టపాకాయలు కాలుస్తున్నారు తల్లీ, తండ్రి దగ్గరవుండి కాల్పిస్తున్నారు. ఇందిర తన గదిలో కూర్చుని ప్రశ్న వేసుకుంది.

తాను పెదవిజారి యెన్నికొందరపడిందా? తానంటే అతనికేమీ లేదా? మరి ఎందుకు సరియైన సమాధానం చెప్పలేదు? అతను గొప్పవాడు తనవంటివాళ్ళు ఎంతమంది అతన్ని ఆరాధించారో? తానంటే ఎందు కతనికి ప్రత్యేకతవుండాలి?

ఇంతలో ఏదో తోచి ఆమె ముఖం వెలవెలపోయింది.

"అవునంటే... ఒకవేళ అతను అవునంటే. తాను ఏమయేది?"

తాను అతన్నుంచి వాంఛించే దేమిటి? ఏమీ లేదు. గ్రుడ్డిగా ఆరాధించింది. అవునంటే తానతని కేమి అందివ్వగలదు? పెళ్ళి చేసుకోగలదా? అమ్మో! తమకులం కానివాడికి యివ్వటానికి తమయింట్లో ఒప్పుకుంటారా? చస్తే ఒప్పుకోరు. ప్రేమించానని అతన్ని వేధించటం తప్ప తానతనికేమీ చెయ్యలేదు. అతని యింట్లో ఒప్పుకోవద్దూ? ఇహ అందర్నీ విడిచిపెట్టి అతనో ఎక్కడికో వెళ్ళిపోవాలి. అంత సాహసముందా తనకు? లేదు లేదు. తాను చెయ్యలేదాపని. తనకు చేతకాదు. అతన్ని మరిచిపోవాలి. తనవల్ల అతనికి కష్టం కలగకూడదు.

"ఎక్కడున్నావ్ ఇందూ?" బయటనుంచి సులోచన గొంతు వినిపించింది.

ఆమె గాభరాపడి పమిట చెంగుతో కళ్ళు తుడుచుకుని కుదురుగా కూర్చుంది.

సులోచన లోపలకు వచ్చి—ఆశ్చర్యంగా "ఇదేమిటేవ్! బయటంతా సంతోషంగా కేరింతలు కొడుతూవుంటే ఒక్కత్తివీ దిగాలుపడి యిక్కడ కూర్చున్నావు. ఒలేదానివి' పద పద" అంటూ దగ్గరకొచ్చి చెయ్యి పుచ్చుకునిలాగింది.

"ఎక్కడికి?" అంది ఇందిర తెల్లబోతూ.

"మా యింటికి. సర్దాగా గడుపుదాం రావే మొద్దు మొహమా?"

కాసేపు అట్లాపోయి వస్తే మనశ్శాంతి లభిస్తుందనిపించింది ఇందిరకు. "పద" అని ముందుకు నడిచింది.

♦

మధుబాబు పాక కొచ్చి "ప్రియబాంధవీ!" అని మొదలుపెట్టి ఉత్తరం రాస్తున్నాడు

♦

"అన్నయ్యా, నువ్వూ మాట్లాడుతూ వుండండి. నేనిప్పుడే వస్తాను" అని వాళ్ళిద్దర్నీ మేడమీద వొదిలిపెట్టి ఇందిర "ఆగు సులో" అంటూ పిలుస్తున్నా వినిపించుకోకుండా క్రిందకు దిగిపోయింది సులోచన.

ఇందిర యిబ్బందిగా సోఫాలో కూర్చుని "ఎట్లా?" అనుకుంటోంది.

భాస్కరరావు రేడియో ఆఫ్ చేసి "ఎందుకు ఇందిరా నన్ను చూస్తే అట్లా బెదిరిపోతావు? నేను వన్యమృగాన్నా?" అన్నాడు యిటు తిరుగుతూ.

ఆమె గుండె గబగబ కొట్టుకుంది. తలవంచుకుని ఆలోచిస్తోంది.

"ఇట్లాముఖం ఎత్తి నావంక చూడు ఇందిరా! నేను మనిషిగా కనబడటం లేదా?"

ఈ గొంతులో ఆర్ద్రతకు చకితయై ఆమె ముఖంఎత్తి అతనివంక విస్మయంగా చూసింది. అతనంటే తనకేం అయిష్టంలేదు ఆకర్షణీయంగా వుండే మనిషే. ఆత్మవిశ్వాసం గల మనిషిలా కూడా కనిపిస్తున్నాడు.

"నువ్వు లేన్దే నే బ్రతకలేను ఇందిరా" అతను లేచి ఆమె దగ్గరకు వస్తున్నాడు.

ఇందిరకు భయంగా వుంది.

అతనామె ప్రక్కకువచ్చి కూర్చుని "నన్ను పెళ్ళి చేసుకోవూ ఇందిరా?" అన్నాడు జాలిగా.

ఆమె నమ్మలేనట్లుగా అతని ముఖంలోకి చూసింది.

"నిజం ఇందిరా. నిన్నుతప్ప నేనెవర్నీ పెళ్ళి చేసుకోను"

ఆమె గబ గబ ఆలోచిస్తోంది. ధనికుడు, యువకుడు, విద్యాధికుడు, సాటి కులస్థుడు తనంతటతానువచ్చి అర్థిస్తున్నాడు. అనుకున్నవాడు కాకపోయాక ... ఏం? తనని ప్రేమించే వ్యక్తియితేను. ఈవిధంగా తన తలిదండ్రుల బర్డన్ తీర్చగలిగితే తన జన్మకింకేం సాఫల్యం కావాలి?"

"జవాబు చెప్పవేం ఇందిరా?"

ఆమె గొంతు పెగుల్చుకుని "నేను చాలా బీదదాన్ని. మీ కేటుకితూగను" అని ముఖం ప్రక్కకి తిప్పుకుంది.

అతనికి బాధ కలిగింది. "ఏం మాట మాట్లాడావు ఇందిరా? నన్నంత అల్పుడిగా తలిచావా? ఈదీపావళి దీపాల వేళ నా మనస్సాక్షిగా చెబుతున్నాను. నాకు కావలిసింది నువ్వు. నీ ఆస్తికాదు" అని ఆమె చేతిని పట్టుకుని అందులో తనచేయి వుంచాడు

ఇందిర నిట్టూర్చింది. తానిప్పుడు బంధితురాలు.

*

సూర్యాస్తమయ—ఎర్రని కాంతుల్లో ఇందిర మధు బాబు కెదురుగా వచ్చింది.

"మధుబాబూ !"

"ఏం పనిచేశావు ఇందిరా!"

"నన్ను క్షమించండి మధుబాబూ వొట్టి దుర్మార్గు రాల్ని. మీ మనసు గాయ పరిచాను. నన్ను మరిచిపోండి మీరు" అందామె ఏడుస్తూ

"ఎందుకు మరిచి పోవాలి ఇందిరా?" అన్నాడతను ఆవేశంగా.

"మిమ్మల్ని వంచించాను నేను. పాపిష్ఠిదాన్ని"

"ఎంత తొందరపడ్డావు! నీకోసం నిన్ను కలుసుకోవ టంకోసం ఎట్లా తపించాను. నీకోసం నాతలిదండ్రుల్ని, యీ ప్రపంచాన్ని, సర్వస్వం త్యాగం చేసేవాణ్ని. నీ భవిష్యత్

నంతా ఆ ఒక్క నిముషంమీద నిల్పావు. ఎంత చంచలు
రాలివి ఇందిరా?"

"లేదు మధుబాబూ లేదు. మీరు మౌనంగా వున్న ఆ ఒక్క నిముషంకూడా ఆధారపడలేదు. మీరు అంగీకరించినా, మీలో కరిగిపోయే సాహసం నాలో లేదని తెలుసుకున్నాను. మా కుటుంబాన్ని ఎదిరించే శక్తి నాకు లేదన్న నమ్మకంలోకి వచ్చాను. అందుకే యీపని చేశాను మధుబాబూ. ఇహ నేను అస్వతంత్రురాలివి" జలజల కన్నీరు కారుస్తోంది.

"నువ్వు అసమర్థురాలివి. పిరికిదానివి చదివిన చదువుకు సద్వినియోగం చేసుకోలేని పరమ మూర్ఖురాలివి" అన్నాడు మధుబాబు కసిగా.

ఆమెకు ఆనందం కలిగింది. మీ యిష్టం వచ్చినట్లు తిట్టండి మధుబాబూ! మీ తిట్లుకూడా మధురంగానే వున్నాయి... నేనేం చెయ్యను? నేనేం చెయ్యను?"

అతను విహ్వల దృష్టితో ఆమెను చూడసాగాడు.

ఆమె కొంచం ముందుకుజరిగి "నేనంటే అసహ్యంగా వుందా? ఈ చదువుకున్న మూర్ఖురాలిని చూసి అసహ్యించుకుంటే ఎలా మధుబాబూ జాలిపడాలిగాని..."

అతనికుండె కలుక్కుమంది "వెళ్ళిపో ఇందిరా."

"మిమ్మల్ని ఎట్లా మరిచిపోయేది మధుబాబూ" అని ఆమె వెక్కి వెక్కి ఏడవసాగింది.

అతనిహృదయం నిర్జీవమైంది. "మీకేం ఇందిరా? ఏదో ఒక రూపంలో మీ జీవితాలకు స్పష్టత, నిండుతనం

విర్పడుతున్నాయి, సెటిల్ అయిపోతున్నారు.ఏమీ లేకుండా మిగిలిపోయేది నేనే. మీరు వెళ్ళిపోతారు. నేను బిక్క మొహంకేసి అటూయిటూ చూస్తాను. అంతా చీకటి. తడుముకుంటూ నడుస్తాను. దారి సరిగ్గా తెలియదు. అట్లాగే పడుతూ లేస్తూ పోతూంటాను ఒక్కడ్నే...''

కంఠం గడగడ వొణికి పోతోంది.

''మధుబాబూ! మధుబాబూ!''

''చీకటి పడుతోంది. వెళ్ళిరా ఇందిరా.''

''...నన్ను క్షమించారా?''

''నేను చేసినపని సబబైతే - తప్పకుండానూ.''

''ఇహ కనబడరా?''

''కనబడను''

ఆమె గొంతు మళ్ళీ వినబడలేదు. నిశీథంలో ఆమె రూపం కనబడలేదు.

*

ఆమె అందకపోయాక విలువ మరీ ఎక్కువై అతన్ని అనుక్షణం వేధించసాగింది.

లైటు వెలిగించాడు. తోటలోకి వచ్చాడు. సన్న జాజులు గుబాళిస్తున్నాయి. అతని హృదయ క్షేత్రంలో ఓ మెరుపు మెరిసింది.

''ప్రపంచమంటే మితిలేని అసహ్యం కలిగితే నాదగ్గరకు వచ్చేయండి''

పద్మజ పిలుస్తోంది, వెయ్యి గొంతుకలతో. ఎలుగెత్తి. రమ్మని, రమ్మని.



మనుబాబు హైదరాబాద్ చేరుకుని, ఓహోటల్లో దిగాడు. ఎంతో కాలంగా ఎదురు చూస్తోన్న కలయిక యిది. అతనికి చాలా భయంగా వుంది. చివరకు పద్మజనుకలుసుకో బోతున్నాడు-ఎన్నిసార్లు తనసిక్కడకు రమ్మన్న పద్మజను, తనని చిత్రవధ చేసిన పద్మజను, తన జీవితంతో పెనవేసుకు పోయిన పద్మజను. వచ్చేముందు ఉత్తరం రాశాడు:'పద్మా! నే వచ్చేస్తున్నాను చివరకు. నేను నీకు నచ్చినా నచ్చక పోయినా నువ్వు నన్ను భరించాలి. నీ యిష్టం వచ్చినన్ని రోజులు అక్కడ నేను వుంటాను. ఏంచేస్తావో, ఎక్కడకు తీసుకెడతావో అంతా నీకే వదిలిపెడుతున్నాను'

టెలిఫోన్ డైరెక్టరీతీసి ఆమెకు రాసే యెడ్రస్‌లో కేరాఫ్ అనివుండే పేరు వెతికాడు. ఆపేరు ఎవరిదో అతనికి తెలియదు. అతని అదృష్టవశాత్తూ వాళ్ళయింటో ఫోను వుంది. ఆ నంబర్‌కి ఫోన్ చేశాడు.

అతని గుండె గబగబ కొట్టుకుంటోంది.

ఎవరో అవతలి వైపు రిసీవర్ అందుకున్నారు. 'హాలోవ్' అంది ఎవరో చిన్నపిల్లాడి కంఠం.

'పద్మ...పద్మజగారున్నారా ?' అన్నాడు వణికే కంఠంతో.

'మా అత్తయ్యండీ?'

మధుబాబుకి నవ్వువచ్చింది-'అవును మీ అత్తయ్యే' అన్నాడు.

'ఉండండి పిలుస్తాను. లైనుమీద వుండండి'

అతను శ్రద్ధగా ఆలకిస్తున్నాడు.

ఒకటి... రెండు... మూడు క్షణాలు...

"హాలోవ్"

అతను ఉలికిపడ్డాడు! ఎంత సన్నగా వుంది ఆకంఠం! ఏదో లోకాతీతమైన బాధలుపడ్తూ, బయటికి సామాన్యంగా కనిపించే వ్యక్తి మాట్లాడినట్లుగా వుంది.

"మాట్లాడేది మీరేనా ?" అంటున్నాడు మధుబాబు.

"మీరెవరండీ ?"

ఒక్కక్షణం నిశ్శబ్దం. "మైగాడ్!" అంది అవతలి కంఠం.

"నేను వచ్చేశాను పద్మా!"

"ఎందుకు వచ్చావు మధూ! యిప్పుడెందుకు వచ్చావు ?" అనుకుంటోంది దిగాలుగా పద్మజ అక్కడ.

"పద్మా! పద్మా!"

"వింటున్నాను"

"నన్నేం చెయ్యమంటారో చెప్పండి యిప్పుడు"

"మీరే చెప్పండి"

"నేను హోటల్‌లో దిగాను. ఎడ్రస్ యిస్తాను, ఇక్కడికి..."

"రేపు సాయంత్రం మా యింటికి రండి"

"పద్మా!"

"అవును. ఇక్కడికే వచ్చేయండి! తప్పకుండా రండి. ఎదురుచూస్తూ వుంటాను. సెలవా మరి?"

ఆమె ఫోన్ క్రింద పెట్టేసింది అతను హతాసుడైనాడు!

తాను రావటం యిష్టంలేదా ఆమెకు? ఆ విషయం స్పష్టంగా చెప్పవచ్చుగా. "వచ్చేయ్యి...వచ్చెయ్యి" ఇలా రాసిన పద్మజ మాటలేనా అవి? ఉత్తరాల్లో జీవించి, వాస్తవంలో మరణించే మైనపు బొమ్మా పద్మజ? అసలు యీ ఆడవాళ్ళంతా అంతేనేమో! అతనికి కోపం వచ్చింది. ఆమెని కలుసుకోకుండా వెనక్కితిరిగి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని ఎలా? ఆ అసంతృప్తి మరీ భరించలేనిదిగా వుంటుంది. తను ఎందుకూ పనికిరాని అసమర్థుడిగా తయారౌతాడు. కాని ఆమె యింటికి వెళ్ళటం ఎలా? అక్కడ ఎవరెవరుంటారో ఏం పాడో! ఏం మాట్లాడతాడు అంతమందిలో? అసలంత బుద్ధిలేకుండా అక్కడికెలా రమ్మంది. నిజంగా వొట్టి మొద్దే! పైగా తనని అడవి మనిషంటుంది! ఆమే అన్నీ. పైగా రేపటిదాకా యిక్కడ ఒక్కడే యెలా వుంటాడనుకుంది?

ఆ సాయంత్రం సినిమాకు వెళ్ళాడు. చూడబుద్ధికావ ంలేదు యెలాగో ఆ రెండున్నర గంటలూ గడిపి, బయ ుకు వచ్చేశాడు. రూమ్‌కి వచ్చి అన్నం తినకుండా పడు కున్నాడు.

నిద్ర రావటల్లేదు. బయట బాగా చలిగావుంది! తలుపులన్నీ మూసుకుని, రగ్గు కప్పుకుని ఆలోచిస్తున్నాడు. ఈపాటికి ఏం చేస్తూ వుంటుంది పద్మజ!

♦ ♦ ♦

సరిగ్గా అప్పుడు పద్మజ తన డైరీలో యిలా రాసు కుంటోంది—"ఊహాలోన మధుబాబు చెరిగి పోతున్నాడు"

ముఖాన స్వేదబిందువులు అలుముకున్నాయి. అలిసి పోయిన మనసుతో ముందున్న బల్లమీదకు వాలి కళ్ళు మూసుకుంది.

♦ ♦ ♦

"పద్మజగారున్నారా?" అనడిగాడు మధుబాబు అక్క డున్న అబ్బాయిని.

"మా అత్తయ్యాండీ?"

"అవును, మీ అత్తయ్య"

"ఉంది. కూర్చోండి చెప్పివస్తాను" అంటూ లోపలకు పరిగెత్తాడు!

అతనక్కడ కుర్చీలో కూర్చుని వలువైపులా చూడ

సాగాడు. గుండె గబగబ కొట్టుకుంటోంది. ఇంత పిరికివాడా తను? ఎలాంటి శిక్ష విధిస్తోంది ఆమె తనకు?

ఓ పదహారు, పదిహేడు వేళ్ళ వయస్సులో వున్న అమ్మాయి తెర తొలగించుకుని యివతలకువచ్చింది. నల్లగా పొట్టిగా, కొంచం లావుగా వుంది. అపరిచితుణ్ని చూసి ప్రశ్నార్ధకంగా ముఖం పెట్టి "ఎవరు కావాలండీ?" అనడిగింది.

"పద్మజగారు" అన్నాడతను బిక్కముఖంతో.

"పిల్చుకు వస్తానుండండి" అంటూ ఆమె మళ్ళీ లోపలకు వెళ్ళిపోయింది.

'హమ్మయ్య' అని కుదుటపడి, మళ్ళీ ఓసారి కలయ జూచి "పెద్దయిల్లు చాలా" అనుకుంటున్నాడు.

అడుగుల చప్పుడయింది. అతను తలఎత్తి చూశాడు. లోపల్నుంచి సన్నగా, పొడుగ్గా, ఎర్రగా, చాలా అందంగా వున్న ఓ అమ్మాయి గదిలోకి వచ్చి, మధుబాబుని చూసి, కొంచం చకితురాలై "ఎవరికోసమండీ?" అంది తియ్యని కంఠంతో.

అతనామె ముఖంలోకి పరీక్షగా చూస్తూ "పద్మజ గారికోసం..." అన్నాడు.

"ఓహో! పిల్చుకు వస్తానుండండి" అంటూ ఆమె లోపలకు వెళ్ళిపోయింది తిరిగి హంసనడకతో.

మధుబాబు నిట్టూర్పు విడిచాడు.

ఓ నిముషం గడిచాక మొదట లోపలకు వెళ్ళిన అమ్మాయి యివతలకువచ్చి "గదిలోకి రమ్మంటుందండీ అత్తయ్య" అన్నాడు.

"ఎక్కడికి ?"

"తన గదిలోకి. రండి తీసుకువెడతాను"

అతను లేచి నిల్చున్నాడు. కుర్రాడి వెనక నడవ సాగాడు.

మూడు నాలుగు గదులు దాటాక ఓ తెర కట్టివున్న గది చూపించి "యిదే, లోపలకు వెళ్ళండి" అన్నాడు.

అతని కాళ్లు తడబడినాయి. ఒక్కక్షణం కదలకుండా నిలబడి పోయాడు. ఆ క్షణంలో అతననుభవించిన యమ యాతన రాయటానికి నా కలం జంకుతోంది. అర్థం చేసుకునే సానుభూతి పరులెవరైనా వుంటే ఓ నిట్టూర్పు విడవ వచ్చు.

తెగించి, లోపలకు అడుగుపెట్టాడు.

"రండి" అంది పద్మజ.

అతడామెని చూశాడు ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి అనుకోకుండా. ఆమె అతన్ని నఖశిఖ పర్యంతం చూస్తోంది. "కథ ముగింపుకు వచ్చింది" అని పదే పదే అనుకోసాగాడు మధుబాబు.

"కూర్చోండి" అంది తియ్యటి కంఠంతో పద్మజ.

అతనామె కెదురుగా ఓ సోఫాలో కూర్చున్నాడు. ఇద్దరూ మౌనంగా, ఏమీ మాట్లాడలేని స్థితిలో ఒకవంక ఒకరు నిముషాల తరబడి అవలోకించుకుంటున్నారు.

"యూ ఆర్ గ్రేట్" అనుకున్నాడు మధుబాబు. అది ఆమెని చూశాక అతనికి కలిగిన మొట్టమొదటి తలపు.

మామూలు అంతస్థుకు అందని అపూర్వ వ్యక్తిలా, యీ లోకానికి సంబంధించని మనిషిగా, అతీతంగా, చిత్రంగా, అందని తియ్యని ఆశగా, బాధల్ని అణిచి పెట్టుకుంటూ బలవంతంగా జీవించే ప్రాణిగా, వరమివ్వని దేవతలా, తెల్లగా, జపాన్ బొమ్మలా, సంతోషంతో అందంగా, సన్నజాజి గుచ్ఛంలా, అతి సుకుమారంగా, చురుగ్గా, తెలివిగా, అద్భుతంగా వుంది పద్మజ. ఇరవై, ఇరవై ఒకటి ఏళ్ళకన్న ఎక్కువ వుండవు. కొంచం పొడుగ్గా, పొడుక్కి కొంచం తగినలావుగా ఉంది. ముఖ్యంగా ఆ కళ్లు... అబ్బ!... "ఒక కోటిలోనే కాదు, ఈలాంటి స్త్రీ యీ భూమ్మీద లేదు" అనుకున్నాడు మధుబాబు ఆశ్చర్యంగా!

నిజంగా పద్మజ అలా వుందో లేదో నేను స్పష్టంగా చెప్పలేను కాని మధుబాబు కళ్ళకు అలా కనిపించిందనటంలోనూ, అతని హృదయపు లోతుల్నుంచీ యీ ఊహాలన్ని పొంగిపొర్లాయనటంలోనూ రవ్వంతకూడా అతిశయోక్తి లేదు!

"ఏం మాట్లాడేది?" అన్నాడు మధుబాబు అసహాయ కంఠంతో, జాలిగా. అది సంభాషణకు నాందీ ప్రస్తావన. చాలా నిరసంగా వుంది అతనికి.

"ఎందుకు వచ్చేశారు?" అనడిగింది పద్మజ నిట్టూర్చి.

"రాకుండా వుండలేక పోయాను. రాకుండా వుండలేక పోయాను" అన్నాడు, గొణుగుతున్నట్లు మధుబాబు.

పద్మజ తన రెండు చేతుల్తో ముఖాన్ని దాచుకుంది.

"అంతా పాడుచేసేశారు, అంతా పాడుచేసేశారు" అంది వ్యతీతంగా.

అతను మాట్లాడకుండా చూస్తున్నాడు.

ఆమె ముఖాన చేతులు తొలగించి "ఎందుకు వచ్చేశారు ఇంత హఠాత్తుగా? నన్ను ఓ సారిచూసి చేతులు దులిపేసుకుని పోదామనా?"

"నేను రావటం మీకు ఇష్టంలేదా?"

"ఇష్టం... ఇష్టం... అబ్బ! నా భావాలు... ఊహలు ఎలా అర్థమౌతాయి మీకు? ఏం చెప్పేది మీకు?"

"పద్మా!" అన్నాడు మధుబాబు గాద్గదికంగా!

"ప్రపంచమంటే అసహ్యం కలిగితే యిక్కడకు వచ్చెయ్యమని ఒకసారి మీరు వరం యిచ్చారు. రావటానికి నేనూ భయపడ్డాను. మీ ఊహాస్వప్నం నాకు తెలుసు. నేను మీకు సహవృక్షని కానని తెలుసు. ఎక్కడకూ పోలేక, ఏమీ చెయ్యలేక, చితికి ఛిద్రమైన హృదయంతో, అంతిమ ఆశతో మీ దగ్గరకు వచ్చాను. నేను మీముందు చాలా అల్పుడినని నా అంతరాత్మ ఘోషిస్తోంది! మీరు చాలా గ్రేట్. కాని అనవసరంగా నన్ను మీరు ఇమాజిన్ చేసుకున్నారు. మీరు అనుకున్నట్లు వుండటం నాకెలా సాధ్యం? దానికి నేనేం చేయగలను? నన్నెవరైనా ప్రేమిస్తే, అభిమానిస్తే నన్ను నన్నుగానే చూసి, నా సర్వస్వం—లోపాలూ, గుణాలూ అన్నీ తెలుసుకుని అభిమానించాలి. నన్ను ఎవరిగానో; ఎలాగో చిత్రించుకుని ఆరాధించటం నాకిష్టంలేదు.

అది నేను భరించలేను. ఆ ఆరాధన నా కొద్దు! నా కొంత చిత్రహింసో మీకు తెలియదు. మన స్థితి యింతవరకూ వచ్చాక మిమ్మల్ని మరిచిపోవటం దుస్సాధ్యం కావచ్చు! కాని ఈ దాగిలి మూతలకు స్వస్తి చెబుదామని, యీ సంఘర్షణని బ్రేక్ చేసేద్దామని ఇక్కడకు వచ్చేశాను. పద్మా! నీ ఊహాస్వప్నం చెదిరిపోతే క్షమించు. చాలాసార్లు చెప్పాను—అట్లా చెయ్యొద్దని. కాని చేశావు ఫలితం యిద్దరం అనుభవిద్దాం. వస్తా పద్మా"

అతను లేచి నిలబడ్డాడు. ముఖం ఎరుపెక్కింది. పెదవులు వొణుకుతున్నాయి. చూపులు చలిస్తున్నాయి విషణ్ణంగా, విషాదంగా.

"వెళ్లొద్దు" అంది పద్మజ ఆదుర్దాగా, తొట్రుపాటుతో.

అతను ఆశ్చర్యంగా చూశాడు.

"అవును మీరు వెళ్ళొద్దు. నన్ను నమ్మండి. మీరు నన్ను డిసెప్పాయింట్ చెయ్యలేదు నిజం మధూ! ప్లీజ్ రండి."

"నన్ను మీరు అసహ్యించుకోవటం లేదా?"

"ఊహుం"

"నన్ను చూసి ఏమీ ఆశాభంగం పొందలేదా?"

"ఊహుం"

"నన్ను... నేనంటే యిష్టమేనా?"

ఆమె తల ఊపింది, సిగ్గుపడుతూ,

అతనికి పెద్ద బరువు తొలగిపోయింది. ఎంత తేలిగ్గా, హాయిగా వుందిప్పుడు? తిరిగివచ్చి కూర్చున్నాడు.

"మిమ్మల్ని చూస్తుంటే నాకంటే ఎంతో చిన్న వారనిపిస్తోంది యిప్పుడు. ఎంత పసిగా వున్నారు. అదే మిటి... సరిగ్గా కూర్చోండి"

మధుబాబు సోఫా మీదనుంచి పాదాలు క్రిందపెట్టేసి "సారీ. అట్లా కాళ్ళు మీదపెట్టుకుని కూర్చోవటం అల వాటు" అన్నాడు సిగ్గుపడుతూ.

పద్మజ కొంచం నవ్వి "అట్లా బ్లంట్‌గా చెప్పేసి నందుకు సారీ. ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు...?" అంది.

"హోటల్లో ఎందుకు దిగారు. ఈ ఊళ్ళో మీ కెవరూ లేరా?" అనడిగింది ఆమె మళ్ళీ.

"ఎందుకు లేరు? ఉన్నారు."

"ఎవరూ?"

"మీరే"

ఆమె తలవంచుకు కూర్చుంది. ఓ క్షణం గడిచాక ముఖంఎత్తి "ఎంత వేదనగా వున్నదో తెలుసా నాకు?"

"ఏమలా?"

"అర్థంకాలేదా? మీ రిక్కడ—నే నిక్కడ. యీ నాలుగు గోడల మధ్య మీకు నేనేమీ చేయలేను. నా ప్రవర్తన చూసి మీ రెంతో నిరాశ పొందుతారు. నావల్ల మీ కేమీ శాంతి లభించదు" ఆమె దీనంగా అంది.

"ఎందుకని పద్మా. ఎట్లా రాశావు ఉత్తరాల్లో. వచ్చెయ్యి వచ్చెయ్యి అని ఎట్లా పిలిచావు?"

"అదంతా—అబ్బ ఎంతో ఆవేశం మధూ! అప్పుడు నువ్వువస్తే అట్లాగే చేసేదాన్నేమో! ఎన్ని కలలు గన్నాను. అబ్బ! ఎన్ని ఊహాలు? నువ్వు వచ్చావని తెలియగానే నీ దగ్గరకు పరిగెత్తుకుని వచ్చేద్దామనుకున్నాను మన మిద్దరం ఒక యింట్లో వున్నట్లూ—నిన్ను నిద్రలేపి, కాఫీ అందివ్వటం, ఎక్కడో వంటరిగా... అబ్బ! ఎంత యిన్స్పిరేషన్! అందుకే అంతా పాడుచేశావని కోపంగా వుంది. ఎంత డల్ గావుంది యిట్లా కలుసుకోవటం! ఏమిటి మధూ? ఇట్లా చేసేశావు— నన్నింత చేతకాని దాన్నిగా చేసి, యీ స్థితిలో...ఎట్లా భరించేది మధూ! నేనెట్లా భరించే దీఅవస్థ?" పద్మజ పిచ్చి దానిలా తాపత్రయ పడిపోతోంది.

మధుబాబు ఓక్షణం నిదానించి "నేనిప్పుడు రావటం మంచిపని కానట్లయితే—భవిష్యత్తులో అలాంటిరోజు ఒకటి వుండగలదా పద్మా! నీకు నమ్మకం వుందా?"

"నాకు నమ్మకంవుంది. తప్పకుండా వచ్చేది" అందామె ఎంతో విశ్వాసంగా.

"ఎలా? నీది వొట్టి కలలుగనే స్వభావం పద్మా. అట్లా ఊహాలు నిర్మించుకుని, ఆ ఆశల్లో జీవిస్తూంటావు. ఇప్పుడు లేనిది, యీ జన్మలో, ఒకరి భార్యగా వుండి ఎట్లా సాధ్యం? నీ కెంతో స్వాతంత్ర్యం వుందనుకున్నాను. ఎన్నో కలలతో, ఏదో జీవిద్దామన్న ఆశతో నిన్ను వెదుక్కుంటూ వచ్చాను. మొదట నిన్నుచూసిన క్షణంలో నాకంటే ఎన్నో

రెట్లు ఎక్కువగా, తలఎత్తి చూడటానికి అందని అంతస్థులో వున్నావనిపించింది. అంత చనువుగా యీ దేవత కెట్లా రాశాను అనిపించింది నీకూ్కడా వున్నాయా పద్మా యీ బంధాలు, నిబంధనలు. నా కోసం... నా కోసం బయటికి రాలేవా?"

ఆమె ఖేదంగా, విచార వదనంతో "అయ్యో! నేను కూడా ఎంతో సామాన్యురాల్ని మధూ! మామూలు ఆడదాన్ని... మామూలు ఆడదాన్ని"

అతనేమీ మాట్లాడలేక పోయాడు. ఆమె కళ్ళలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు.

"కాఫీ తీసుకు వస్తాను" అంటూ లేచి వెళ్ళింది ఆమె.

ఓ అయిదు నిమిషాల్లో రెండు చేతుల్లోనూ, రెండు కప్పులతో తిరిగివస్తూ "అదిగో మళ్ళీ సోఫామీద కాళ్ళు..."

"సారీ" అంటూ తీసేశాడు.

"ఏం చేయుచుంటావు చెప్పు పద్మా?" అన్నాడతను కాఫీ త్రాగుతూ దిగులుగా.

"నన్నేం చేయమంటారు చెప్పండి."

అతను కొంచంగా నవ్వాడు.

"నాకు నవ్వు రావటంలేదు" అంది పద్మజ.

"నాకూనూ"

"కాని మీరు నవ్వారు"

"ఏడవలేక"

ఆమె కొంచంగా వొణికి, మెల్లగా కాఫీ త్రాగ సాగింది.

"నేనిట్లా యిక్కడకు రావటం, యిట్లా వుండటం నీకేమైనా యిబ్బంది..."

"ఇవాల్టికి పెద్ద యిబ్బంది లేదు."

"మీ వారు..."

"ఓ అరగంటలో వస్తారు."

అతని మనసంతా అదోలా అయిపోయింది. "నేనింక వెడతాను పద్మా" అన్నాడు అనుకోకుండా.

ఆమె భయంగా చూసింది.

"నేను వెళ్ళటం నీకు యిష్టంలేదా?"

"ఉహుం" అని తల అడ్డంగా తిప్పింది.

"మరి అయితే వుండేదా?"

"వద్దు"

"ఆ పన వస్తారనా?"

పద్మ నవ్వింది.

"మనం మళ్ళీ ఎలా కలుసుకోవటం?"

"ఎలా...ఎలా కలుసుకుంటాం...పోనీ ఓ విషయం చెప్పేదా?"

అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"నన్ను మరిచిపోండి."

"పద్మా?"

"నిజం. ఇంతకంటే ఏం చేయలేం మనం. నేను వొట్టి అస్వతంత్రురాలిని. మీ రిక్కడికివచ్చి అంతదూరంగా వుండటం భరించలేను. మీరు ఊరికి వెళ్ళిపోండి యివాళే"

"పద్మా!" అన్నాడు ఆవేశంగా. "నేను నిన్ను విడిచి మళ్ళీ ఆ విశాఖపట్నానికి పోయి వుండలేను పద్మా. ఆ చదువు, ఆ యాంత్రికమైన వాతావరణం, ఆ వొంటరితనం, చీకటి, అర్థరాత్రి ఆలోచనలు-నేను బ్రతుకలేను పద్మా. నాకు మళ్ళీ ఆ శిక్ష విధించకు. నేను... నేను..."

ఆమెకు ఏడుపు వచ్చింది. "అట్లాగే వుంటుంది మధు బాబూ! కొంతకాలం అయినాక మళ్ళీ మామూలుగా అయిపోతారు. అలవాటయి పోతుంది" అంది దుఃఖాన్నాపు కుంటూ.

"లేను పద్మా. నిన్ను విడిచి వుండలేను. నాకెవ్వరూ లేరు. నీతో యింకా యింకా గడపాలి. నాకు తనివితీర లేదు. నీతో చాలా చెప్పాలి యింకా."

"ఎట్లాగ? ఏం చెయ్యను...?"

"రేపు నా దగ్గరకు రా పద్మా"

"ఎంత కష్టం మధూ! నేనెట్లా తట్టుకోగలను?"

"నాకోసం... తప్పదు పద్మా"

ఆమె నిట్టూర్చింది "అట్లాగే మధుబాబూ"

అతని కళ్ళు సంతోషంతో మెరిశాయి. "నిజంగానా పద్మా?"

"ప్రామిస్"

"వస్తాను. సెలవు" అంటూ అతను ఆమెని విడిచి వచ్చేశాడు.

ఎంత సంతోషంగా వుంది?

అప్పుడప్పుడు. ఎంతో దుఃఖంగా వుంది.

# 30

రాత్రంతా నిద్ర పట్టలేదు మధుబాబుకు. అతనికి చిత్రంగా వుంది. ఏమిటీ బాంధవ్యం తనూ యిద్దరిమధ్యా? అర్థంలేని అయోమయ భ్రాంతి, అనుక్తిలేని ఆకర్షణ. ఏం చేస్తూ వుంటుంది పద్మజ? కలవరపాటుతో నిద్రపోతూ వుంటుందా?

తానిక్కడనుంచి తిరిగి వెళ్ళలేడేమో అనిపిస్తోంది. జీవితం అయిపోయినట్లుగా వుంది.

ఆలోచనల్తో తెల్లవారింది.

ఏడు గంటలకల్లా స్నానం చేసి, బట్టలేసుకుని, రెండు సార్లు కాఫీ తాగేసి కూర్చున్నాడు. ఇక్కడకు వచ్చినప్పటి నుంచీ భోజనం సహించటంలేదు. అసలు ఆకలి అనేది ఎవరికైనా వుంటుందా అనిపిస్తోంది.

ఇప్పుడప్పుడే ఆమె రాదని తెలుసు. అయినా ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

ఎనిమిది... తొమ్మిది... పది... పదకొండు...

గదిబయట అడుగుల చప్పుడవుతోంది. అతను చేతిలో పట్టుకున్న పుస్తకంలోంచి తలఎత్తి చూశాడు. కిటికీలోంచి కనిపించింది ఆమె ముఖం. తలుపులు దగ్గరిగానే వేసి వున్నాయి; తీసుకుని లోపలకువచ్చింది. "ఆలస్యం చేశానా?" అంది నవ్వుతూ.

అతను లేచి నిలబడి "కూర్చోండి" అని కుర్చీ చూపించి తాను మంచంమీద దిండు వొళ్ళోకి లాక్కుని కూర్చున్నాడు. "ఆలస్యం చేయటానికి ఫలానా టైమని చెప్పలేదుగా" అన్నాడు.

పద్మజ అతని ముఖంకేసి చూస్తూ ముసిముసిగా నవ్వింది. ఆమె అట్లా నవ్వటం అతనికి చాలా యిష్టమనిపించింది. ముత్యాలవంటి పలువరసా, లేత చిగుళ్ళూ... అతనికి ఎంతో బావుంది.

నిన్నటికీ, యివాల్టికీ ఎంతో తేడా కనిపించింది ఆమెలో. నిన్న ఏదో బాధ దాచుకున్న దానిలా వుంది. ఇవాళ చలిపిగా, అల్లరిపిల్లలా వుంది. నిన్నటికన్న నిండుగా, గోముగా వుంది.

హఠాత్తుగా ఆమెని చూస్తే అతనికి జాలివేసింది, తనకోసం యిట్లా గదికి వచ్చినందుకు.

"కళ్ళు ఎర్రగా వున్నాయేం?" అని ప్రశ్నించింది పద్మజ.

"ఊరికినే సరదాకి."

"ఏమిటలా ఊరికినే చూస్తారు? ఏమయినా చెప్పండి. ఎంత శ్రమపడి వచ్చానో తెలుసా?"

"చాలా శ్రమ కలిగిందా నీకు నావల్ల?"

"ఊఁ. మరిమీరు నన్ను శాంతిగా వుండనిస్తారు గనుకనా?" అంటూ ఆమె డ్రెస్సింగ్ టేబులుమీద చెల్లాచెదురుగా పడివున్న వస్తువుల్ని చూస్తూ "సర్దనా వీటిని?" అంది.

"సర్దండి చూదాం."

"ఊఁ సర్దను. నా యిష్టం!" అంటూ ఆమె అక్కడి వస్తువులన్నీ దువ్వెనా, తలనూనె సీసా అటూ యిటూ కదిపి చప్పుడు చెయ్యసాగింది. "చప్పుడుచేస్తే కోప్పడతారా?"

"ఊహుఁ" అంటూ చెంపమీద చిన్న దెబ్బ వేస్తానని సౌంజ్ఞ చేసి చూపించాడు

నిన్నటి బిడియం పోయింది. అతడామెకు యెంతో చేరువగా వచ్చేస్తున్నాడు. ఆమె అద్దంలోంచి అతనివంక తన్మయంగా చూసింది.

"మీకు ఎక్కువ కోపం వచ్చేస్తూంటుందా?"

"కొంచం ఎక్కువగానే వచ్చేస్తూ వుంటుంది" అన్నాడు మధుబాబు

"కేర్ చెయ్యను" అంది పద్మజ.

"మరి అహం ఎక్కడకు పోతుంది?"

పద్మజ సంతోషపడ్తూ "అచ్చం ఉత్తరాల్లో మధుబాబులాగా మాట్లాడుతున్నారు యిప్పుడు. నిన్న అంత సీరియస్‌గా వున్నావేమిటి?" అంది.

"ఒక పులిబోనులో ప్రవేశించినట్లు ప్రవేశించాను నిన్న మీ యింటికి! ఇంటినిండా ఎవరో అమ్మాయిలు! నువ్వేమో ఓ లార్డ్‌లా గదిలో కూర్చుని అక్కడికి రమ్మన్నావు. ఇంక సీరియస్‌గాక మరేమిటి?"

పద్మజ దిగులుగా నవ్వింది—"అంతకంటే ఏమీ చేయ లేక పోయాను. మీ దగ్గరకు యిలా రావాలంటే ఎంతో భయం వేసింది. అసలు రాగలుగుతా ననుకో లేదు"

"ఎందుకు పద్మా నేనంటే భయం? నేనేం చేస్తా నని?" అన్నాడు మధుబాబు జాలిగా.

"మిమ్మల్ని చూసి కాదు, పరిస్థితుల్ని చూసి"

అతనేమంటాడు? ఒకటి రెండు క్షణాలాగి "భోజనం చేసి భయల్దేరావా పద్మా?" అనడిగాడు

"ఆఁ ఏం?"

"ఏం లేదు. కాఫీ తెప్పిద్దామని"

"భోంచేస్తే కాఫీ తెప్పించరా?"

"ఆరోగ్యానికి మంచిదికాదు"

"మీరు అన్నం తిన్నారా?"

అతను యిబ్బందిలోపడి "లే...దు" అన్నాడు.

"ఎందుకసి!"

"ఊరికినే. ఆకలి లేదు"

"అయితే యిక్కడకు తెప్పించుకోండి. మీరు తింటూంటే చూడాలని వుంది" అంది ఉత్సాహంగా పద్మజ.

"అహాఁ నాకు సిగ్గేస్తుంది. నువ్వూ తింటానంటే యిద్దరికూ తెప్పిస్తాను"

"అమ్మబాబోయ్! ఓ అరగంటకూడా కాలేదు మీరు తినాలిసిందే" అంటూ ఆమె బలవంతం చేసింది. కాని

అతను ఎంతకూ తినకపోయేసరికి విసుక్కుని "అనుభవించండి. ఎవరికర్మ కెవ రేం చేస్తారు?" అంది.

"అవును కర్మే"

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతనికి కనబడకుండా ఉండాలని, మాట మారుస్తూ "నాకు కాఫీ తాగాలని ఉంది" అంది గారాబంగా.

అతను లేచివెళ్ళి బాయ్‌ని పిలిచి కాఫీ తీసుకురమ్మని చెప్పి లోపలకు వచ్చాడు.

"నాకు దాహం వేస్తోంది. మంచినీళ్లు కావాలి" అంది పద్మజ మళ్ళీ.

అతను కిటికీలోవున్న గ్లాసు తీసి, ప్రక్కనున్న బాత్ రూమ్‌లో, టాప్ దగ్గర కడిగి, మంచినీళ్ళ కూజా దగ్గరకొస్తున్నాడు.

"నేను పోసుకుంటాను లెండి"

"గొప్పపని చేశారులెండి" అంటూ అజాగ్రత్తగా నీళ్లునింపి ఆమె చేతికి అందించాడు.

ఆమె కొంచం తాగి "దాహం వెయ్యటంలేదు" అంది నవ్వి.

అతనుకూడా నవ్వి "నాకు తెలుసు" అన్నాడు.

"ఆ ఫ్యాక్ట్ హాట్టి అలంకారం కోసమా?... వెయ్యరా?"

కూర్చబోతూన్న వాడల్లా లేచి ఫ్యాన్ స్విచ్ ఆన్ చేసి వచ్చాడు చలివేయ సాగింది.

"అబ్బ! చలేస్తోంది, ఆపెయ్యండి బాబూ"

అతను లేచి ఫ్యాన్ ఆపేశాడు.

"అటూ ఇటూ తిప్పిస్తున్నానని కోపంవస్తోందా?"

"కొంచం..."

"కోపంవస్తే చెంపలు వాయించేస్తారా?"

"ఊహుఁ, చెవి మెలిపెట్టేస్తాను"

ఇంతలో కాఫీ వచ్చింది. బాయ్‌వచ్చి ట్రేని బల్ల మీదపెట్టి వెళ్ళిపోయాడు. మధుబాబు లేచివెళ్ళి "కొంచం లేచి ఆ మంచంమీద కూర్చుంటారా రాణీగారు. కాఫీ కల పాలి" అన్నాడు.

"నాపేరు పద్మ. రాణీగారు కాదు"

'నాకుమాత్రం రాణీగారే'

'అయితే మీ రెవరు?'

'మీ సేవకుడ్ని'

'అయితే నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. కాఫీ తయారుచేసి యియ్యి'

'తమరు కాస్త కుర్చీలోంచి లేవండి'

ఆమె నవ్వుకుంటూ లేచి మంచంమీదకు వెళ్ళి కూర్చుని—అతను పాలూ, డికాషన్, పంచదారా జాగ్రత్తగా కలుపుతోంటే ఆసక్తిగా తిలకిస్తోంది.

'తీసుకోండి' అతను కాఫీకప్ ఆమెకు అందిచ్చాడు.

ఇద్దరూ కాఫీ తాగుతూ ఒకటి రెండు నిమిషాలు మౌనంగా ఊరుకున్నారు. 'ఇలా సైలెంట్‌గా వుంటే నాకు బావుండదబ్బా' అన్నది పద్మజ వున్నట్లుండి.

'అయితే యిద్దరం కలిసి కేక లేదాం. అప్పుడు బాగుంటుంది'

ఆమె అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ "అవును గాని మీరు నాకు ఉత్తరాలు రాయటం ఎందుకు మానేశారు?' అంది హఠాత్తుగా.

అతను విచలితుడయ్యాడు. సంభాషణ యిలా తిరుగుతుందనుకోలేదు.

'చెప్పండి. అలా ఆపేయటంవల్ల నేనెంత బాధపడ్డానో, నా కళ్ళు ఎలా వర్షించాయో మీ కేమైనా తెలుసా?'

మధుబాబు యిహ విధిలేక 'రాశానా విషయం. మీకు పెళ్ళయిందన్న సంగతి తెలిసి...'

'నాకు పెళ్ళయితే రాయటం మానెయ్యాలా?'

అతను జవాబు చెప్పలేదు.

'మీ మగవాళ్ళంతా యింతే. విశాల హృదయం వుండదు మీకు నాకు పెళ్ళయివున్నంత మాత్రాన నన్ను మరిచిపోవాలా మధుబాబూ! అప్పుడు నేను సన్నిహితంగా

వుండకూడదా? నన్ను గురించి అన్యవిధంగా, అందరిలా భావించవద్దని యెన్నిసార్లు సూచించాను? అంత స్వార్థంగా ఎందుకు ఆలోచించాలి మీరు?' ఆమె కంఠం వొణికింది.

మధుబాబుకు ఆమె భుజాలు పట్టుకు కుదిపి గట్టిగా అడిగేయాలనిపించింది 'ఓ యువతి, తనకు పెళ్ళిఅయిన విషయం చెప్పకుండా దాచి, ఓ యువకుడ్ని స్వప్నసీమల్లో విహరింపజేసి, అతని హృదయ వీణాతంత్రుల్ని మధురంగా మోగించి. అతనే తన సర్వస్వం అన్న భ్రమ కలిగించిన స్థితిలో-ఆ యువతిని పత్నిగా చేసుకునేందుకు అతను ఉబలాట పడితే అది స్వార్థమా పద్మా!' అన్నాడు.

ఆమె చకితురాలైంది. అతనివంక విహ్వాల దృష్టితో చూసింది.

'ఆమె వివాహిత అని తెలిసినప్పుడు అతను నరకం అనుభవించి, ఆ మహాయాతనలో అందని ఆ దేవతకోసం, తనకోసం ఏమీ చెయ్యలేని ఆమెను మరిచిపోదామని, ఫలితంలేని ఆవేదనలు పెంపొందించుకోవటానికి భయపడి, ఆమె జీవితాన్ని అశాంతిపాలు చేస్తున్నాననే భీతితో మౌనం వహిస్తే అది స్వార్థమా పద్మా?'

ఆమె అలాగే చూస్తోంది, నిర్ఘాంతపోయి.

'నువ్వు నాకు సన్నిహితంగా వచ్చాక ఏ వొక్క అరగంటకూడా నిస్మృతి లేకుండా గడపలేక, దూరంగా నిన్ను తలుచుకుంటూ, వంటరితనంలో అల్లాడిపోతూ, తోడుకోసం తపించిపోతూ, నలిగి, నశించిపోయిన నా బ్రతుకు నీకెలా అర్థమౌతుంది పద్మా?'

ఆమె నేత్రాలలో నిశ్శబ్దంగా నీరు సాగాయి.

"నన్నుగురించి నువ్వు ఓ రూపాన్ని నిర్మించుకున్నావు. దాన్ని ఆరాధించావు. ఆ విషయం రాసి నాకెంత క్లేశం కలిగించావో నీకు తెలీదు. నిన్ను గురించి నేను ఏ రూపం చిత్రించుకోలేక పోయాను. రూపంలేని నిన్ను ఆరాధించాను. నా చంచల ప్రవృత్తితో నీకో బాహ్య స్వరూపం వూహించి, అది తెలుచుకుని ఉవ్విళ్ళూరటానికి నా అంతరాత్మ అంగీకరించలేదు. నువ్వు ఏ రూపంలో కాదు. ఎలావున్నా యిదే నిశ్చల చిత్తంతో నీ ముందు నిల్చుని వుండేవాణ్ని!"

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

"నాకే పెళ్ళయివుండి, నువ్వు అవివాహితవై వుంటే యిదే ఉద్రేకంలో నేను రాసివుంటే—అది నిశ్చలప్రేమగా, నిజాయితీగా నువ్వు హర్షించేదానివా పద్మా? నేను అన్యాయం చేశానని, నమ్మించి మోసంచేశాననీ నిందించేదానివి కాదా? ఎంత కోపగించుకుని, అసహ్యించుకునివుండేదానివి! కాని ఆశ్చర్యం! నువ్వంటే నాకీ రెండూ లేవు పద్మా!"

"అబ్బ! చెప్పకు మధూ! అలాంటి సత్యాలు నాకు చెప్పకు. నేను భరించలేను" అని ఆమె యిహ ఆపుకోలేక ఏడువసాగింది.

అతను కదలకుండా, విషాదంగా ఆమె ముఖంకేసి చూస్తున్నాడు.

పద్మజ సిగ్గుపడి, పమిట చెంగుతో కళ్లు తుడుచుకుని కుదురుగా కూర్చుంది.

మధుబాబు హఠాత్తుగా "నువ్వెందుకు పెళ్ళి చేసుకున్నావు పద్మా? ఎందుకలా చేశావు?" అన్నాడు గాద్గదిక కంఠంతో చిన్నపిల్లాడిలా.

పద్మజకు అంత దుఃఖంలోను నవ్వు వచ్చింది. ఆమె రెప్పలు నిర్మల, అమాయిక హృదయాన్ని వ్యక్తంచేస్తూ విప్పారినై.

"చెప్పు పద్మా! నువ్వు చెప్పిందంతా అబద్ధమేననీ, నువ్వు అవివాహితవేననీ చెప్పు" అన్నాడతను ఆవేశంగా.

"నాకు పెళ్ళయిందని నీకు నమ్మకంలేదా?" అన్నదామె.

"ఉహుఁ" అన్నాడతను మొండిగా.

నిజానికి ఆమె కంఠాన మంగళసూత్రం కనబడటం లేదు. అదిచూసి అతను అపోహపడలేదు. ఊరికినే మొండిగా అన్నాడు.

పద్మజ తన పమిట కాస్త ప్రక్కకి తొలగించి, హృదయాన, రవికలోనుండి కనబడుతోన్న మంగళ సూత్రాన్ని చూపించి "అనుమానం తీరిందా?" అంది

"నాకు ముందే తెలుసు పద్మా" అన్నాడతను నిరాశగా.

* * *

"నువ్వు పెళ్ళిచేసుకో మధూ! నీ పెళ్ళికి నేను వస్తాను. హడావుడిగా అటూ యిటూ తిరిగి, చకచక పను

లన్నీ చేసేస్తూ పెత్తనం చెలాయిస్తాను. నీ అమ్మగారూ, నాన్నగారూ నన్ను చూసి 'యీ పిల్ల మా యింట్లో వుంటే బాగుండేది' అని అనుకునేటట్లు చేస్తాను."

"ఊహుఁ. నేను పెళ్ళిచేసుకోను."

"ఏం?"

"నాకు కావలిసిన వ్యక్తి దొరకదు గనుక."

"ఎందుకు దొరకదు? ఎక్కడ తపస్సు చేస్తోందా పిల్ల?"

"లేదు. లేదు. అలాంటి పెళ్ళికాని పిల్ల లేనేలేదు."

*　　　*　　　*

మధుబాబు "నిన్ను విడిచి, మళ్ళీ ఆ అజ్ఞాతవాసానికి ఎట్లా వెళ్ళను పద్మా?" అన్నాడు దిగులుగా.

"ఒక విషయం చెప్పనా?" అన్నది ఆమె బొటన వేలితో నేలమీద రాస్తూ.

అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"నన్ను మరచిపోండి."

"అట్లాంటి మాటలు మాట్లాడకు పద్మా."

"అబ్బా! మధూ! ఈ చుట్టుగీతలలో నిన్ను నేను కలుసుకో లేకుండా వున్నాను. ఈఅవస్థ భరించలేను. నేనిట్లా వస్తూంటే ఏం జరుగుతుందో కూడా తెలీను. నా జీవితం ఏమయినా అయిపోవచ్చు. నేను నశించిపోవటం నీకిష్టమా మధూ?"

"అబ్బ! ఏం చెయ్యను పద్మా! నన్నిట్లా ఎందుకు చేశావు? నువ్వు వెళ్ళిపోయిన క్షణంనుంచీ రంపపుకోత. నీదగ్గరకు, మీయింటికీ పరిగెత్తుకు వచ్చెయ్యాలని వుంటుంది. రాత్రిళ్ళు ఊరికినే వచ్చి మీ యింటిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాను. ఒక్కడ్నే వెనక్కి ఎట్లా వెళ్ళిపోయేది నేను?"

"మీరు యివాళే వెళ్ళిపోండి."

"పద్మా!"

"అవును మీరింకా యిక్కడవుంటే నేను మీతో వచ్చేస్తానేమోనని భయంగా వుంది. వెళ్ళిపోండి మధు బాబూ"

* * *

"ఒక్కసారి కళ్ళు మూసుకోండి మధుబాబూ."

"ఏమిటి?"

"ఊహుఁ. చెప్పను సిగ్గేస్తోంది. కళ్ళు మూసుకోండి"

అతను కళ్ళు మూసుకున్నాడు.

ఆమె అతని కెదురుగా వచ్చి నేలమీద మోకాళ్ళపై కూర్చుని అతని పాదాలకు నమస్కారం చేసింది.

అతను కళ్ళు తెరిచాడు. ఈదృశ్యం చూసి అతడి హృదయం చలించి పోయింది. శరీరం గగుర్పొడిచింది. "పద్మా!" అంటూ ఆవేశంగా ఆమె భుజాలుపట్టుకుని పైకి లేవదీశాడు. భయంగా, అఘోరకంగా వుంది. అదే ఆమెను మొట్ట మొదటిసారి తాకటం.

"నా వాగ్దానం గుర్తువుందా? ఇట్లా సెలవు తీసుకుంటున్నాను" అంది పద్మజ కళ్ళు క్రిందకు వాల్చి.

అతనో చేత్తో ఆమె ముఖం పైకెత్తి "ఎన్ని కలలు గన్నాను పద్మా. నేను పురుషుడ్ని, నువ్వు ప్రకృతివీ అనుకున్నాను. నేను పురుషోత్తముడ్ని, నువ్వు మహాసృష్టివీఅనుకున్నాను. నా తనివి తీరేదాక నిన్ను నాతో ఎక్కడెక్కడికో తీసుకుని, కబుర్లలో, మహదానందంలో, గొప్పగా వెళ్ళిపోదా మనుకున్నాను. అంతా..." అతని గొంతు వొణికింది. "వొట్టి కలే!"

"అయితే నన్ను తీసుకు వెళ్ళండి" అన్నది పద్మజ.

అతనాశ్చర్యంగా చూశాడు.

"అవును. తీసుకు వెళ్ళండి. మీయిష్టం వచ్చినంత దూరం తీసుకువెళ్ళండి. కాని వచ్చేటప్పుడు మాత్రం మీరొక్కరే తిరిగి రావాలి—నన్నక్కడే పడవేసి, పారవేసి. మరి ఈ ప్రపంచం, ఇల్లూ, సంసారం నన్ను తిరిగి స్వీకరించదుగా."

అతడామెను వొదిలేసి "పద్మా!" అన్నాడు వెర్రిగా.

*

"నే పోతున్నాను"

"మళ్ళా ఎట్లా, ఎక్కడ, ఎప్పుడు?"

"చెప్పలేను. మనం చచ్చిపోముగా అప్పుడే. జీవితంలో ఎన్ని యిలాంటి మధుర, విషాద సన్నివేశాలు నీకూ నాకూ మధ్య ఎదురు కానున్నవో."

"మీ చివరి కోరిక ఏమిటి?"

"చెప్పేదా? నవ్వవు గదా!"

"ఉహుఁ."

"ఒక అందమైన అమ్మాయికి, చాలా అందమైన అమ్మాయికి తండ్రిగా వుండాలని. అదేమిటో నాకు ఎప్పుడూ కలిగే చిత్రమైన కోరిక.

"అయితే నన్ను తీసుకెళ్ళి పోతారా?"

"ఊఁ"

"ఎత్తుకుని తీసుకెళ్ళి పోతారా?"

"ఊఁ"

"అబ్బ! నాకెంత యిష్టం! ఎంతయిష్టం మీరట్లా మాట్లాడుతోంటే"

"మరి సెలవు. నమస్కారం."

"ఛీ. మీరు నాకు నమస్కారం చెయ్యొచ్చా? విత్ డ్రా."

ఆమె అతని చేతుల్ని ఒకదానినుంచి ఒకటి మృదువుగా విడదీసింది. వాటిని అట్లాగే పట్టుకుని "ఏమిటి యీ చిత్రమైన బంధం? ఈ తియ్యని, అర్థంకాని, అమృతానుబంధానికి యీ జీవితంలో ఏమిటి ఫలితం?" అనుకుంది.

అతను వెళ్ళిపోయాడు.

253

# 31

అబ్బ! జీవితం ఎంత విశిష్టమైంది!

అనుభవించినకొద్దీ తరగనిది మనిషిని పాలించేది, వేధించేది, పులకరింపజేసేది, పాలించబడేది; చివరకు అర్థం గాకుండా మిగిలిపోయేది.

మధుబాబు ఎక్కడికో పోతున్నాడు, ఆ చీకటిలో — దారిని వెదుక్కుంటూ.

ఎక్కడనో కాంతికిరణం మిణుకు మిణుకు మంటోంది.

ఎక్కడ అది? ఎంత దూరం? ఏనాటికి, ఎంతకాలం యీ గమనం — విసుగులేకుండా అప్పుడప్పుడూ దిక్కు మొహంవేస్తూ మళ్ళీ ఉత్సాహంగా.

ఎన్ని అనుభవాలో, అనుభూతులో యింత చిన్న వయసుకే.

ఇవన్నీ అన్నికోణాలనుంచీ పరిశీలించటానికీ, సమగ్రమైన దృష్టి అలవర్చుకోటానికీ, వ్రాసుకోవటానికి — అతను రచయిత అయినందుకు గర్విస్తున్నాడు.

మళ్ళీ రాస్తున్నాడు కొత్త భావోద్రేకంలో, విలాప మధుర ధ్వనుల్లో, విషాద సంగీతాలాపనలలో.

తాత్కాలికంగా ఆవరించిన వైరాగ్యంలోంచి అతనిలోని నవలా కారుడు బయటకు వచ్చాడు. చుట్టూ సమస్యలు. జీవితంలోని ప్రతి అణువూ ఓ చిక్కుసమస్య. ఎవరి

వ్యక్తిగతమైన బాధ వాడిది. అది పరిశీలించటంలో ఆసక్తి పెరిగింది. ప్రజల బాధల్ని తమ బాధగా చేసుకుని కొందరు కవులు ఆలాపిస్తే, తమ బాధను ప్రజలముందు ఆలాపించారు మరికొందరు. ఇందులో ఉత్తమ సాహిత్యం కానిదేమీలేదు. స్వంత విషయాన్ని విశ్వజనీనం చేసినవాడే నిజమైన కళాకారుడు. అప్పుడే అతడి తపస్సు ఫలించినట్లు. ఒక మనిషి ప్రపంచంకోసం తపించినట్లే, ప్రపంచంకూడా ఓ మనిషి కోసం తపించినప్పుడే మనుగడ సార్థకం అయినట్లు.

లోతుగా ఆలోచిస్తే మామూలు విషయంలోకూడా గొప్ప సత్యాన్ని గ్రహించగలడు మేధావి. స్నేహితుడి పెళ్ళికి పోవటంలో, ప్రేమ సాఫల్యంలో, అయిదురూపాయల నోటు జేబులో వృధాగా హఠాత్తుగా ఎవడో స్నేహితుడు ప్రక్కను చేరటంలో, రిక్షావాడితో బేరం చెయ్యటంలో, తండ్రిమాట వినటంలో, డబ్బు విలువ గ్రహించలేక పోవటంలో, ఒకడిని ఒకడు సహాయం కోరటంలో, పేరు రావటంలో, పేరు పోవటంలో, భార్యతో కాపురం చెయ్యటంలో, తమ్ముడికి జబ్బుచేయటంలో, వదినగారు మూభావంగా వుండటంలో-వ్యక్తిగత పరిస్థితుల్ని బట్టి తీసుకుంటే ఎంత పరిధి! ఎన్ని చిత్రాలు!! ఎన్ని విపరీతాలు!!!

ఈ ఆసక్తిలో, ఆకర్షణలో మానసిక సంఘర్షణలో, మనశ్శాంతిలేని స్థితిలో అతని రచనలకు ఒకప్రక్క ప్రజలు జోతలు అర్పిస్తోంటే "అనుభవంలేదు, వాట్టి ఉత్సాహం" అని ఎక్కడో ఓ వెకిలి కంఠం అసహ్యంగా, కీచుగా వినిపిస్తోంది.

అనుభవానికి నిర్వచనం ఏమిటి?"

తిండిలేక మాడటమే, ఉద్యోగాలకోసం పాకు కుంటూ, కృశ్చి కృంగటమే; భోగం కులంలో పుట్టడమే, ఆడవాళ్ళకు వలలు పన్నుతూ బ్రతకడమే; స్వార్థాలతో వైష మ్యాలతో జీవించడమే అనుభవమా?

ప్రతి అల్ప విషయానికి ప్రాముఖ్యంయిచ్చి సాహిత్య సృష్టి చేస్తోన్న పాశ్చాత్య సాహిత్యవేత్తలని చూసి అభినం దించే మానవుడు అదేపని తెలుగువాడు చేస్తే ఎందుకు ఓర్చలేక పోతున్నాడు? "మన వాళ్ళలో కొత్తదనం లేదు, అభ్యుదయంలేదు" అని ఘోషలు పెట్టే ప్రాణి అది ఎవ రన్నా తీసుకువస్తే ఎందుకు సహించ లేకపోతున్నాడు?

ఎవరి జీవితం వారిది. పరిస్థితుల్ని బట్టి, వాతావర ణాన్ని బట్టి యీ భూమ్మీద వందల, వేల, లక్షల రకాల అనుభవాల సంపుటాలు.

తన స్వంత ప్రవృత్తితో అతడ్ని అతను స్వేచ్ఛగా పాలించుకుంటూ మలుచుకుంటూన్న యీ దశలో తనకు నచ్చిన కోణం నుంచి సాహిత్యసృష్టి చేస్తున్నాడు.

అందరూ ఒకేలా ఎందుకు రాయాలో అతనికి అర్థం కాదు. అతనికో దారి వుంది. ఆదారిన నడిచిపోతూ టెక్నిక్ కోసం, కొత్తవిధంగా చెప్పటంకోసం గిలగిల్లాడుతాడు. ఓ కొత్త ప్రయోగం చెయ్యాలని రచనంటూ చెయ్యలేదు.

ప్రపంచంలో ఒకటే గొప్పసిద్ధాంతం—అది సిద్ధాంతం అంటూ ఏమీ లేకపోవటం. ఎవడూ మనిషిని శాసించ లేడు. బుజ్జగించ లేడు. అట్లా చేసినా అది క్షణికం. ప్రపం

చాన్ని ఒక దారికి త్రిప్పటం ఎవరి తరమూ కాదు. సూచించు. నీ భావాలని స్పష్టంగా జరుగుతూన్నదాన్ని నీ భాషలో పరు. కాని ఎవర్నీ నీ దాసుల్ని చేసుకోవటానికి ప్రయత్నించకు. నిన్ను ప్రజలు ఆరాధించవచ్చు. ప్రాణం యివ్వవచ్చు. కాని వాళ్ళ వ్యక్తిత్వాలమీద అజమాయిషీ చెయ్యకు. నువ్వే తెలివైనవాడివనీ ప్రపంచం నిన్ను అర్థంచేసుకోవటల్లే దనీ కేకలు పెట్టకు. నీ చుట్టూ పరిధులు గీసుకోకు. ఒకే గిరిలో ప్రదక్షిణాలు చెయ్యకు.

తనకు తోచిన విషయాన్ని గురించీ, చూసిన విష యాన్ని గురించీ, అనుభవించిన విషయాన్ని గురించీ — స్వచ్ఛంగా, విశృంఖలంగా రాస్తున్నాడు.

తను ఏదో సాధించాలి. ఉన్నత శిఖరాగ్రాలు చేరు కోవాలి. నిమిషాల విలువ తెలుసుకుంటున్నాడు. తను డాక్టరు కావాలి. రచయితగా నిలవాలి. రోగులకు, పాఠకు లకు శక్తి ఉన్నన్నాళ్ళూ శారీరకంగా, మానసికంగా మంచి మందు యిస్తూ, అట్లాగే బ్రతకాలి.

సుఖం! సుఖం!! లేకపోతే పోనియ్యి. అందుకే యిదంతా: యీ తపన. అన్వేషణ

తన కథలు కొన్ని సినిమాలుగా వస్తున్నాయి, ప్రజలు చూస్తున్నారు. తను అందరకూ సన్నిహితుడు అవుతు న్నాడు. రచయితగా యింత మధుర-విషాదమైన జీవితం వుందని తెలుసుకుని, ఆశ్చర్యపడుతున్నాడు.

• ఇది తన ఆవేదన, ప్రజలకు తన నివేదన.

## 32

ఓ రోజు... ...

రాత్రి పదిగంటలైంది. శైలజపడుకునివున్న గదిలో బెడ్‌లైటు సన్నగా వెలుగుతోంది. గదికిటికీలకు తెరలు కట్టేసి వుండటంవల్ల ఆమెకు ఆకాశం కనిపించదు.

"చినబాబూ!" అని పిలిచింది ఆమె నీరసకంఠంతో.

"ఓయ్!" అంటూ మధుబాబు లోపలకు వచ్చాడు.

"ఇంతసేపూ ఏం చేస్తున్నావు?"

"బయట వసారాలో నిలబడి వున్నాను."

"చాలా రాత్రవుతోంది. ఇహ పడుకోకూడదూ?"

అతనేం జవాబు చెప్పలేదు

"నాకేం కాదు చినబాబూ! ఇంకా కొన్నాళ్ళపాటు బ్రతుకుతాను. నా కోసం శ్రమపడవద్దు."

అతనామె ముఖంలోకిచూస్తూ "మీరు పడుకుని నిద్రపోండి ఆట్టేమాట్లాడటం ఆరోగ్యానికే హాని"అన్నాడు.

"చాలా అశాంతిగా వుంది చినబాబూ!"

అతను మెదలకుండా ఊరుకున్నాడు.

"నా జీవితం యిలా అంతమౌతుందని తెలుసు.

ఎన్నో చేశాను. ఎన్నో మలుపులు, అనుభవాలు. ఎంతో పైకి వచ్చాను. కాని నాకు కావలిసిందేమిటో కనుక్కోలేక పోయాను. ఎంత వెతికానని. అబ్బ! చివరకు అసంతృప్తి తోనే వెళ్ళిపోవాల్సి వస్తోంది చినబాబూ. నాకు కావలిసిం దేమిటో నువ్వయినా చెప్పవూ?"

అతని గుండె కెలికినట్లయింది. ఈశైలజ ఒకనాడు తనదగ్గరకు రోగిగా వస్తానని ముందుగానే అడిగింది మన శ్శాంతికోసం అన్వేషణ లోని వ్యక చేష్టితాలలో ఆమె ఆరో గ్యం దెబ్బతింది. మంచాన పడి తీసుకుంది. కొన్నాళ్ళు గడి చాక తనను వచ్చి తీసుకువెళ్ళమని మధుబాబుకు వైర్ యిచ్చింది. అతను కారులో మద్రాసు వెళ్లి ఆమెను తనతో తీసుకు వచ్చాడు. ఆమె భర్త అప్పుడప్పుడూ వచ్చి చూచి పోతున్నాడు.

"ఆ కుర్చీ యిలా దగ్గరకు లాక్కుని కూర్చో చినబాబూ!"

అతనామె మంచానికి చేరువగా కుర్చీలో కూర్చు న్నాడు.

"జవాబు చెప్పవూ?"

మధుబాబు ఓ నిట్టూర్పు విడిచాడు. "మనకు కావలి సిందేమిటో తెలుసుకోవటమంటూ ఎప్పుడూ వుండదు శైలజాదేవీ! కాని ప్రపంచంలో తృప్తి అనేది ఒకటుంది. అంతకంటే పెద్ద ఆకర్షణ మరొకటి లేదు. మనుషులు ఎక్క డికక్కడ తమశక్తి సామర్థ్యాలు కొద్దీ ఏదో ఒకటి సాధించి



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B193 |
| పుస్తకం పేరు | జాలిలేని జాబిలి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 259 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2, 39,40 |
| తయారు చేసినది | Afsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |